# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*.

మార్చి 1978

సంపుటము : 55 సంచిక : 3

విడిపత్రిక వెల రూపాయిన్నర



# జ్యోతిషానికి భవిష్యత్తు తెలుసా?

తెలుసు.

ఆంధ్రప్రదేశ్‌లో భవిష్యత్ కాలాన్ని చూడగల జ్యోతిష్కులున్నారు.

తొమ్మిదిగదుల్లో దోబూచులాడే నవగ్రహాల వైనం తెలిసిన జ్యోతిశ్శాస్త్ర పండితులు మాత్రమే కాదు సుమండి !

సగటుమనిషి జీవితపు చీకటిగదుల్లో రేపటి వెలుగును నేడే చూడగల ఆర్థిక శాస్త్ర ప్రవీణులు.

సామాన్యుడి జీవితంమీద స్వతంత్ర భారత సంస్కృతి ముద్రవేయగల ప్రణాళిక వ్యూహ రచయితలు.

"నాదేశం ఏ రంగంలో ప్రగతి సాధించినా, దాని ఫలితాలు భారతీయు లందరికీ సమంగా దక్కాలి, అప్పుడే నేనా ప్రగతిని గుర్తిస్తాను." అన్నారు బాపూజీ. బాపూ కన్న కలలను నిజం చేస్తున్నాయి నేటి పంచవర్ష ప్రణాళికలు.

ఐదవ పంచవర్ష ప్రణాళిక ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం పాలిటి వరం. **1973-74**లో ప్రణాళికా పెట్టుబడి రూ. **93** కోట్లు వుండేది. **1974-75**లో రూ. **148** కోట్లకు చేరిన యీ వ్యయం **1975-76** నాటికల్లా రూ. **203** కోట్లకు పెరిగింది.

గత సంవత్సరం **1976-77** వార్షిక ప్రణాళిక పెట్టుబడి రూ. **298** కోట్లు. **1977-78** ప్రణాళికా కాలానికి రూ. **383** కోట్లకు పెంచారు.

**1978-79**లో యిది రూ. **450** కోట్లు ఉంటుందని భావిస్తున్నారు

నాల్గవ పంచవర్ష ప్రణాళికా కాలం మొత్తం పెట్టుబడి రూ **499** కోట్లు మాత్రమేకాగా ఒక్క **1978-79** వార్షిక ప్రణాళిక పెట్టుబడి ఈ మొత్తానికి రమారమి సమానమన్న మాట ఐదవ పంచవర్ష ప్రణాళికా కాలంలో మొత్తం పెట్టుబడి సుమారు రూ **1480** కోట్లు వుంటుంది - యిది నాల్గవ ప్రణాళిక పెట్టుబడి కంటె మూడురెట్లు అధికం.

ప్రణాళికలు విజయవంతమైతే ప్రగతి భేరి ప్రతి మనిషి గుండెలో ప్రతిధ్వనిస్తుంది.

తెలుగు తల్లి జడలో ప్రగతిపుష్పం ఫక్కున వికసిస్తుంది !

*డైరెక్టరు, సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్.*
32/77-78



# విషయానుక్రమణిక

## మార్చి 1978





# వాక్యాల్లోనే దర్శనమిస్తాను

శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ

నేను

బ్రతుకులో బాగా జలక మాడాను — అనేక లోతుల్లోకి దూకాను అనేక ఎత్తులకు ఎగబ్రాకాను : ఒకచోట నిలవ లేదు ఒకచోటు చేరలేదు, సముద్రాలు యాత్రించిన సాహసికుడ్ని.

ఎన్నో కలల్ని పద్యాల పడవల్లో తెచ్చి మీ తీరాలకు చేర్చాను, పర్వతాల్ని పెకలించాయి ఈ చేతులు ఈ లోహదండాలు, ఖండ ఖండాంతరాల్ని బంధించి లాక్కొచ్చాయి, ద్వీపాలను ద్వీపకల్పాలను కుక్కల్లా తిప్పాయి మీ ముందు —

నేను

ఇప్పుడు నా హృదయాన్ని ఆకాశవీధుల్లోకి ఎగరేసి నన్నొక జెండాగా ప్రతిష్ఠించుకున్నాను ! అదుగో, చూడండి గాలుల్లో ఎగురుతున్న ఆ రంగుల పేలిక ఈ యుగానికి నాలిక—రండి నేత్రాల ఊరేగింపులు తీసుకుని రోడ్ల మీదుగా నగరాలమీదుగా ఎడారులమీదుగా అరణ్యాలమీదుగా మిలియన్ల ఊరేగింపులు తీసుకుని రండి :

నేను

మనిషి ముందుంటానెప్పుడూ మీకు తెలీదు, ముందున్న వస్తువుల్ని పట్టుకుంటాను నా అదృశ్య కిరణాలతో; నాకు గ్రహణం రాహువుకాదు అసూయా విష బాహువు, నా శత్రువులు నా రోజుల్ని ఊపిరిగా పీలుస్తున్న వాళ్ళుకాదు నా కాలం నాదేశం నా భాష వాటికి లొంగని నా అంతర్ జ్వాల—కుంగిపోకు ఓ శేషేన్, ఇవాల్టి ఉదయాన్ని రేపటి ఉదయం మరచిపోతుంది, గుండె ఆడుతూఉండనీ ఏ కొమ్మలో చీల్చుకుని పూలు రాకమానవు

నేను.

చెపుతున్నా ఇదుగో నా మాటలు వినండి వినివిని ఆలోచనా దంతాలతో నమిలి నమిలి నా మాటల లోతుల్లో మునిగి పోండి. ఎవడు చచ్చి మన జీవితాల్లో పూలు పూయిస్తాడో వాడిభాష చిరంజీవి —

నేను

కేరళలో మీరుచూచిన నేనుకాదు నేను మద్రాసులో మీరు చూచిన నేనుకాదు హైదరాబాదులో నాగపూర్లో జయ పూర్లో మీరు చూచిన నేను కాదు; నేనిప్పుడు మీకు నా వాక్యాల్లోనే దర్శన మిస్తాను !

నేను

ఇవాళ ఉదయం ఒక విలాస నావనై నా శరీరంలో ఈదు తున్నాను వాక్యాలు తీగెలుగా బిగించి నన్నొక వాద్యాన్ని చేసుకుని మీకు సమర్పించుకుంటున్నాను నేను స్వరాన్నయి పోతున్నాను. నా ప్రాణాలూ నా మూర్ఛలూ తోడుకుని తాగండి నన్నొక రేవు చేరనీండి నా స్వర్గాలన్నీ ఇక్కడే కుమ్మరిస్తా —



# రిరంసనై... వెన్నెల్లో వాన

సంధ్యారాగరక్తి, మా తాంబూల చర్వణం చేసిన సాయంకాలపు కడలి కెరటాలు విదిలించిన గగన తారల సోయగాల పుప్పొడి పరుపుమీద ఒత్తిగిలాను, మెత్తనీ చంద్రుడ్నిచూస్తూ. గాలీ, వెన్నెల గాఢాలింగనం చేసుకొని చెట్లగుబురుల్లో ఊసులాడుకుంటుంటే మధ్య మధ్య మబ్బు కలిగించే క్షణాల వియోగాన్ని విరహ నిశ్శబ్దపు నిట్టూర్పుగా చెప్పుకుంటుంటే నేను ఓరగా కళ్లమూసుకు పడుకున్నాను, నిదురరాదు. అలా అని నిదురకాకనూపోదు. ప్రపంచం దక్షిణ దిక్కున చందన తైలం ఒలకపోసుకొన్న సుతారపు వాసన నా ముకు పుటాలకు తాకిన మెత్తని స్పర్శతో వెన్నెల మైదానంలో ఒళ్లు విరుచుకోబుద్ధివేసి మూసిన కళ్లను తెరిచాను. కాలం నవ్వుతూ కనిపించింది. తెరిచిన కళ్లను విశ్వంపై పరిచాను.

ఎదురుగా చెట్టు
వెన్నెల విరబోసుకున్న జుట్టు.

ఈ వెన్నెలగురించి ఏవేవో ఊహించి నాలుగు మాట లల్లితే ఎన్నెన్నో అనుభూతుల అందెలెందుకు ప్రయోగుతాయో తెలియని నాలో వన్నెలు చిగురించి ఏవేవో కోరికలు చకోరికలై ...

ఈ పున్నమ చెట్టు పట్టుకొమ్మల్లో
నిశ్శబ్ద గీతాలు పాడతాయి ...

వికసిత సితాజ్యోత్స్నాసుమ తుందిల గంధ మకరందా స్వాదినై ఈ చెట్టుక్రింది తారామకుళిమల నేరుకుంటూ, అవ్యక్త తీరాలనుండి తెరలు తెరలుగా పొరలు, గాలిరివటల పాటవింటూ, ఈ సపాసిత మనసుకు ఉపాసిత ఊహాసారం విందిస్తాను.

నేనిక పున్నమచెట్టు నిలిపిన వెన్నెల చివురు నీడలో మల్లెగావూరే ముల్లునై ...

పున్నమచెట్టు వీచిన వెన్నెల చివురు గాలికి తడిసి మధూళిగా మారే ధూళినై ...

విరాళి రెక్కలెత్తిన హిమరాజ హంసనై రిరంసనై ...
మీ ఎదలో నిదురిస్తాను విశద మంజరులార !

పృథివీ పురంధ్రి
పున్నమ వెన్నెల పట్టుచీరకట్టి
మంచు చుక్కల పూలు
కబరిలో తురుముకొని
శబరిలా నిలుచున్న
పరవశంలో
గాలి వ్రేళ్లు చెట్ల సందుల్లో
వీణ మీటుతున్న వివశంలో
నా హృదయాంతర్గతరమ
భావనా సుషమ
నా నేత్రాంచల సీమల్లో కదులుతున్నవేళ
వాన ...
ఎదల లోతుల్లో అమృతంపుసోన ...
జాలువారు జలపాతం తెరలో
వెలుగు ముద్ద వెలసినట్లు
చినుకు చినుకు సందులోన
శక్రధనువు మెరిసినట్లు ...
హిమదీపంచుట్టూ
జరీపోగుల తెరలల్లినట్లు
వర్షంలో తడిసిన వెన్నెల
వర్షానికి సొగసులు దిద్దినట్లు
వెన్నెల్లో కురిసేవాన
వెన్నెలకు కలంకారీ అద్దినట్లు
ఎక్కడో చూసినట్లు
కనిపించే
ఎదలో దూసినట్లు
అనిపించే
వానలో వెన్నెల
వెన్నెల్లో వాన ...

"సాంధ్యశ్రీ"

# 'గ్రహణంలో మనిషి'

## శ్రీ నందిని సిధారెడ్డి

"యిన్నావ్‌రా,
ఆయింత పొలం దున్నేదాంక
యెన్కకు జూడకుండ్రి మల్ల, ఆఁ..."

"అట్లనే పట్నా,
గని, నిన్నట్నుంచి కడ్పులకేం బోలే
గిన్ని జొన్నలు వోయించుండ్రి
గట్క,[1] మంచినీళ్ళు దాగిపోతం."

"యెంకా!
యెంతెడ్డోనివిర;
బువ్వ గివ్వ, గట్క బొట్క ఏద్దినొద్దని
కొనకు మంచినీళ్లు గూడ దాగొద్దని
బాపన పంతులు పంచాంగం జూశ్చెప్పిండు
గానం[2] బడ్తదంటింక జెర్రయితే..."

"గానం బడ్తె ఏద్ది నొద్దా దొరా?
మల్ల, కడ్పుల కేం లేంది
పనెట్ల జెయ్యాలె బాంచెన్"

"గానంల దింటే...
పానంకు ముప్పయి తది,
కాలో సెయ్యో కుడుత్తది,
ఏద్ది నొద్దు, జాగర్త గుండాలె
కుండల్ల, యెస్లల్ల
గడ్డిపోస లేసుంచుండ్రి
యెవలన్న పిల్ల తల్లి గినుంటె
కదలకుంటుండు మనుండ్రి
కాన్పుకు ముప్పొత్తది మల్ల —
గని—మీర్గిట్ట గానం బడ్తంటె జూశేర్
కండ్లు పచ్చగయితయ్, కన్పడ కుంటయితయ్!"

"అట్లే పటేలా —
అయితాయెగంని గానమంటేంది బాంచెన్?"

"మీరు జూడొద్దు గని
మేం [3]తంబాలంల నీళ్ళు వోసి
నీళ్ళల్ల జూసినం. మల్ల జూత్తం."

"[4]పొద్దును శీకటి మింగుతది గంతే
గదే గానం!
అన్ని సర్పాయెగని
అదని ఇదని పెయికరావ్ జేస్కోకుండ్రి
పొయ్యి పని జెయిపోండ్రి జెల్ది జెల్ది"

"మంచిద్పట్లా వొస్తా!"
యెంకడు పటేలు దగ్గర సెలవు దీస్కోని
పనికి వెళ్లబోతుంటే
చూడొద్దన్న "పొద్దు"
'ఛక్' మంది —

"గానం పట్టింది
గాడేన్పో గాదు.!
'గానం' 'గానం' అన్కుంట
మా బత్కులకే గానం బట్టిచ్చిండ్రు
గ్యానం లేక గని—?!
గానమేం జేత్తది??
బత్క దానంతలదే పువ్వోలె యిచ్చుకుంటది."

---

[1. జొన్నన్నం; 2. గ్రహణం; 3. ఒక వెడల్పాటి పాత్ర
4. సూర్యుడు; 5. గ్యానం=జ్ఞానం.]

# "శాంతిప్రస్థానము"

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

ఇదిగో !! చైతన్యకేతన మెత్తిముందు
   నడచు చుంటిని వెన్కనందఱునురండు !!
పోవుదము మానవత్వ ప్రఫుల్ల పుష్ప
మంజరీ లతావేష్టిత కుంజములకు !!

అచట నిత్యము మధుమాస మవతరించి
యుండు—కోకిలల్ కూయుచునుండు—నళులు
గీతముల మ్రోయుచుండు—సంగీత నిధుల
త్రవ్విపోయుచునుండు నిస్తంద్రదయురులు !!

అచట నవ్వ్వన ప్రతి సుమంబఖిల విశ్వ
శాంతి వెదకెడు విజ్ఞాన కాంతిరేఖ !
అచట విహరించు మృదు సమీరాళి, శాంతి
దేవతా స్నిగ్ధ కారుణ్య భావలేఖ !!

ఆవనంబున, కుసుమసింహాసనమును
అధివసించిన యొకదేవి—మధుర మధుర
నిత్యమధుమాస నవకళా నిచయ కాంతి
నింపి చల్లగా జనులఁబాలింపుచుండు !!

ఆమె చైతన్యమంజరి—అతుల విమల
భావ భాస్వన్మనోహరి—ఆర్ద్రహృదయ !!
సుమధురామృతవాగ్ఝరి—విమలకాంతి
కాంత — "శాంతిదేవత"—మహాకరుణమూర్తి !!

కుల మతమ్ములులేని—యే కుటిల హృదయ
వర్తనంబులులేని—యావనమునందు
శాంతిదేవత మృదుపదాబ్జముల మ్రోల
ముదముతో తుమ్మెదలుగ మ్రోవుదమురండు !!

ఇదిగో !! చైతన్య కేతన మెత్తిముందు
నడచుచుంటిని వెన్కనందఱునురండు !!

---

# ఇంద్ర ధనస్సులు లేవు

శ్రీ వనమాలి

అన్నిరకాల రంగులు లేవు
   నా జీవితంలో తెలుపు నలుపులే
అని నేనంటే
బహుశా నీకు హాస్యాస్పదంగా వుండొచ్చు.
ఉఫ్ వంటరిగా నిలిచి నిలిచి
ఎలా నిరీక్షించాలోకూడా మరిచిపోయాను
కానీ
అందమైన గాలులతో మేఘాల తెరచాపలతో
వర్షం వస్తుందని తెలుసు
వర్షంకంటె చిత్రమైంది లేదీ ప్రపంచంలో.
వర్షం ప్రారంభమైనప్పుడు నేను
గతంలోకి గంతులేస్తూ బాల్యాన్ని చేరుకుంటాను
ఏ దశలో నా కోర్కెలు స్వచ్ఛంగా స్పష్టంగా
వర్షపు చినుకుల్లా వుండేవో !
వర్షం బలీయమైన ఆకర్షణకి ప్రతీక
నీటిబొట్లు చెరువుల్ని నదుల్ని వదిలి

గాలిలో ప్రయాణిస్తూ వ్యక్తిత్వం కోల్పోయి
మేఘాల్ని ఆశ్రయిస్తాయి
కోర్కె బలీయమైనప్పుడు అధోముఖంగా ప్రయాణిస్తాయి.
కోర్కె—ఆకర్షణ సమానార్థాన్నిచ్చే భిన్నపదాలు
ప్రకృతి నిర్మాణాత్మకమైన ఆలోచనలో వున్నప్పుడు
వర్షం వస్తుంది.
నువ్వు వద్దంటున్నా నీ యింటిని ప్రవేశిస్తామంటాయి
రోడ్డులో నిలిచే పశువుల మందలాటి నీళ్ళు.

ఓహ్ !
ఈ వర్షం ప్రభావం నా దేహంమీద
నా భావాలమీద
శాశ్వతంగా నిలిచిపోవుగాక.
మండు వేసవిలాటి యవ్వనంతో
ఈ రెండు రంగులతో
నేను విసిగి పోయాను.

# 'జెన్' భావ శకలాలు

శ్రీ విరించి

## ద్వంద్వాలు :

అందరూ అందాన్ని యిదే 'అందం'
అని గుర్తించినప్పుడు
'వికారం' అక్కడ స్థావరించుకుంటుంది.

మంచిని అందరూ 'మంచి' అంటే యిదేనని
ముక్త కంఠంతో పలికినప్పుడు
'చెడు' అక్కడ స్థిరీకరించుకుంటుంది.

'అవును—కాదు' అనే మాటలు ఒకేమారు పుడతాయి
'కష్టము-సుఖము' ఒకేమారు సాక్షాత్కరిస్తాయి
'దూరము—తీరము', 'ఎత్తు-పల్లము'
ఇలాంటివన్నీ పరస్పరాశ్రయంలో మెలుగుతాయి
'ముందు-వెనుకలు' పర్యాయపదాలు అవుతాయి.

*　　*　　*

## సృష్టికర్త :

ఒకరోజు
మనసులోని ఆలోచనలన్నీ తుడిచి
కోరికలన్నీ విసర్జించి
పదాలు—భావాలు వదిలేసి ప్రశాంతంగా కూర్చున్నాను.

ఏవో కొత్త తీరాలకు
ఎగిరెగిరి పోతున్నట్లు అనిపించింది.
అవగాహనకు అతీతం అయిన
ఆకాశంలోనికి తేలిపోతున్నట్లు అయింది.

ఆఁ !... చేరుకున్నాను.
ఇంద్రియాల సరిహద్దులు దాటిపోయాను
ఇంకా సశరీరినే
కాని విశ్వకేంద్రంగా నిలబడివున్నాను.
మాట్లాడు తున్నానుగాని నా
మాటలకు అర్థం లేకుండా పోయింది.

నా వయిపు జనం పరుగు పరుగున వస్తున్నారు.
జనం అందరో ఎందరో కాదు, ఒకే ఒక వ్యక్తి;
అందరూ నేనే.

ఈ నూతన ప్రపంచాన్ని నేనిదివరకు చూడలేదు.
నన్నెవరో సృష్టించారనుకున్నాను యిన్ని నాళ్లూ
కాదుసుమా, నేనే అనాదినుండీ సృష్టికర్తను.

డాక్టర్ సి. వి. రామచంద్రరావు

# అర్వాచీన తూర్పుగాంగ, సూర్యవంశ గజపతి రాజుల రాజ్యపాలనాదర్శము - గుణగణములు

అర్వాచీన తూర్పుగాంగ భూపతులు అర్ధశాస్త్రకారుడు నిర్దేశించిన 'యోగక్షేమము'[1] లను తమ ప్రజలకు సమకూర్చుటకు పాటుపడిరి. అర్వాచీన గాంగ భూపతులలో మొదటివాడుగ నెంచబడుచున్న మూడవ వజ్రహస్తుని (క్రీ. శ 1038 – 1070) పరిపాలనమునుగూర్చి చెప్పుచు. అతని చిక్కాలవలస శాసనము (శక 982) అతడు న్యాయముదప్పక త్రివర్గగామియై భువిని రక్షించెననియు, అతని కాలమున ప్రజలు పాపము చేయనివారై, వ్యాధులు, ఆపదలు లేనివారై, అభ్యుదయోపేతులై యుండిరని నుడువుచున్నది. ("న్యాయేన యత్ర సమమాచరితుం త్రివర్గ మార్గేణ రక్షతి మహీమ్ మహిత ప్రతాపే నిర్వ్యాధయశ్చ నిరఘాశ్చ నిరాపదశ్చ శశ్వత్ప్రజా భువి భవన్తి విఘాతిపర్త్య...")[2] ఇట్టి రాజ్యపాలనాదర్శము అర్వాచీన గాంగప్రభువులకు వారి పూర్వీకులైన పూర్వగాంగ రాజన్యులనుండి వారసత్వముగా సంక్రమించినది పూర్వ గాంగరాజైన దేవేంద్రవర్మయొక్క చీడివలస తామ్రపట్టికలలో (గాంగశకము 379), అతని రాజ్యపాలనలో ఇతరుల ద్రవ్యము నపహరించుట అనునది లేక 'స్తేయ' శబ్దము నిరర్థకమైపోయినదని చాటుచున్నవి. ("యస్మిన్వ సుమతీం పాతి స్తేయ శబ్దో నిరర్థకః పరద్రవ్యాపహరణ విరహః)[3] క్రింద చెప్పబోవు అర్వాచీన గాంగ భూవీరుల శీలసంపద, మేధాసంపత్తులనుబట్టి వారెల్లరు, మూడవ వజ్రహస్తుడు తన పాలనలో గలదని చెప్పిన ప్రజాభ్యుదయమే ఆదర్శముగ పరిపాలన కావించిరని చెప్పవలసియున్నది

క్షేమ సౌభాగ్యములతో గూడిన ప్రజాపరిపాలన గావించుటలో సూర్యవంశ గజపతులు అర్వాచీన గాంగులకు తీసిపోలేదు. తీరాంధ్ర దేశమున లభ్యమైన కైఫియత్తులు రెడ్డి రాజులకు, విజయనగర పాలకులకు తీసిపోని విధముగా గజపతులు ధర్మపాలన గావించిరని పదే పదే చెప్పుచున్నవి. ఈ కైఫియత్తులు ఆంధ్రదేశమున గజపతులు గావించిన దేవాయతన, నగర నిర్మాణములను గూర్చి, ఒసగిన అగ్రహారములను గూర్చి, పరిహరించిన పన్నులనుగూర్చి విశేషముగ పేర్కొనుచున్నవి. ఉదాహరణకు, దొడ్డుగల్లు కైఫీయతు "యిటు తరువాతాను కపిలేశ్వర గజపతిదేవు మహారాజులు రాజ్యం యేలుచుండను ధర్మపరిపాలన చేసినందున దొడ్డుగొల్లుశీమకు లోనైన గ్రామములయందు ప్రజాసమృద్ధి అయివుండగా..." అని కపిలేశ్వర గజపతి ధర్మపరిపాలనను ప్రస్తావించుచున్నది.[4] (దొడ్డుగొల్లుశీమ విశాఖపట్నం జిల్లాలోనిది). గజపతుల పరిపాలనను గూర్చిన ఇట్టి ప్రస్తుతులు కైఫియత్తులందు ఎన్నేని కలవు. ప్రతాపరుద్ర గజపతి పేర పరగు 'సరస్వతీ విలాసము', గజపతులు వర్ణాశ్రమ ధర్మముల రక్షించి, దుష్టశిక్షణ శిష్టరక్షణ తమ ధ్యేయముగ, ధర్మశాస్త్రానుబద్ధముగ పాలన సాగించిరని తెలుపును. "వ్యవహార" జ్ఞానావశ్యకతను తెలుపుచు, వ్యవహారము (న్యాయపాలన) దుష్టనిగ్రహము సాధ్యము గావించుననియు, అందుచే వర్ణాశ్రమధర్మము రక్షింపబడి ప్రతివ్యక్తి తన స్వధర్మము ననుసరించుటకు అనుకూల్యము కలుగుననియు 'సరస్వతీ విలాస'కారుడు చెప్పుచున్నాడు.[5]

ఆదర్శపాలకునికి ఉండవలసిన సద్గుణములను, ఉండగూడని అవలక్షణములను కాకతీయ గణపతి, రుద్రాంబల ఆచార్యుడును అమాత్యుడు అయిన శివదేవయ్య విరచిత పురుషార్థసారమునుండి ఉద్ధరించి రాజనీతి సంకలన గ్రంథమైన 'సకలనీతి సమ్మతను' ఇట్లు పేర్కొనినది :

సకల జనాను రంజనము సత్యము శౌచము మంత్రగోపనం
బకృపణవృత్తి దక్షత ధనార్జిత శీలత భోగమీగి నా
స్తిక ఖలసంగవర్జనము శిష్టవిధేయత దుష్టనిగ్రహం
బకుటిలభావ మింద్రియ జయంబు గుణంబులు భూమిభర్తకున్[6]

ఈ గుణములనే కౌటిల్యుడు 'అభిగామిక గుణములని' పేర్కొనినాడు. పాలకునికి వుండవలసిన ఆత్మ, బుద్ధి, ఉత్సాహ గుణములను, (తెలుగు) కామందకమునుండి ఉద్ధరించి, 'సకలనీతి సమ్మతము' ఇట్లు పేర్కొనినది :

వాగ్మి ప్రగల్భుడ వంచిత స్మృతియు నుదగ్రుండునుగ్ర బలాధికుండు
దండనయ క్రియాదక్షుండు కృతవిద్యుడధిక నృపవర్గుండు నమిత బుద్ధి
అహితాభియోగ ప్రహననుండు సర్వదుష్ట ప్రతీకార విచక్షణుండు
శత్రురంధ్రాను వీక్షణ కళానిపుణుండు సంధివిగ్రహతత్వ సారవేది

గూఢమంత్ర ప్రచారుండు రూఢదేశ
కాలభేదకుడర్థసంగ్రహ విదుండు
నుచిత పాత్రజ్ఞుడును వినియోగరతుడు
నైన భూపతి యాత్మగుణాకరుండు.

విం నిచ్చగించుట వేడ్కతో వినుటయుఁ బన్నుగా విన్నవి పట్టుటయును
దగఁ బట్టునవి ధ్రువంబుగ నిల్పుటయు నర్థసమితి సాధ్యా సాధనముల యెఱుక
అర్థ విజ్ఞాన సమర్థ మహోద్యోగరతియు నయుక్త విరక్తతయునుఁ
గార్య స్వరూపంబు కడఁకతోఁ గైకొంట యవిబుద్ధి గుణములై యెందుఁ దనరు

విహిత కోపశౌర్యవీత జాడ్యము శీఘ్రు, కారితలు దలంపగా ధరిత్రి
నొప్ప గలిగినట్టి యుత్సాహ మీ గుణాయత్తుఁడై నవాఁడె యవని విభుడు
భయ లోభావృత మత్సరత్వములు కోపంబీర్ష్యయుం ద్రోహమున్
బ్రియమున్ జాపలమున్ బరాపకృతి యుద్రేకంబులున్ జాడ్యమా
స్యయుఁ బైశున్యములున్ దొఱంగి ప్రియవాక్యం బన్నుఁడై వృద్ధసే
వయునుం గల్గినవాఁడు దాను నరదేవప్రాప్తి కర్హుండగున్.[7]

నీతిశాస్త్ర రచయితలందరు ఈ సమగ్ర గుణ పరిగిణనమును ఏదో ఒక రూపమున చెప్పియున్నారు ఈ గుణము లన్నిటిని నాడు పరిపాలించిన రాజులు యదార్థముగ కలిగియుండిరా, లేక ఇది పుస్తకములకు మాత్రము పరిమితమైన ఒక ఆదర్శగుణానుక్రమణిక మాత్రమేనా అనునది విచారణీయము. ఒక్క విషయము గట్టిగా, చెప్పవచ్చును. హైందవ రాజన్యులకు సంబంధించినంతమట్టుకు ఈ గుణములు వారి నిజ జీవితములందు, దైనందిన పరిపాలన యందు ప్రతిబింబించి, అనుష్టితములైనవే కాని, శాస్త్రకారుని ఊహాజనితములై శాస్త్రముయొక్క పుటలకు మాత్రము పరిమిత మైనవి కావు. భారతదేశ చరిత్రలో, పదే పదే చెప్పబడిన జనక మహారాజు మొదలు, తమ విద్యచే, సదాచారముచే, సామర్థ్యముచే, శీలసంపదచే పై చెప్పబడిన ఉన్నత గుణప్రమాణముల నందుకొన్న రాజర్షితుల్యులైన పరిపాలకు లెందరినో సగర్వముగ పేర్కొన వచ్చును; వీరు సమకాలీన సంస్కృతీ సోపాన పరంపరలో పై మెట్టున నిలచినవారు. గాంగ, గజపతి రాజుల స్వామి సంపదను, ఆత్మసంపదను తెలుపు వారి శాసనముల నుండి మనము చిత్రించ గల వారి సూక్ష్మ అక్షర తూలికా చిత్రములు, వారు—స్మృతులలో, నీతి గ్రంథములలో నిర్దేశింపబడ్డ ఉన్నత ప్రమాణములను చాల మటుకు అందుకొని, ఇతర జాతుల యందు, దేశముల యందు అరుదై, సంస్కృతీసోపాన పరంపరలో పై మెట్టున నిలచిన రాజన్యుల శ్రేణిని చేరగలరని మన కెరుక పరచును.

అర్వాచీన గాంగ రాజులు, తమ పూర్వీకులును, సగోత్రజులు నైన పూర్వ గాంగ రాజుల వలెనె తాము 'అఖిల భువన వినుతా నయ, వినయ, దయా, దాన, దాక్షిణ్య, సత్య, శౌచ, శౌర్య, ధైర్యాది గుణరత్న' పవిత్రులమని, విమల విచారాచార 'పుణ్య సర లములచే కలికాల కల్మష దోషములను ప్రక్షాలిత మొనర్చిన వారి మనియు చాటుకొనిరి.[8] గొప్ప శీలసంపద, జనహితైక చింత కలిగి యుండుటయేగాక, గాంగ, గజపతి భూపతులు స్మృతి, నీతి గ్రంథముల యందు నిర్దేశించిన విద్యా శిక్షణలను గడించిరి. రాకుమారులు అన్వీక్షకి, త్రయీ, వార్తా, దండనీతి, అశ్వ హృదయము, ధనుర్వేదము ఆదిగాగల విద్యలను నేర్వవలెనని నీతి శాస్త్ర రచయితలు నిర్దేశించియున్నారు.[9] వారు విద్యా చతుష్టయ మును, చతుష్షష్టి కళలను నేర్వవలెను.[10] వర్ణాశ్రమ ధర్మ బద్ధమై సంఘటితమైన హైందవ సమాజమున, పాలకుని గుణ సామర్థ్యములపై చాలమటుకు రాజ్యక్షేమము ఆధారపడినపుడు, ఉత్తరకాలమున సింహాసనాదికారముగల రాకుమారుల విద్యాశిక్షణలను గురించి ఎంతేని శ్రద్ధ వహించుట అవసరము. గాంగ, గజపతి పృథ్వీశులు శాంతి, సమరముల కుపయుక్తమగు విద్యల ననేకము గడించి యుండుట మనము గాంచగలము

మూడవ వజ్రహస్తుడు (1038 – 1070) ఖ్యాత విక్రముడు. శాస్త్రార్థ నిష్ఠిత మతి. శత్రు భంజకుడు. అర్థిజన పరితోష హేతువు మునిపుంగవ మార్గాచారి.[11] అతనియందు లక్ష్మీ సరస్వతులు వైరములేక వసించిరి. లక్ష్మి అతని హృదయమున నివసించినది. సరస్వతి అతని వదనమున వసించినది [12] రాజ రాజ దేవేంద్రవర్మ ప్రధాని బణపతి, తన దీర్ఘాసి శాసనమున రాజ రాజ దేవేంద్రవర్మ (1070 – 1078) వక్తలలో వక్త (వాచీ వాచా మధీశః) అని అభివర్ణించినాడు [13]

తూర్పు గాంగ భూపతులు ధనుర్విద్యయందు విశేషమైన ఆసక్తిని చూపినట్లు కనపడుచున్నది అర్వాచీన గాంగ శాసనములలో అర్వాచీన గాంగ రాజుల ధనుర్విద్యా కౌశలమును గూర్చి ఎట్టి ప్రసక్తియు లేదు; కాని శక 1034నాటి అనంతవర్మ చోడగంగుని కొర్ని శాసనమున, చోడగంగుని పూర్వీకుడు, పూర్వ గాంగరాజునగు మూడవ కామార్ణవుని విశేష ధనుర్విద్యా కౌశల్యమును గూర్చి చెప్ప బడియున్నది. ఇది అర్వాచీన గాంగరాజులకు ధనుర్విద్యలోగల అపార మైన ఆసక్తిని సూచించును. ఈ శాసనమిట్లు చెప్పచున్నది :- చంద్ర వంశజుడైన కామార్ణవుడు, సూర్య వంశజుడైన రాఘవుడు 'వైచిత్ర్యము', 'ధృడత', 'సౌష్టవము', అను త్రివిధ ధనుర్విద్యా విశేషములందు సమస్కంధులు. అయినను, యిందు ఒకడు (కామార్ణవుడు) ఒకే బాణముతో వైరి భటులను ఏడుగురిని పడ గొట్టినాడు; మరొకడు (రాఘవుడు) ఒకేబాణముతో చెట్లనేడింటిని పడగొట్టినాడు; ఫలితముగా కామార్ణవుని కీర్తి రాఘవుని కీర్తిని మించినది.[1] ఈ శాసనమువలన అనంతవర్మ చోడగంగుని కాలమున 'వైచిత్ర్యము', 'ధృడత', 'సౌష్టవము' అను మూడు ధనుర్విద్యా విశేషములు కలవని తెలియనగును.

అనంతవర్మ చోడగంగుడు (1078–1152) బహువిధ ప్రజ్ఞాశాలి. వేదములయందు, శాస్త్రములయందు, కళలయందు, కావ్య రచన యందు నిష్ణాతుడు అతడు సరస్వతీదేవి పెంపుడు బిడ్డ; కాని యెడల, అతడెట్లు అన్ని విద్యలలో ఆరితేరినవాడు కాగలిగినాడు? అని శాసనము ప్రశ్నించును.[15] యుద్ధ భూమియం దాతని ప్రావీణ్య మింతకన్న తక్కువైనదికాదు. శత్రు ఆయుధా ఘాతముచే అతని రక్తబిందు వొకటి నేలకు చిందులోపల, అతడు శత్రు అంగవిచ్ఛేదము గావించి అతనిని నేంకొరగించును.[16]

రెండవ అనంగ (అనియంక) భీముడు (1190 – 98) సూక్తిప్రియుడు కార్యక్షముడు తన ధర్మవర్తనముచే కలి కాల దోషరహితుడైన పరిశుద్ధుడు ప్రౌఢానర్గళ విక్రముడు. దండనీతి నిష్ణాతుడు. సత్యాచార చారుచరితుడు పుణ్యైక పరాయణుడు[17]

మూడవ రాజరాజు (1198–1211) శాస్త్రాభ్యాస విధి విధేయుడు. త్యాగ, శౌర్య, సత్యములయందు క్రమముగా కర్ణార్జున యుధిష్ఠిరసముడు.[18]

మూడవ అనంగ (అనియంక) భీముడు (1211–1238) ప్రాజ్ఞుడు; హరిపద ప్రియుడు.[19] శ్రీమత్ పురుషోత్తమ చరణ కంజ కింజల్క మత్త మధుకరాయమానుడు[20] శక. 1157నాటి ఒక శ్రీకూర్మశాసనము అతనిని సకల కళా ప్రవీణుడని వర్ణించినది[21] అతని నగరి తామ్ర పట్టికలు, అతడు మహాభారతము, వామన పురాణము, బృహస్పతి, ఆదిత్య పురాణము, విష్ణుధర్మోత్తరముల ననుసరించి ధర్మాచరణ గావించినాడని తెలుపును.[22] దీనినిబట్టి అతనికి ధర్మశాస్త్ర, నీతి శాస్త్ర గ్రంధములయందు, ఇతిహాస పురాణాదుల యందుగల పరిచయము, ఆసక్తి విదితము క్రీ శ. 1230 నాటి భువనేశ్వర శాసనమతడు 'సకల విద్వజ్ఞనాలంకారు' డని చెప్పినది[23] ఈ చక్రవర్తి రాణులలో నొకతెయగు సోమలదేవి, క్రీ. శ. 1230 నాటి కాంచీ శాసనమున, అతని ఆముష్మిక ప్రవృత్తి నిట్లు చెప్పినది: "శ్రీమద్ ఏకాదశీ వ్రతరాజ సంసేవన విదళిత కలికాల కలుష మషీ స్పర్శనవేశ, మహావాక్యామృత పరిచర్యా భ్యాస పరోక్షీకృత పరమ బ్రహ్మానంద భావ"[24] అనంగ భీముడు హిరణ్యగర్భ, తులా పురుష దానముల గావించినాడు; బ్రాహ్మణాగ్రహారముల ననేక మొసగినాడు (ద్విజాతి జన శాసన దానకేళిః)[25] మాదలాపాంజి (ఒరియా భాష యందు జగన్నాధ దేవాలయ వృత్తాంతము) కూడ ఇతడు బ్రాహ్మణులకు గావించిన అనేక భూదానములను గూర్చి తెలుపుచున్నది.[26]

మొదటి నరసింహుని (1238 – 1263) గూర్చి, శక 1172 నాటి ఒక శ్రీకూర్మ శాసనము అతడు మ చివారికి, మనీషులకు నిత్య శీతలుడని చెప్పినది (కింబాసీ శీతలో నిత్యం సుహృదం సుధీయాం మహి)[27] భువనేశ్వర శాసనమొకటి అతనిని 'మరీచీ పరాశరాచార విచారచతురు'[28] డని పేర్కొన్నది. శక1172 నాటి ఒక శ్రీకూర్మ శాసనము, అతడు (జలముల యందువలె) విహ్వలత లేకపోవుటచేతను క్రూరసత్త్వము(లు) లేకపోవుటచేతను, మధించకనే రత్నారాశుల నొసంగుటచేతను, సముద్రుని కంటె గంభీరుడని వర్ణించినది. అతడుచిరాభిగుణసద్రత్నౌఘరత్నాకరుడు[29]

రెండవ నరసింహుడు (1278–1305) సర్వజ్ఞుడు, ధీమంతుడు.[30] 'శౌర్యా దార్య లసద్ విద్యా విభవోన్నతుడు.'[31] లతని పాదాంబుజముల వద్ద చేరిన ధాత్రీ పతుల తలల యందలి నీలమణులు లతని అనుగ్రహ సుధ నాసించి చేరిన మధుపముల ననుకరించినవి.[32] అతడు శస్త్రములయందు అర్జునుడు; శాస్త్రముల యందు బృహస్పతి.[33]

మొదటి భానుదేవుడు (1263–1278) గొప్ప పరిపాలనా సంస్కర్త రాజ్యమును కట్టుదిట్టము చేయుటకు తన రాజ్య పరిపాలనా విధానమును సంస్కరించెను. 'దేశమును పునరుజ్జీవిత జేయునట్టియు, నీతి శాస్త్రమును చక్కగా అభ్యసించినట్టియు దృష్టములు అదృష్టములునైన ఫలముల నిచ్చునట్టి విధిచే శత్రువులను జయించునట్టియు, విశుద్ధ చరిత్రు లైనట్టియు అమోఘమైన ప్రతిజ్ఞాధ్యులైనట్టియు పదునారుగురు పాత్ర సామంతులను నియోగించెను[34] సామ్రాజ్యమునందు మహితులైన అట్టి పాత్ర సామంతుల మంత్ర సాహాయ్యముతో భానుదేవుడు భూమిని పరిపాలించెను.' ఇతడు 'ఆ చంద్రార్క ఫలోప భోగ సుల భములు, సౌధావళీ శోభా విస్ఫురితసులు, రసాలపూగ కదలీ తర్వాది అంగణ శోభితములు అయిన వందశాసనములను (అగ్రహారములను) తామ్ర విలేఖితములుచేసి సచ్ఛ్రోత్రియులకు విధ్యుక్తముగా ధానము

చేసిన క్ష్మామాధీశ్వరుడు.[35] దాన శౌండతయందు కనకాచల, కామధేను, కల్పద్రుమముల మించినవాడు.[36]

రెండవ నరసింహుడు (1278–1305), తన తల్లి కోర్కెమేరకు బ్రాహ్మణులకు వందశాసనముల (అగ్రహారముల) నొసగినాడు.[37] ఇతడు శస్త్రములయందు అర్జునుడు; శాస్త్రములయందు వాచస్పతి; దానమున కర్ణుడు; బలమున భీముడు; సౌందర్యమున కుసుమాయుధుడు.[38]

సూర్యవంశ గజపతులు గొప్ప సారస్వత పోషకులేగాక, స్వయముగా కవిపండితులు ప్రతాపరుద్రగజపతి వెలిచర్ల శాసనమున, కపిలేశ్వరుడు 'కళానిధి' అని చెప్పబడినాడు.[39] ఒక శ్రీశైల శాసనమున కపిలేశ్వరుడు (1434–1468) "త్రయీసముద్ధరణ పరాయణు"డని, 'ధర్మరక్షక దక్షు'డని "నవనవానురూప కర్మోద్యతు"డని, 'పూర్వానరపతి చరిత మర్యాద మహోదధి'అని, "త్రయీ విద్యానవద్య విద్వజ్జన విశ్రాణితాశీర్వాదు"డని, "వచన ప్రతిసమయు"డని "వైవస్వత–మను – పరంపరా ప్రసూత రామచంద్ర చరితాలంకృతు"డని శ్లాఘింపబడినాడు.[40] పురుషోత్తమ గజపతి (1468–1497) విద్వత్తునుగూర్చి చెప్పచు. వెలిచర్ల శాసనము అతడు కర్ణరసాయన మనదగిన అనేక కావ్యముల రచించి, వాని పరిమళముతో లోకమంతయు నింపెనని ప్రశంసించినది.[41] సరస్వతీ విలాసము, ప్రతాపరుద్ర గజపతి (1497–1538) బహుముఖ ప్రజ్ఞను అతడు వక్తలలో వక్త, శ్రోతలలో శ్రోత, సన్మార్గులకునేత, దుష్టులకు వినేత, అభ్యాయికా ప్రణీత, నాటకాభినేత, ధర్మసందేహ నిర్ణేత అని పలువిధముల ఉగ్గడించినది.[42] ఒరిస్సా స్థానిక వృత్తాంతములు కూడ ప్రతాపరుద్రగజపతి విద్యావివేకములు సర్వజన ప్రశంసా పాత్రములైనవని, అతడు సర్వశాస్త్రనిష్ణాతుడని, వేదాంతచర్చయందు మిక్కిలిఆసక్తిగలవాడని, అపూర్వపదయోజనద్వారా అతడెన్నో నూతన సిద్ధాంతములను ప్రవేశపెట్టినాడని, పుణ్యశీలుడని, బహుదేవాయతన నిర్మాత అని, పరిపాలనలో, యుద్ధములో ఆరితేరినవాడని, సమర్థుడు, పండితుడు, యోద్ధ, ధర్మశీలుడునగు రాకుమారుడని, వేనోళ్ల పొగడుచున్నవి [43]

## అధోజ్ఞాపికలు

1 'యోగక్షేమ' వివరణకై చూడు R. P. Kaugle, The Kautilya Arthasastra–A Study, పుటం. 118

2 "మూడవ వజ్రహస్తుని చిక్కాలవలస శాసనము, "శ 982" కళింగదేశ చరిత్ర (కదేశ) (సం. రాళ్లబండి సుబ్బారావు), పు. 50 మొll; ఎపిగ్రాఫియా ఇండికా (ఎఇం), XXXIII, పు. 114 మొll

3 "దేవేంద్రవర్మ చీడివలస శాసనము" కదేశ, పు 45 మొll

4 లోకక రికార్డ్సు, సం. 3, పు. 348

5 సరస్వతీ విలాసమ్, (సం. శ్యామాశాస్త్రి), పు. 15

6 సకలనీతి సమ్మతము, (ఆం. ప్ర. సాహిత్య అకాడమీ), పు. 19, పద్యము 144.

7 అదే, పు. 21, పద్యములు. 155–157.

8 శ్రీ మతామఖిల భావన వినుత నయ వినయదయాదాన దాక్షిణ్యసత్య శౌచ శౌర్య ధైర్యాది గుణరత్న పవిత్ర కాణామాత్రేయ గోత్రాణామ్ విమల విచారాచార పుణ్య సలిల ప్రక్షాళిత కళికాల కల్మష మషీణామ్'— "మూడవ వజ్రహస్తుని బొడ్డపాడు శాసనము; శ. 982", కదేశ; అనుబంధము, పు. 56; "అనంతవర్మ చోడగంగ దేవుని కొర్ని శాసనము", అదే, పు 59.

9 సకలనీతి సమ్మతము, పు 25, పద్యం. 185; అగ్నిపురాణము, అ. 220, 2–3.

10 సకలనీతి సమ్మతము, పు. 25, పద్యం. 187.

11 'ఖ్యాత విక్రమాః శాస్త్రార్థ నిష్ఠితర్మతిర్ద్విషదన్తకారీ సర్వార్థివర్గ పరితోషణ హేతువర్గః ఆచారతోప ముని పుఙ్గవ మార్గాచారీ'— "నరసింహదేవుని కెందుపట్న తామ్ర శాసనము", కదేశ, అనుబంధము, పు. 89; ఎఇ, XXVIII, పు. 185 మొ

12 'యస్యవక్త్రే ముఖాబ్జయో : ఆసీనే శ్రీ సరస్వత్యావనుకూలే విరాజితః' — "అనంతవర్మ చోడగంగ దేవుని కొర్ని శాసనము", కదేశ, అనుబంధము, పు. 70.

13 ఎఇ, IV, పు. 317.

14 'వైచిత్ర్యాం ధృడతాచ సౌష్ఠవమితి (తే) ష్వధా ధనుః కర్మణాం సోమార్కాన్వయయోర్ద్వా సమధురం కామార్ణవో రాఘవః విన్యాద్యైక శరేణ సప్త సుభటాన్ కశ్చిజ్జిం ఘాంసూన్ వనే తత్సంభ్యాన పరస్తరూా నితి. పృధక్కీర్తి వరీ వృత్యతే'—"అనంతవర్మ చోడగంగదేవుని కొర్ని శాసనము', కదేశ, అనుబంధము, పు 69.

15 'ధాత్రీ తస్య సరస్వతీ సమభవాన్మానసస్సచేత్. పితవాన్ తత్సారస్వత మార్యబాలక తమః శ్రీచోడగఙ్గః పయః తాదృగ్వేదమతిః కధాన్ నిపుణతా శాస్త్రేషు తాదిక్ వక్తాన్ తాదిక్ కావ్యకృతిః కధమ్ పరిణితిః శిల్పేషు వక్తమతమ్' — 'మూడవ అనంగభీముని నగరి తామ్ర పట్టికలు శ. 1151, 1152', ఎఇ XXVIII, పు. 235 మొ. శాసన పాఠము, శ్లో. 18–19లు.

16 'ప్రతి భటకరి శస్త్ర వ్యాహతి స్వాఙ్గ నిర్యద్రుధిర మవని నిష్టంనో భవే ద్యత్త ద్దైవ నిజకర ధృత శస్త్ర చ్ఛిన్న భిన్నాఙ్గ మేతా నకృత ధరణి శయ్యాన్ ద్వన్ద్వ యుద్ధేషు గజ్గః'—''నరసింహదేవుని కెందు పట్న తామ్ర శాసనము'', కదేశ, అనుబంధము, పు. 90.

17 'సూక్తి ప్రియః పరిమితాది నృపప్రశస్తిః పృథ్వీ పతిః కలిమలో ఝిత ధర్మ శుద్ధః కార్యక్షమః ప్రభు రాసా వని యఙ్కు భీమః.........ప్రౌఢానర్గల విక్రమా(గ్రే)ల గృహం యోధణ్ణా నీతి శ్రయః సత్యాచార విచార చారు చరితః పుణ్యైక పరాయణః' — నరసింహదేవుని కెందు పట్న తామ్రశాసనము, కదేశ, అనుబంధము, పుట. 92.

18 'శాస్త్రాభ్యాసన విధే విదేయ జడతః ......... త్యాగే శౌర్యేచ సత్యేచ కర్ణార్జున యుధిష్ఠిరైః సదృశో యా మహావీరో రాజరాజో నరాధిపః'—అదే, పు. 92—93 లు.

19 'అనియంక భీమో వీరో నృపో హరిపద ప్రియ రావుతాఖ్యః' —దక్షిణ హిందూ దేశ శాసనములు (దహింశా), IV. 1252.

20 'శ్రీమత్ పురుషోత్తమ చరణకన్జ కిఙ్జల్క మత్త మధు కరాయమాన శ్రీమద నియంక భీమదేవ రావుత' — అదే, V. 1284.

21 అదే, V. 1284.

22 ఎ ఇ, XX VIII, పు. 235—238 లు.

23 అదే, XXX, పు. 234.

24 అదే, XXXI, పు. 94—98 లు.

25 అదే, XX VIII, పు. 243.

26 చూడు. R.C. Majumdar, (Ed.), History of Bengal, I, పు. 478.

27 దహింశా, V. 1188.

28 Indian Historical Quarterly, పు. 81—84 లు.

29 'వీరశ్రీ నరసింహదేవ నృపతి ర్భూపాల చూడామణి స్తస్మా దావీర భూద్=చిరాభి గుణ సద్రత్నేషు రత్నాకరః నాస్మిన్ విహ్వలతా జలా చిరపి నోనో దుష సత్వోత్కరో గాంభీ ర్యంతు తతోధికమ్ జలధి జావ్యస్తే వినా మంథనాత్' — దహింశా, V. 1188.

30 అదే, VI. 904.

31 అదే, VI. 1204.

32 'యత్ పాదాంబుజై రనుగ్రహ సుధాలోభేన ధాత్రీపతి శ్రేణి శేఖర నీలరత్న మధు పాళ్ళ్యంబత్యు పాంతస్థలీః' అదే, V. 1150.

33 ''నరసింహదేవుని కెందు పట్న తామ్ర శాసనము'' కదేశ, పు. 89.

34 'ప్రత్యుజ్జీవన కరణైర్ జనపద స్యాభాస్త నీతి ఆగమైర్= దృష్టా దృష్ట ఫలప్రదేన విధినా నిత్యం నిరస్తారిభిః। పాత్రై షోడశభిర్ విశుద్ధ చరితా మోఘ ప్రతిజ్ఞైర్= అయం సామ్రాజ్యే మహితో మహో మహిమ భిర్' — ''రెండవ నరసింహుని అసంభావి తామ్ర పట్టికలు'', ఎ ఇ, XXXI, పు. 110 మొ, శాసన గ్రంథము, శ్లో. 89.

35 అదే, శ్లో. 93.

36 అదే.

37 'తేనె దత్తం ద్విజాతిభ్యః శాసనం శత సంఖ్య కం మహా దానాని దానాని శ్రీమన్మాతు రనుజ్ఞయా' — ''నరసింహ దేవుని కెందుపట్న తామ్రశాసనము'', కదేశ, అనుబంధము, పుట. 94.

38 అదే, పు. 94.

39 భారతి, 1936, పు. 271 మొ||, శాసన గ్రంథము, పంక్తి. 6.

40 ఎ ఇ, XXXYI, పు. 79.

41 భారతి, 1936, ఆగస్టు, పు. 271 మొ||, శాసన గ్రంథము, పంక్తి. 10.

42 సరస్వతీ విలాసమ్ (సం. శామాశాస్త్రి), పు 10—11లు.

43 చూడు. Asiastic Researchs, X V, పు. 283 — Thoms Foulkes, Sarasvativilasa (1881), Preface, P. XIII నందు ఉద్ధృతము.



డాక్టర్ బి. ఆర్. కె. రావు

# రాబిన్స్ ఆర్థిక ఆలోచన

లార్డ్ లైనల్ రాబిన్స్ 1898లో ఇంగ్లండ్‌లో జన్మించాడు. తన ఉపాధ్యాయవృత్తిలో ప్రథమంగా లండన్‌లో న్యూకాలేజీలో లెక్చరర్‌గా చేరాడు. 1929లో లండన్ విశ్వవిద్యాలయంలో స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్ అండ్ పొలిటిక్స్‌లో ప్రొఫెసర్‌గా చేరి 1959లో ఉద్యోగ విరమణ చేసాడు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో యుద్ధ మంత్రివర్గం ఆర్థికశాఖలో డైరెక్టర్‌గా నియుక్తుడయ్యాడు. 1944బ్రెట్టాన్‌వుడ్స్ ఆర్థిక సమావేశానికి బ్రిటిష్ ప్రతినిధివర్గ సభ్యుడుగా హాజరయ్యాడు. 1956లో ఆజన్మాంతరం లార్డ్‌గా నియుక్తుడై పార్లమెంటు ఎగువ సభ సభ్యుడయ్యాడు. ఇంగ్లండు హైయర్ సెకండరీ ఎడ్యుకేషన్ కమిషన్ చైర్మన్‌గా నియుక్తుడయ్యాడు అంతర్జాతీయ ఖ్యాతిగల ఆర్థిక శాస్త్రవేత్తగా పేరు గాంచిన రాబిన్స్ ఈ రచనలు చేసాడు : (1) యాన్ ఎస్సే ఆన్ ది నేచర్ అండ్ సిగ్నిఫికెన్స్ ఆఫ్ ఎకనామిక్ సైన్స్ (1939) (2) ది గ్రేట్ డిప్రెషన్ (1934) (3) ఎకనామిక్ ప్లానింగ్ అండ్ ఇంటర్నేషనల్ ఆర్డర్ (1937) (4) ది ఎకనామిక్ ప్రాబ్లమ్స్ ఇన్ పీస్ అండ్ వార్ (5) ది థీరీ ఆఫ్ ఎకనామిక్ పోలసీ ఇన్ ఇంగ్లీష్ క్లాసికల్ ఎకానమి (1952) (6) రాబర్ట్ టారెన్స్ అండ్ ది ఎవాల్యుయేషన్ ఆఫ్ క్లాసికల్ ఎకనామిక్స్ (1951) (7) ది ఎకనామిస్ట్స్ ఇన్ ది ట్వంటీయత్ సెంచరీ (1954) ఇప్పుడాతని ఆర్థిక ఆలోచనను చూద్దాము.

## అర్ధశాస్త్రానికి నిర్వచనము :

రాబిన్స్ అర్థశాస్త్రానికిచ్చిన నిర్వచనం బహు శాస్త్రీయమైనదిగా కొనియాడబడటమేగాక ఆ శాస్త్రానికి బాగా పరిపుష్టి నిచ్చింది. మానవ సంక్షేమాన్ని ఏర్పర్చే భౌతిక కారణాల పరిధిలో మాత్రమే అర్ధశాస్త్రాన్ని నడిపించడం సమంజసంకాదు. భౌతికం గాని చాలా వస్తువులు కూడా మానవ సంక్షేమానికేర్పర్చడానికి తోడ్పడుతున్నవి. ఈ వస్తువులు కొరతగా ఉండి ఆర్థిక విలువను ఏర్పర్చడంవల్ల ప్రాముఖ్యతను పొందుతున్నవి అంతేగాక కొన్ని భౌతిక వస్తువులు మానవ సంక్షేమానికి తోడ్పడడంలేదు వస్తువులు ఆర్థిక వస్తువులు కావడానికి సంతృప్తినిచ్చే భౌతిక సాధనాల భౌతికత్వంకాక, ఆ వస్తువులకు విలువ మదింపుకుఉన్న సంబంధమే కారణము. ''లక్ష్యాలకూ, ప్రత్యామ్నాయ ఉపయోగితలుగల కొరత సాధనాలకూ మధ్య సర్దుబాటు నేర్పర్చడానికి కృషిచేసే మానవ స్వభావాన్ని అధ్యయనంచేసే శాస్త్రము అర్ధశాస్త్రము'' అని రాబిన్స్ వ్రాసారు. ఈ నిర్వచనం యిచ్చి అర్ధశాస్త్రాన్ని ఫిజిక్సు, కెమిస్ట్రీలవలె శుద్ధ శాస్త్రంగాను, సర్వకాల సర్వావస్థల కన్వయించే శాస్త్రంగాను చేయడాని కాయన పూనుకున్నాడు. రాబిన్స్ నిర్వచనం కొరతగా ఉన్న ఆర్థిక వనరుల్ని సహేతుకంగా కేటాయించే ప్రవృత్తి గరిష్ఠ సంక్షేమానికి తోడ్పడుతుందని మానవుడు భావిస్తున్నట్లు చెప్పడంవల్ల, ఈ నిర్వచనంలో మార్షల్ భావన ఉన్నట్లు బెవరిడ్జి, బార్బరా ఊటాన్, కాల్డార్, హిక్స్ మొదలైన ఆర్థిక శాస్త్రవేత్త లంటున్నారు.

## అంతర్జాతీయ ఉదార ప్రణాళికారచన:

'ఎకనామిక్ ప్లానింగ్ అండ్ ఇంటర్నేషనల్ ఆర్డర్'అనే తన గ్రంథంలో అంతర్జాతీయంగా అనువర్తించే ఉదార ప్రణాళికా కార్యక్రమాన్నొకదాన్ని రాబిన్స్ వివరించారు. దీన్ని కొంతమంది కేవలం ఊహావాదంగా త్రోసిపుచ్చారు! ఈ ప్రణాళిక ప్రకారం వివిధ దేశాల మధ్య, వస్తువులు, వ్యాపారరీత్యా ఎగుమతి దిగుమతులు కావడానికి ఆటంకాలుండవు. ఈ వస్తువులు పూర్వ నిర్ణీత రేట్లకు అమ్ముడు పోతాయి. అదేవిధంగా శ్రామికులు, మూలధనం కూడా ఒకదేశం నుండి మరొక దేశానికిపోయి ఉత్పత్తి కార్యక్రమంలో పాల్గొనడానికి ఆటంకాలుండవు. దేశాలన్నింటా అప్పులకు, కాంట్రాక్టులకు సంబంధించిన న్యాయచట్టాలు ఒకే సూత్రాలకు బద్ధంగా వ్రాయబడటమేగాక, అమలుచేయబడతాయి కూడా. ఒక దేశంనుండి మరొక దేశానికి ప్రవాసం పోవడానికి కూడా పూర్తి స్వేచ్ఛ ఉంటుంది. ఇటువంటి ప్రణాళికను అమలులోకి తెచ్చేందుకు తోడ్పడడానికి వివిధ దేశాలు ఒకరి కొకరు అపకారం చేసుకోరాదు; యుద్ధాలుచేసే హక్కును ఒక అంతర్జాతీయ అధికారానికి లొంగబాటు చేసివెయ్యాలి.

## అంతర్జాతీయ ద్రవ్య విధాన పునర్నిర్మాణము :

రెండవ ప్రపంచ యుద్ధానంతరం యుద్ధం వల్ల దెబ్బతిన్న ఆర్థిక వ్యవస్థల్ని పునర్నిర్మాణంచేయడం వివిధ దేశాలకొక సమస్యగా రూపొందింది. అల్పాభివృద్ధిదేశాలను ఆర్థికంగా అభివృద్ధి చెయ్యాలనే కాంక్ష కూడా అభివృద్ధి చెందిన దేశాల్లో కల్గింది. ఇందుకు ''ఇరవయ్యవ శతాబ్దపు ఆర్థిక శాస్త్రవేత్తలు''అనే తనగ్రంథంలో రాబిన్స్ రెండుసూచనలు చేసారు . (1) దేశాలు తమ అంతర్గత 'ఆర్థికాభివృద్ధికి' పూనుకోవాలి. (2) దేశాలు తమ ద్రవ్య

విలువను దేశం బయట స్థిమితం చేసుకోవాలి. మొదటి చర్యవల్ల దేశంలో ద్రవ్యోల్బణం అదుపులోకి వస్తుంది. దాంతోపాటు ద్రవ్య రాశి పెరగకుండా ఉంటుంది రెండవ చర్య వల్ల విదేశీ ద్రవ్య మారకపు రేటు స్థిమితంలోకి వస్తుంది. వివిధ దేశాల, కరెన్సీలకు, అంతర్జాతీయ చెలామణి ఉండేటట్లుగా, ఆ దేశాల కేంద్రబ్యాంకులు తమ వనరుల్ని బలపర్చుకోవాలి. ఏ దేశానికైనా తన అంతర్జాతీయ వ్యాపార సంతులనము వ్యతిరేక స్థితికి వచ్చినట్లయితే అంతర్జాతీయ ద్రవ్యనిధి ఆ దేశాన్ని రక్షించడానికి పూనుకోవాలి.

## ఆర్థిక మాంధ్యానికి కారణాలు :-

1930–40 కాలంలో వచ్చిన ఆర్థిక మాంధ్యాన్ని గణనలోకి తీసుకుని 'ది గ్రేట్ డిప్రెషన్' అనే తన పుస్తకంలో ఆర్థిక మాంద్యం రావడానికిగల కారణాలను వివరంగా అధ్యయనం చేసాడు. ఆర్థిక మాంధ్యం నుండి కోలుకోవడాని కవసరమైన పరిస్థితులను కూడా విశ్లేషించాడు ప్రస్తుతం జరుగుతున్న చుట్టు తిరుగుడు. ఆధునిక ఉత్పాదన పద్ధతిలో ధరల ఒడుదుడుకులు (అస్థిరత్వము) ఉత్పత్తి విధానంమీద, ఉత్పత్తి చక్రంమీద నష్టదాయకమైన ప్రభావాన్ని ఏర్పరుస్తుంది. ఉత్పత్తి వల్ల నూతనంగా వచ్చే ఆదాయం ఉత్పత్తిదారుల చేతుల్లోకి పోయి వినియోగ వస్తువుల్ని ఉత్పత్తిచేసే పరిశ్రమలపైన దెబ్బ తీస్తుంది ఉత్పత్తిసాధనాలను ఉత్పత్తిచేసే రంగానికి, వినియోగ వస్తువుల్ని ఉత్పత్తిచేసే రంగానికి మధ్య సహసందానము లేకపోవడంవల్ల వనరులు విపరీతంగా దుబారా అయిపోతాయి. ఆర్థిక సంకటానికి అల్ప వినియోగిత ఎన్నడూ కారణం కాదు. ఉత్పత్తి ఖర్చులకు, ధరల గమనానికి తేడా రావడంవల్లనే ఆర్థిక సంకటాలు వస్తాయి. ఆర్థిక వ్యవస్థ మాంధ్యం నుండి కోలుకోవడానికి ఈ మూడు పరిస్థితులు అవసరము : (1) అంతర్జాతీయ ద్రవ్య సమతౌల్యము ఏర్పడడానికి తోడ్పడే విధంగా అంతర్జాతీయ ద్రవ్య పరిస్థితులు స్థిమితాన్ని పొందాలి ఇందుకుగాను విదేశీ ద్రవ్య మారకాన్ని స్థిమితమైన స్థాయికి తేవాలి. (2) పరిశ్రమల్లోను, వ్యాపారంలోను తీవ్రమైన అస్థిమిత పరిస్థితులు రాకుండా చేయగల్గేటట్లు సంతృప్తికరమైన ద్రవ్య పరిస్థితులు ఏర్పడాలి. (3) మాంద్యం తక్కువ వ్యవధిలో జరిగినట్టిదయితే ఉత్పత్తి ఖర్చులను తగ్గించడము, పరిసమాప్తి (లిక్విడీషన్) జరగాలి. హఠాత్ ఆర్థిక సమృద్ధి ఆర్థిక మాంద్యానికి త్రోవ తీస్తుంది. ధరల స్థాయిలో విపరీతమైన అస్థిమితం రాకుండా చేసేందుకు సెక్యూరిటి మార్కెట్‌ను బ్యాంకింగు సంస్థలు కట్టుదిట్టంగా నియంత్రణచేసేటట్లుగా కేంద్ర బ్యాంకుచెయ్యాలి.

రాబిన్స్ గొప్ప ఆర్థిక శాస్త్రవేత్తేగాక విద్యావేత్త కూడా. అతని అభిప్రాయాలు సైద్ధాంతికంగానే గాక ఆచరణకు పెట్టదగినవిగా కూడా గణనీయాలు.

---

# వజ్రగీతం!

## శ్రీ కె. శివా రెడ్డి

చీకటి వాసన చూచిన గాలిని మేసేస్తే
  రాత్రిలాగా శీతలమెక్కిపోదూ మనసు —
కళ్ళు దృశ్యాల్ని వడకట్టినట్టు
ఊపిర్నికూడా వడబోసుకోవాలి
వెలుగు వేళ్ళకి ఎక్కడన్నా చీకటి
మరకలున్నాయేమో చూచుకోవాలి –
శబ్దాన్నిగూడా పుటంపెట్టి పరీక్షించుకోవాలి.

నీకు పనికిరాని గతం నిన్ను వెంటాడుతుంది — కాచుకోవాలి,
మన భ్రమలు మనల్ని మైమరపింపచూస్తాయి--గిల్లుకోవాలి,
ఆవు పొదుగులాంటి మేఘాలను ఆకాశం దాచుకున్నట్లు
నిత్య సమరశీల జీవితాన్నిగూడా పరిరక్షించుకోవాలి –
ఎలాగో బతకటం వేరు
వెలుగుతూ బతకటం వేరు,
వెలుగు ఎలుగెత్తి బతికే బతుకు
కటకటాల వెనకగూడా కాఠిన్యం కోల్పోని
వజ్రగీత సంగీతం !

శ్రీ నందిని సిధ్ధారెడ్డి

# 'ఇద్దరు కవితా సూర్యుళ్ళు' [ఒకపరిశీలన]

ఆదినుంచి ఆధునికం వరకూ కవిత్వంలో అనేకములైన పరిణామాలు వొచ్చాయి. ఇంకా వస్తూనే వున్నాయి. అలాగే వస్తువులో... భావనలో...కూడా!

అయితే—మొదట్నుంచీ సూర్యుడిని అలవోకగా కవితా వస్తువుగా ఎన్నుకుంటూ వచ్చినా ఈ మధ్య సూర్యుడుని [చీకట్లు చీల్చుకుంటూ వెలిగే సూర్యుడు, కాంతికి, వెలుతురికీ ప్రతీక కాబట్టి] కవితా వస్తువుగా స్వీకరించటం విశిష్టమైన అభ్యుదయ లక్షణంగా రూపరించి. జీవితాల్లోని చీకటి తొలగడానికి విప్లవ సూర్యుడు ఉదయించాలనేదే ఈ తరం కవితాధ్యేయం.

ఆ ఉద్దేశ్యంతోనే సాహితీ జగత్తులో సూర్యుళ్లు ఉదయిస్తూనే వున్నారు. కవితా ప్రక్రియతో ఆవిర్భవించిన సూర్యుళ్లను గురించి వివరించటం, కవితా సూర్యుళ్లలోని భావ ప్రయోజకత్వాన్ని విపులీకరించటంకోసమే ఈ పరిశీలన

1973లో పొడిచిన 'రక్తం సూర్యుడు'కి కె శివారెడ్డి కర్త అయితే ఆ తర్వాత 1974లో పొడిచిన 'మండేసూర్యుడు'కి గుంటూరు శేషేంద్రశర్మగారు కర్తలు.

ఇద్దరూ కవితా లోకానికి చిరపరిచితులే.

శేషేంద్రశర్మగారికి 'మండేసూర్యుడు' ఆఠోమజిలీ (అనుకుంటా) అయితే, శివారెడ్డిగారికి 'రక్తం సూర్యుడు' ప్రథమ మజిలీయే.

ఈ ఇద్దరు కవుల కవిత్వ చిత్రీకరణనీ, ప్రయోగ ప్రయోజకత్వాన్నీ, భావచిత్రాలనుగూర్చి చర్చామాత్రంగా పరిశీలిద్దాం.

ఇద్దరు సూర్యుళ్లూ ప్రజలకోసమే. ప్రజల చీకటి జీవితాల్ని వెలుగుమయం చేసేందుకేననీ వీరి కవిత్వాన్నిబట్టి నిరభ్యంతరంగా చెప్పొచ్చు.

ఈ పంక్తులు ఆ అర్థాన్ని స్పష్టపరుస్తాయి.

''నేను చెమట బిందువుని.
కండల కొండల్లో ఉదయించే లోకబంధువుని;
గుండెలతో నాకు దోస్తీ
నేనుండేది బాధల బస్తీ''

అని శేషేంద్రశర్మగారు తన ధ్యేయాన్ని చెబితే—

''నా ఊపిరే ఒక మంటగా ప్రపంచాన్నే చుట్టేస్తుంది.
నేనే కర్షకుణ్ణి ! కార్మికుణ్ణి !
విశ్వ శ్రామికుణ్ణి!!''

అని సూటిగా వాడిగా గుండెలో గుచ్చుకొనేట్లు నిరాడంబరాలంకారాలతో చెబుతారు రెడ్డిగారు.

మరోచోట—

''నేను లోకాన్ని చూడలేని బాధని,
నేను పాట కాలేకపోయిన స్వరాన్ని!
అధరాలమీద మౌనం విధించుకున్న పర్వతశ్రేణిని!''
[''నేను'']

చదువుతుంటే శేషేంద్రశర్మగారు భావకవిగానో, ఆత్మాశ్రయ కవిగానో బయటపడతాడు అప్పుడు భావం పలుచగా కనిపిస్తుంది.

కాని—శివారెడ్డి అలాకాదు. భావనలో క్షణ క్షణానికీ మరింత విజృంభిస్తాడు. ఇక్కడ—

''ఆశా ఉచ్ఛ్వాసాన్ని !
అనంత స్పందనైక గీతాన్ని !
అనూన క్రాంతి సస్య సర్వం సహ ఫలసాయాన్ని!
రేపు రూపాన్ని ! రేపు దీపాన్ని !''
[గతం నీది భవిష్యత్తు నాది]

కవిత్వానికి చిత్తశుద్ధి అవసరం ఒకే కవిలో ఒకే కవితామాలలో భావ వైరుధ్యం కనిపిస్తే కవితా స్థాయి అమాంతం దిగజారిపోతుంది.

శేషేంద్రశర్మ నిజానికి చాలా గొప్ప పదాల్తో తన తీవ్రత భావయుక్తం చేస్తాడు.

''ఈ దేశపు ప్రాచీ రేఖమీద
సూర్యుడుదయించకపోతే మండే నా గుండె చీల్చి
దానిమీద పెడతా !
ఎర్రటి నా కండలతో ఎండలు కాయిస్తా!''
[మండేసూర్యుడు]

ఎంత ఆవేశంతో చెప్పాడు (ఆలోచన అసలేలేదు. శాస్త్రీయత సరేసరి!) కుండబద్దలు కొట్టినట్లు, అలవోకగా చదువుతున్న పఠిత. ఒక్కసారి ఊగిపోయేట్లు.

''నోటినిండా సూర్యుడ్ని కొరుక్కు తింటున్నా!
పెదవుల కొసల్నుంచి ఎర్రకాంతుల రసం
జారిపడుతోంది.'' [వళ్ల గుత్తులు].

''చీకటి రాబందులు వా కనుగుడ్లు తింటున్నాయి
మొదట ఉదయించే
ఏ తారకైనా
ముక్కుదామని మోకరించాను. [సూర్యబిందువు]

ఇది చదువుతుంటే ఊగిపోయిన వాడల్లా ఒక్కసారిగా చన్నీళ్లలా చల్లారిపోతాడు. ఈ రెంటికీమధ్య ఎంత వైరుధ్యం కొట్టొచ్చినట్లు కనిపిస్తుందో పఠిత కిట్టే తెలుస్తుంది. అందుకే–కవిత్వానికి ఆవేశమొక్కటేకాదు ఆవేశంతోపాటు ఆలోచన, అవగాహన సమపాళ్లలో ఉంటేనే కవిత నాల్గు కాలాలు మనగల్గుతుంది. నల్గురి ప్రయోజనాల్ని సాధించగలుగుతుంది.

ఇలాంటి ఘటనలు భావవైరుధ్యాల తప్పటడుగులు 'రక్తం సూర్యుడు'లో పొడసూపవు. కవికి ఒకేబాట, ఒకే తీవ్రత ఉన్నట్టు పఠితల్ని ఆవేశంతో ఉడికింపజేస్తున్నట్టు, ఆలోచింపజేస్తున్నట్టు గొప్పగా ఉంటుంది చిత్రీకరణ.

''రేప్పొద్దున బీదసూర్యుడు
క్రోధం రక్తం కక్కేటప్పుడు ముక్కలు ముక్కలై
జమ్మి పూవుల్లా
ఈ మేడ–ఈ మత్తూ–పానులు పడమటి గాలిలో కలిసి పోతాయి'' అని ఉద్ఘాటించినా— [దీనికి మరో పేరులేదు.]

ఇప్పుడుమాత్రం
అణు గుండెలు మేల్కొన్నాయి
నిప్పే – నిప్పే నల్దెసల కమ్ముతోంది
వర్తమానం చరమ దశలో భవిష్యద్దర్శనమౌతోంది
ఇన బింబం జాతి కాదర్శమౌతుంది [అణువు]

అని నిర్దేశించినా—

స్వేచ్ఛారక్తం పంజా విప్పితే
గహనాలకీ, గిరులకీ కళ్ళొచ్చాయి
కళ్లల్లో కోటాను కోట్ల సూర్యుళ్లు నిద్రలేస్తారు
[రక్తం సూర్యుడు]

అంటూ విరచుకపడినా తన భావాల్లో వైరుధ్యం అస్పష్టత తొంగిచూడదు. అది ప్రతి కవికీ ముఖ్యావసరం.

సూర్యుడిలో ఏడురంగులు మందుతూనేవున్నా అన్నీ ఒకే కాంతిరంగుగా మిగుల్తాయి. అదే 'రక్తం సూర్యుడు'లో కనబడుతుంది.

కాని–'మండే సూర్యుడు'లో ఏడురంగులు మరిన్ని రంగులై రంగురంగుల హంగులు పొందుతూంటే వైరుధ్యాలు స్పష్టంగా ఉట్టిపడతాయి.

అదే ఈ కవితా సూర్యుళ్ల మధ్యవున్న ప్రధాన భేదం. ఇది పెద్ద అగాధంలా గోచరిస్తుంది భావుక పాఠకులకు.

'మండే సూర్యుడు'లో ఎక్కువగా –
''ఈ మిమోసా శాఖల క్రిందనే
ఇంద్ర నీల పర్వతాల్లో విరిసిన
కెమిలియాలు లిల్లీలు డైసీలు
యూకెలిప్టస్ అడవులు, పూల వాహనాలమీద కింజల్కాలూ
కుసుమ పరాగాలు [నక్షత్ర బిందువులు]
కాగితాల పడవల్లో కలల ప్రయాణాలూ
[నా దేశం వెన్నెముక]

అద్భుతగిరి సౌందర్యారాధనలోకి పఠితల్ని మళ్ళిస్తాయి.

అదే 'రక్తం సూర్యుడు'లో

విరిగిన బళ్ళు, పగిలిన కడవలు
తెగిన చాంతాళ్లు, మొండి గోడలు
కూలిన ఇళ్ళు, కక్కులేని కొడవళ్ళు
కాలిన లలాట తలాలు ['ఈ స్తబ్దతను ఛిద్రంచేసి']
అరులు గిరులు
రక్తనదాలు – కోపానల దీధితులు
గిరిజనులు – గెరిల్లాలు [మైనం కరగందే...]

జాలిపోసి వెన్నుతట్టి ప్రగతి పథోన్ముఖుల్నిచేయ ప్రయత్నిస్తాయి.

ఇలా సాగుతున్న సూర్యుళ్ల మధ్య చుక్కతెగి రాలపడ్డట్టు సామ్యాలు, [ఇరివురిమధ్యా భావ సామీప్యం అతితక్కువ] జాగ్రత్తగా పరిశీలిస్తేగాని ఈ విషయం గోచరపవదు ఈ పంక్తులు చూడండి:

కన్నీళ్లతో కల్ప వృక్షాలు
పెంచుకొంటున్న చేతులు
గులాబీల గుండెలను పిండి
పాల కోవాలు . చేసుకుంటూన్న చేతులు
[ఎండిన గుండెలు మండుతున్నాయ్]

అని రక్తం సూర్యుడు చెబితే మండే సూర్యుడు మరో రకంగా చెబుతాడు.

గ్లాసుతో నా చెమట తాగి తేన్చేవాడు
నున్నగా టొమాటో పండులా వున్నాడు!! [ఆకలి.]

ఒకే కాలంలోని, ఒకే సమాజంలోని కవులుగనక భావాలు తుసురంత కలిసినట్లనిపిస్తాయి.

శర్మగారికి చీకటంటే మరీ అసహ్యమయితే శివ్వారెడ్డిగారికి దుఃఖమంటే పరమ అసహ్యం ఈ భావాల్నికూడా తమ కవిత్వంలో నిర్ద్వంద్వంగా చెప్పారు.

చీకట్లను చీల్చివేసి
సూర్యుడ్ని పిలుద్దాం [పించే రోడ్లు.]
చీకటి పట్ల అయిష్టాన్ని వ్యక్తంచేస్తూ దాన్ని విదిలించు కోవాలని చూస్తే ...
నువ్ దేన్నైనా ప్రేమించు
కాని దుఃఖాన్ని మాత్రం కాదు

ఆరిపోయిన కొలిమి కది విహ్వం
(దుఃఖమంటే పరమ అసహ్యం నాకు )
[దుఃఖాన్ని మాత్రం పిలువకు]

అని నిష్కర్షగా శివారెడ్డి దుఃఖాన్ని తిట్టేస్తాడు

కనబడిన దాన్నంతా కబళిస్తానంటుంది
**ఓహ్.. ఏమి చీకటి !...**
ఆ సూర్య గోళాన్ని ఎందుకు ముందుకు తోయవు
ఈ చీకటి ఎందుకు చీల్చవు.
నీ సంకల్ప ఖడ్గంతో ఓ మానవుడా! [చీకటి తుపాను]

అని మండే సూర్యుడు ముందుకు వొస్తే —

**దుఃఖమూ** కాదు **దుర్వి**ఫీ కాదు
అనాలోచితం మన దుర్దశకు దారి [యాగం]

దుఃఖించేవాళ్ళు కాదు! కావాల్సింది
కర్మను శిక్షించే వాళ్ళు...
జాతిని రక్షించేవాళ్ళు
చైతన్యం నెలకొల్పేవాళ్ళు
[దుఃఖించేవాళ్ళు కాదు కావల్సింది]

అని 'రక్తం సూర్యుడు' ఉరకలు వేస్తాడు.

చీకటి పోవడానికి శేషేంద్ర శర్మగారు మానవుణ్ణి కర్తవ్యోన్ముఖున్ని చేస్తే శివారెడ్డిగారు జనాన్ని దుఃఖం విస్మరించమని ప్రబోధయుతంగా, శక్తిమతంగా ఎలుగెత్తి చాటుతాడు.

ఇద్దరు **సూర్యు**ళ్లల్లో సైతం అక్కడక్కడ వర్ణనలు లేక పోలేదు ఒకే దృశ్యాన్ని, ఒకే స్థితినీ ఇద్దరు కవులూ భిన్నరీతుల్లో చెబుతారు. మచ్చుకు 'రాత్రిని' పరించి ఇద్దరూ వర్ణించిన తీరు చూద్దాం.

ఒక పావురంలా
రాత్రి నా గుండెమీద వాలింది. [జింకలు]

శేషేంద్రశర్మగారు పావురాన్ని రాత్రితో అన్వయించారు.

**అయితే—**

రాత్రి—
చీకటి కళ్లాపి చిక్కగా
చల్లబడింది లోకం వాకిలిముందు. [**సూ**ర్యుడుదయిస్తాడు]

శివారెడ్డి రాత్రిని చీకటి కళ్లాపితో అన్వయం కుదిరిస్తాడు. రెండింటిలో ఏ వర్ణనలో సహజత్వమూ, సామాజికస్పృహ, శ్రామికత ఉట్టిపడుతుందో పరితలకు ఇట్టే అవగాహన అయిపోతుంది. వర్ణించేముందు అన్వయమూ, అభూత కల్పనలా ఉండాలో, సమాజ చిత్రికలా ఉండాలో ఆలోచించి తేల్చు (తెలుసు) కోవాల్సిన బాధ్యత కవులకుంది.

''ఈ దేశపు గర్భగుడిలో
దేవుడు జీర్ణమైపోయాడు
ఆకలివేస్తుంది మరో దేవుడికోసం'' [మరోదేవుడు]

ఇలా శర్మగారు దేవుడికోసం దేవులాడుతుంటే..

రెడ్డిగారు దేవుణ్ణి ప్రస్తావిస్తూ—
''దేవుణ్ణి పిలు !
నిలబెట్టి గుండెల్లో దిగేస్తా కత్తి
మనల్ని వెధవన్ని చేసినందుకు— ''

అంటూ తీవ్రంగా నిరసిస్తాడు

ఇలా అక్కడక్కడ 'రక్తం సూర్యుడి'కీ 'మండే సూర్యుడి'కీ మధ్య ప స్వర వైరుధ్యాలు బయటపడతాయి. వాస్తవిక దృష్టితో, శాస్త్రీయ అవగాహనతో సైద్ధాంతికంగా మానవుడు **ముందుకు** పోతూ ప్రకృతినే శాసించబోతున్న రోజు వి. ఇంకా దేవుడికోసం దేవులాట ..

. కవిత్వంకూడా శాస్త్రీయంగా, హేతువాద దృక్పథంతో ఎదగాల్సుంది పఠిత తనక్కావల్సింది ఏరుకునే స్థితికి ఎదగాల్సిన అవసరమూ ఉంది అలాగే కవులూ.

'మండే సూర్యుడి'కి కలలంటే ఎక్కువ ఇష్టమైతే 'రక్తం సూర్యుడి'కి మంటలంటే ఎక్కువ ఇష్టం.

''ఒక కలలోకి ప్రయాణం చెయ్యాలని
కలలు కంటోంది ..
కలలు పుప్పొడిలా రాలుతుంటాయో
అక్కడికి ఆ కలల లోయల్లోకి
పోదాం పద మంటుంది ఆత్మ'' [శాంతియాత్ర] మం సూ.

నా స్వల్ప ప్రాణంలో
**సుధ్యేయ సుఫల** ఆగామి యుగ జ్యోతిర్గీతల మంటలు
మంటల కులం మనది!
మంటలయుగం మనది!
మంటల గంటలు మోగుతున్నాయ్
సుప్రభాత మదిగో **సూ**ర్యుణ్ణి ఆహ్వానించండి [దారి]
ర. సూ.

ఇలా విపరించుకుపోవడం అభిమతం కాదు. పఠితకు, సామాజిక ప్రయోజనాలకు ఏ రచన కావాలో తేల్చటమే ప్రస్తుతాంశం.

''ఈ వర్తమానం గుండెల్ని చీల్చి
రేపు సూర్యోదయంవైపు
ఎగబాకుతుంటాను'' [గతం నీది భవిష్యత్తు నీది]
రాత్రున్ని నరికేస్తూ
దొంగనవ్వుల్ని **తొక్కేస్తూ**— [మైనం కరగండే]

ఇలా అనంతంగా సాగే కవితా ప్రవాహంలో తనక్కావల్సిందేదో ఎన్నుకోగలగాలి **పఠిత.** అందుకే—పఠిత విమర్శకుడు కావాలి సామాజిక కవిత్వం పోషించుకోవటానికి.

శ్రీ ఎమ్. పార్థసారధి

# కౌగిలి

అతడు, బి. వి. (బెంగుళూర్ వెంకటాచలం) బాలసుబ్రహ్మణ్యం (బాలూ), 32, పర్సనల్ అసిస్టెంట్ టు ది రీజినల్ మేనేజర్ (సదరన్ రీజిన్) మెకెంజీ (ఇండియా) లిమిటెడ్;

ఆమె, మనోరమ, 25, అదే కంపెనీలోని ఒక అక్కౌంట్స్ అసిస్టెంట్ పెళ్లిచేసుకున్నారు.

## తొలి అనుభవం

మనోరమ గదిలోకివచ్చి గడియపెట్టేసింది గత మూడేళ్ళగా ఆమెతో పరిచయమున్నప్పటికీ, ఈ రోజు, యిలా యిక్కడ ఆమెను చూడటం బాలూకు కొత్తగా వుంది. మొదటిసారిగా ఆమెను తీసుకుని మసక చీకటిగావున్న పోష్ రెస్టారెంట్‌లో పొడుగాటి కప్పుల్లోంచి పొడుగాటి చెంచాలతో ఐస్‌క్రీం తింటూ టేబుల్‌మీది ఆమె చేతిని నొక్కుతూ వేళ్ళతో ఆడుకున్నప్పుడుగానీ, ఇండస్ట్రియల్ ఎగ్జిబిషన్‌లో 'యాక్సిడెంటల్'గా కలుసుకుని తిరిగినప్పుడుగానీ, స్కూటర్‌మీద వెళుతుంటే ఆమె వొళ్ళు మెత్తగా తన వీపుకు నొక్కినప్పుడుగానీ అతడికింత థ్రిల్లింగ్‌గా లేదు. స్టోర్ రూంను టెంపొరరీ బెడ్‌రూంగా మార్చి, అప్పటిదాకా యిల్లంతా పరచుకున్న డబ్బాలనూ, సంచులనూ, విరిగిన కుర్చీలనూ అటకమీదికి పంపించి, దండెం మీదనిండిన బట్టలకుప్పనూ, కాలెండర్లనూ, పటాలనూ తీసేసి, రెండు నవారు మంచాలను కలిపి ఒకటిగాచేసి శోభనంగది తయారుచేశారు. పక్క గదిలో ప్రైవేట్ స్కూల్‌లో పనిచేస్తున్న మనోరమ చెల్లెలూ, సుందరి గదిలో ఎమ్మెస్సీ (ప్రీవియస్) చదువుకుంటున్న ఆమె తమ్ముడూ, తల్లీ, తండ్రీ—

ఎదురుగా గడియవేసి నిల్చున్న మనోరమ.

అలాగ, ఆ యింట్లో కొంచెం గట్టిగా మాట్లాడితే పక్క గదిలోకి ఎక్కడ వినిపిస్తుందోనన్నట్టుగావున్న ఆ యిరుగ్గదిలో, వాళ్లందరిమధ్యనా మనోరమతో తను—అంతేగాదు, ఆమెతో యిన్నాళ్ళ, యింతగా కబుర్లు చెప్పిన తనకు యిప్పుడు ఏమి మాట్లాడాలో తోచలేదు

మనోరమే, 'గది బాగాలేదు గదూ!' అంది.

'నో—నో. అదేంకాదు ఇలారా! అన్నాడు ఆమెను చేతుల్లోకి తీసుకుంటూ.

సన్నగా, పొడుగ్గావున్న మనోరమ శరీరమూ విశాలంగా వున్నా, బాధను దాచుకున్నట్టుగావుండే ఆ కళ్ళూ, బలహీనంగా, దీనంగా వినిపించే ఆమె కంఠమూ,—అందువల్లే ఆమెను గెలవాలనీ, ఓడించాలనీ, ఆక్రమించుకోవాలనీ, ఆమెచేత ప్రార్థింపచేసుకోవాలనీ అతనికి వుద్రేకం కలుగుతుంది ముఖ్యంగా యిప్పుడు, తన యింట్లో తనను యిలా సమర్పించుకోవటానికి వచ్చిన ఆమెను చూస్తే ఆ కోరిక మరీ ఎక్కువైంది.

బాలూ వాళ్ల రీజినల్ మేనేజర్, జనరల్ మేనేజర్‌తో కలిసి సౌత్ ఈస్ట్ ఏషియన్ కంట్రీస్ టూర్ వెళ్ళాల్సివుంది అందుకు గాను కొన్ని స్టేట్‌మెంట్లూ, రిపోర్టులూ ఈ పర్సనల్ అసిస్టెంట్ ప్రొపెస్ చెయ్యాలి. ఆ కారణంచేత బాలూను హనీమూన్ ట్రిప్ వాయిదా వేసుకొమ్మన్నారు రీజినల్ మేనేజర్‌గారు. కాకపోతే ఓ వారం రోజులు సెలవు యివ్వటానికిమాత్రం ఒప్పుకున్నారు

## తెల్లవారీ, ఆ మర్నాడూ

"మరీ మంచిది నాకు ప్రయాణమంటేనే పెద్దవిసుగు. ఇక్కడే వుందాం" అంది మనోరమ.

"మనింటికి వెడదాం, మనూ" అన్నాడు బాలూ.

"ఏయ్, నువ్వేమో బంధువులూ, చుట్టాలూ ఎవరూలేక ఒంటరిగా పెరిగావు. కాని మావాళ్ళు అలా వొదుల్తారా. కొన్ని లాంఛనాలు జరగాల్సిందే ముఖ్యంగా, మూడురోజులూ యిక్కడ గడపాల్సిందే. ఆ తర్వాతమాత్రం అక్కడికొచ్చి ఏం చేసేది? నువ్వింట్లో వుంటానంటే సరేగాని, నేనొంటరిగా వుండటం మాత్రం యింపాజిబుల్" అంది మనోరమ.

బాలూ మనోరమ యింట్లో కాంపు పొడిగించాడు.

కొత్త జంటను ఒంటరిగా వొదిలి, ఆమె తమ్ముడు కాలేజీకీ, చెల్లెలు ఆఫీసుకూ, తల్లి కుట్టు క్లాసుకూ, తండ్రి లైబ్రరీకీ వెడితే బాలూ, మనోరమా కాస్త దగ్గరగా నవ్వుకోగలిగారు. మధ్య మధ్యన స్నానం, భోజనంవంటి అడ్డంకులు కొన్ని వుండటంవల్ల

వాళ్ళకు చాలా యిబ్బందిగా తోచిందిగాని తరవాత గది తలుపు తియ్యవలసిన అవసరం వుండేదికాదు.

అంత తొందరగా సాయంత్ర మెందుకవుతుందో, తమ ఏకాంతాన్ని భగ్నం చెయ్యటానికి వీళ్లంతా యిళ్లకెందుకొచ్చేస్తారో వాళ్ల కర్థంకాలేదు. అలాగ వాళ్లకేమీ అర్థం కాకుండానే వారం రోజులూ గడిచిపోయాయి. మనోరమ యింటి కొత్తదనం థ్రిల్ చెయ్యటం తగ్గకుండానే బాలూ ఆఫీసుకెళ్లాల్సి వచ్చింది. మనోరమ మాత్రం సెలవు మరికొన్నాళ్లు పొడిగించింది.

వారంరోజులపనీ పేరుకునిపోవటంతో బాలూ పెందరాళే యింటికి రాలేకపోయాడు. మనోరమ ఈ విరహం భరించలేక సెలవు కాన్సెల్ చేసుకుని ఆఫీసులో జాయినయ్యింది. ఆఫీసులో వీలైనప్పుడల్లా, నాలుగో అంతస్తులోవున్న బాలూ, కింది అంతస్తులోవున్న మనోరమకు ఫోన్ చెయ్యటమూ ఇద్దరూ పలకరించుకునే లోపునే పదినిమిషాలు దాటిపోవటమూ జరిగేది.

''ఎన్నాళ్లు మీ యింట్లోవుంటే లాంఛనాలు తీరతాయో చెప్పు'' అన్నాడు బాలూ ఇరుగ్గదినీ, నవారు మంచాలనూ ఇక ఎంతమాత్రం భరించలేక.

మనోరమ ఆ వారంలోనే తల్లితో సహా బాలూ యింటికి టాక్సీలో ప్రయాణమైంది

## శ్రీపురంలో శ్రీవారి కాపురం

''బెన్, డానింగ్ స్ట్రీట్‌లో ఎవరుంటారో తెలుసా?'' ముగ్గురూ లగ్గేజిమోస్తూ మూడో అంతస్తుకు చేరుకున్నాక బాలూ అడిగాడు.

''నా మొహం. నీ క్విజ్ క్వొశ్చన్స్ చాలించి ముందర తలుపు తెరు'' అంది మనోరమ.

''ష్. మీ అమ్మ ముందరైనా కాస్త మర్యాదగామాట్లాడు'' అంటో మనోరమ డొక్కలో పొడిచి,

'ఆ్లైట్. 42, శ్రీపురం అపార్ట్‌మెంట్స్‌లో నేనుంటానని తెలుసుకో?'' అన్నాడు నవ్వుతూ.

వాయిదా కొనుగోలు పద్ధతిమీద నాలుగేళ్ల నుండీ బాలూ ఈ ఫ్లాట్‌లో వుంటున్నాడు. తన ముప్ఫై ఐదేళ్ల సర్వీసులో మనోరమ తండ్రి చెయ్యలేని పనులు బాలూ చాలా చేశాడు. అతడింట్లో ఓ స్టీల్ అల్మైరా, డబుల్ బెడ్, గ్యాస్ స్టవ్వూ, ప్రతి గదిలో సీలింగ్ ఫాన్లూ, ఇంకా చాలా చిన్న చిన్న సదుపాయాలూ, జాగ్రత్తగా అమర్చిన వంటిల్లూ, డ్రాయింగ్‌రూంలో సోఫాసెట్టూ, ఓ ట్రాన్సిస్టర్—కమ్—టేప్ రికార్డర్, యింకా యిలాంటివి చాలా.

''ఏమైనా తీసుకు రావలసినవి వుంటే చెప్పండి అత్తయ్యగారూ, అసలే బ్రహ్మచారి కొంప'' అన్నాడు బాలూ.

నా దగ్గిర యివన్నీ వున్నాయని మా అమ్మకు ముందర చెప్పానులే. నువ్వంత వ్యంగ్యంగా మాట్లాడక్కర్లేదు'' అంది మనోరమ కోపంగా.

''సారీ, నేనలా అనలేదు. వంట సామాన్లు ఓసారి చూడు. నాకేమవసరం గనకా — ఏవో అతి ముఖ్యమైన వస్తువులు మాత్రం కొనుక్కొచ్చేవాణ్ణి. చాలాసార్లు బ్రెడ్డూ, పాలూ, పళ్లతో కాలక్షేపం చేస్తాను. మరి సంసారమంటే అలాకాదుగా, అందుకోసం'' అన్నాడు బాలూ డిఫెన్సివ్‌గా.

ఆ రాత్రి సీలింగ్ ఫాన్ కింద, ఫోంబెడ్ మీద పడుకుంటే హాయిగానే వుంది మనోరమకు. తల్లి వున్నన్నాళ్లూ ఆమెకు వంట చేసే పని తగల్లేదు. ఆమెపని డ్రాయింగ్‌రూంలో కూర్చోవటమూ, అతడి చిన్న లైబ్రరీలోవున్న వేదాంతంపుస్తకాలు తిరగెయ్యటమూ

''సెలవెందుకు వేస్టుచేస్తావు. ఆఫీసుకు పద'' అంటాడు బాలూ.

''రోజూ ఆఫీసుకు పోకపోతేనేం. ఇద్దరం కలిసి సెలవు పెట్టేద్దాం'' అంటుంది మనోరమ.

మనోరమ మాటే నెగ్గుతుంది. పడగ్గది తలుపు మూతబడుతుంది. ఆమె తల్లి వాళ్లకు మధ్యాహ్నానికి స్వీట్స్, సేవరీలూ తయారు చేస్తూంటుంది.

''మనకైతే హాయిగానే వుందిగాని, మీ ఫాదర్ వాళ్లకు యిబ్బందిగా వుంటుందేమో పాపం. మీ అమ్మ యిక్కడే వుంది'' అన్నాడు బాలూ.

'నేనూ అదే అన్నాను. కాని 'మీకేం యిచ్చాను గనక. కట్నాలిచ్చానా, కానుక లిచ్చానా. ఈ నాలుగు రోజులు వండిపెట్టటమేగా నేను చెయ్యగలిగింది అంది'' అంటో మనోరమ...

''ఉండనీలే. ఆవిడక్కైనా అక్కడ అందరికీ చేస్తూ కూర్చోవటం కన్నా యిక్కడ తొందరగా వంట ముగించి కూర్చోవటం కొంతలో కొంత తీరికే'' అన్నాడు బాలూ.

## హనీమూన్

''మనూ, మనం ఎలాగూ తిరుపతి కెళ్లాలి. అలాగే లీవ్ ఫేర్ కన్సెషన్ స్కీంలో సౌత్ ఇండియా తిరిగొద్దాం. ఏమంటావ్, మన బాస్ సౌతీస్ట్ ఏషియా తిరిగొస్తే మనం కనీసం సౌత్ఇండియా తిరిగి రాలేమా ?'' అంటో జోక్ చేశాడు బాలూ.

ఆ మరుసటి వారంలో వాళ్లిద్దరికీ సెలవు శాంక్షన్ అయింది. ఏడుకొండలవాడి దర్శనం చేసుకుని, అటునుండి బెంగుళూరు, మైసూరుల మీదుగా ఊటీ చేరుకున్నారు.

''నేను ముందరే వొద్దన్నాను ఈ ప్రయాణం. సేల్స్ ఎక్సెక్యూటివ్స్‌లా ఏమిటీ తిరగటం ? ఒక్కచోటా కాస్త తిరిగ్గా

వున్నది లేదు. రోజంతా బస్సులో కూర్చోవటం. రాత్రి ఏదో హోటల్లో బస. మళ్లీ పొద్దున్నే బస్సు'' అంటూ విసుక్కుంది **మనోరమ.**

''ఔనమ్మాయ్, మరి ప్రయాణమంటే ఏమనుకున్నావ్ ?''

''బొటానికల్ గార్డెన్స్‌లో అలా హడావిడిగా పరిగెత్తి రాక పోతే కాస్త నెమ్మదిగా రాకూడదూ ?''

మరి హయ్యెస్ట్ పీక్ చూడొద్దూ ?''

''అక్కడమాత్రం ఎంతసేపున్నాం, పట్టుమని పదినిమిషాలు కూడా నించోలేదు.''

''టూరిస్ట్ స్పేసెస్ అంటే అంతేమరి. అలా చూడాలి ఇలా రావాలి.''

''ఔనులే. సాలార్‌జంగ్ మ్యూజియంఅంతా గంటసేపట్లో చ్చూసిరాలేదూ ఆరోజు. అలాగే.''

''అవును. నాకంత పెద్ద కళా హృదయం లేదు. ఏదో చూడాలనే కుతూహలమే తప్ప.''

''కుతూహలమేనా ? చూసి ఆనందించాలనే కోరిక లేదా ?''

''ఏదో ఒకటి.''

''పెళ్లై నెలరోజులైంది. కుతూహలం తీరి వుంటుంది. ఇంక డైవోర్సిచ్చేస్తావా ?''

''షటప్. ఏమిటా మాటలు.''

బాలూకు తమిళనాడులో స్నేహితు లెక్కువగా తగిలేరు. మదురై వెళ్లినప్పుడు అక్కడ స్టేట్ బ్యాంక్‌లో పని చేస్తున్న ఓ ఫ్రెండు యింట్లో బస చేశారు. త్రివేండ్రంలో ఓ మెడికల్ షాపు యజమానికూడా బాలూ ఫ్రెండుకు ఫ్రెండుట అలాగే పళనిలో చూడ్డానికేమీ లేకపోయినా అక్కడో ఫ్రెండున్నాడని ఆగేరు.

బాలూ తమిళం మాట్లాడుతుంటే మనోరమకు యిబ్బందిగా వుండేది.

''అలా చూస్తావేం, మేమేమీ రహస్యాలు మాట్లాడుకోవటం లేదు. అంత అనుమానంగా వుంటే నువ్వు కూడా నేర్చుకో'' అనేవాడు బాలూ.

''నువ్వు తమిళమూ, కన్నడమూ, మళయాళమూ కూడా మాట్లాడేస్తుంటే నేనెన్నని నేర్చుకోను ?'' అంటూ మనోరమ.

''లేకపోతే యింతే. మేంమాట్లాడుతుంటే నువ్వు క్వొశ్చన్ మార్కు మొహంతో చూడాల్సిందే ''

అలాగ వాళ్లు రాత్రిళ్లు హోటళ్లలోనూ, రోజంతా బస్సు లోనూ మజిలీచేస్తూ పదిహేను రోజుల్లో దక్షిణదేశ యాత్ర పూర్తి చేసుకుని మళ్లీ హైదరాబాదు చేరుకున్నారు.

# అద్దం ముందర యిద్దరు

భోజనమంటే ఏదో నాలుగు ముద్దలు మింగెయ్యొచ్చు. కాని డ్రెస్సింగ్ !

''మగాళ్లు డ్రెస్ చేసుకోవద్దనా ఏమిటి నీ వుద్దేశం! షర్ట్ టక్ చేసుకోనీ కాస్త.''

''ఎందుకు చేసుకోవద్దూ. చక్కగా రోజంతా చేసుకోవచ్చు కాని ఆ నిష్పత్తిలో మూడంగుళాల జుత్తున్న మీరు అరగంటసేపు దువ్వుకుంటే మూడడుగుల జడ వేసుకోవాల్సిన మేం ఎంతసేపు దువ్వుకోవాలో లెక్క వెయ్యండి. పాంటులో షర్టు టక్ చేసుకోవటానికి పదిహేను నిమిషాలు పట్టితే, ఆకారంలేని చీరను ఓ ఆకారంలో చుట్టి కుచ్చిళ్లు సవరించుకోవటానికి ఎంతసేపు—ఇంకా—''

''చాల్చాలు. నెక్ట్స్‌మంత్ నీకు నేరే ఓ అద్దం కొనుక్కొస్తానులే. గొడవ వదులుతుంది. ఈ అలంకారాల సంగతి చాలించి టిఫిన్‌లో వుప్మా పెట్టు...ఆ జ్ఞాపకం వచ్చింది. అయ్యబాబోయ్, పెట్రోల్ రిజర్వులోకి వచ్చినట్టుంది. మధ్యన ఆగాలి...''

''అవునుమరి, ఏడింటిదాకా పడుకుని...''

''ఊ ఎనిమిదింటికి కాఫీ తాగి వంట మొదలెట్టితే .. మీ అమ్మ ఎన్నింటికి లేస్తుందోయ్ ?''

మనోరమ సీరియస్‌గా మొహం పెట్టి,

''సాయింత్రం చెబుతాను'' అంది.

ఎప్పుడూ ఆఫీసు టైంకన్నా పది నిమిషాలు ముందరే వచ్చే బాలూ యిప్పుడు ఆలస్యంగా రావటం చూసి వాళ్ల బాస్ నవ్వేడు బాస్ దగ్గరున్న జమేదారు కూడా నవ్వేడు.

పెళ్లి తర్వాత ఓ కొత్త నిండుదనం వచ్చిన మనోరమ స్కూటర్ వెనక కూర్చుంటే బాలూకు గర్వంగా వుంటుంది. హడావిడిగా స్కూటర్ను స్టాండులో పెట్టి, గాగుల్స్‌తీసి, కొంగు సవరించుకొనే మనోరమ పక్కన నడవగా, ఓ చిర్నవ్వు విసిరి తన సెక్షన్‌లోకి గబగబా నడిస్తే తెలిసినవాళ్లు ఇతను లేట్టులోకి రాగానే టైంచూస్తే,

''ఏం చెయ్యను గురూ, సంసారి కష్టాలు'' అంటూ నవ్వుతాడు. ఆ తర్వాత అర్జెంటుగా మనోరమకు ఫోన్‌చేసి,

''చూశావా, అంత గొడవ చేశావు గాని, నేనీరోజు హాంకీ మర్చిపోయాను'' అంటాడు.

... ...

''సారీ ఈ రోజు టిఫిన్ లేదు.''

''మధ్యాహ్నం ఏదైనా హోటల్‌కు పోదాంలే. నేను ఒంటి గంట కొచ్చేస్తాను.''

''నీకు మూడింటి తర్వాత తీరిగ్గా వుంటుందా ?''

''ఏం ?''

''నువ్వైతే చెప్పు.''

''వుంటుందిలే. అవసరమైతే పర్మిషన్ తీసుకుంటాను.''

''ప్లీజ్.''

''ఇంతకీ ఎందుకు ?''

''మాట్నీకి పోదాం.''

# సంధ్యా సమస్య

ఆరున్నర.

''ఇంటికెళ్లి వంటచేసే ఓపికలేదు సరదాగా కాసేపు అలా ఆబిడ్స్‌లో తిరిగి, ఎక్కడో భోంచేసి వెడదాం'' అంది మనోరమ బద్ధకంగా.

''ఇంట్లో ఏమిలేవని ? కూరగాయలు కూడా వున్నాయి.''

మనోరమ బాలూ చెయ్యి గట్టిగా నొక్కింది. ఆమె సన్నటి వేళ్ళు అతడి వేళ్లతో పెనవేసుకున్నాయి

''నువ్వు వంట చేస్తావా?''

''ఓ యస్. రుచి చూద్దువుగాని పద.''

''నో నో. ఈ రాత్రికేమీ వద్దు. అలా విండో షాపింగ్ చేద్దాం ఆనంద్‌లో ఐస్‌క్రీం తిందాం.''

స్కూటర్ను మెట్రో ఎస్టేట్‌లో పార్కుచేసి నడిచారు.

''నీకో షర్టు కొనివ్వనా?''

''ఇప్పటికే చాలా మూలుగుతున్నాయి అల్మైరాలో.''

''కాని స్నోవైట్ షర్టు ఒక్కటీలేదు. పద. పర్సులో వంద రూపాయిలున్నాయి ఒక్క షర్టుగుడ్డ రాదంటావా?''

''నువ్వు చీర కొనుక్కో.''

''నీ దగ్గిరెంతున్నది?''

''నీ దగ్గర నా దగ్గరేమిటోయ్, పద. ఆడవాళ్ల కెన్ని చీరలున్నా తక్కువే మరోటి కొందువుగాని పద. నా జేబులో ఓ యాభై వున్నాయి. నూటయాభైలో నైలెక్సుచీర రాదా?''

''నువ్వు ముందర ప్రపోజ్ చెయ్యలేదుగా

నాలుగైదు షాపులు తిరిగితేగాని మనోరమకు నచ్చిన స్నోవైట్ షర్టుగుడ్డ దొరకలేదు.

''టెయిలర్ కిచ్చేసి వెడదాం పద.''

''ఇలాంటి షికార్లు నీకు బావుంటాయిగదూ, మనూ.''

''ఊఁ''

''ఆఫీసులో కులాసా కబుర్లుచెప్పి, మాట్నీకెళ్లి, హోటల్లో భోంచేసి, యింటికెళ్లి పడుకొని...''

''నీకెలాగైతే బావుంటుంది?''

''తొందరగా యింటికెళ్లి, గబగబా భోజన కార్యక్రమం ముగించి, కాసేపు చదువుకొని, పడుకొని, పెందరాళే లేచి వంటచేసి...''

''రాంగ్ ఛాయిస్.''

''మనూ, ఇలావుంటే డబ్బు చాలా ఖర్చవుతుంది. ఏదో మొదట్లో తిరిగాం గాని, పెళ్లైన తర్వాతకూడా యింకా యిలా ప్రేమ పక్షుల్లా తిరగటం...''

''ఓహో, పెళ్లిముహూర్తాన్నే ప్రేమ చచ్చిపోయిందిగదూ!''

''ఇప్పుడు మనం చక్కగా యింట్లోనే గడపొచ్చుగా. అప్పుడంటే వీల్లేక రోడ్లమీదా, హోటళ్లలోనూ గడిపాంగాని.''

''సంవత్సరంగా అంత ఆతృత చూపించినవాడివి, నాచుట్టూ తిరిగినవాడివి, నాకోసం గంటలు గంటలు నిరీక్షించిన వాడివి. యిప్పుడు రెండు నెలల్లోనే బోర్ కొడుతోందిగదూ! ఇందు కోసమేనా యిన్నాళ్ల మన పరిచయం ?''

''కాని తేడా వుండాలిగా!''

''ఉంది. అప్పటి నిరీక్షణ యిప్పుడులేదు. ఇప్పుడు ప్రతి క్షణం ఆనందంగా గడపొచ్చు ఇద్దరి జీతం వస్తోంది. ఎవర్ని పోషించే దుందని? మనకోసమేగా! రోజూ యిలాగే గడిపెయ్యలేమూ? నీకు బాగాలేదా?

''లేదు. మనమూ అందర్లా వుండాలి. మనమేదో విలక్షణ మైన జంట అనుకోగూడదు.''

మనోరమకు స్నోవైట్ షర్టుగుడ్డ అంత తెలుపుగా కనిపించలేదు.

# క్రికెట్ Vs. కిచెన్

ఆదివారం పొద్దున్న ఏడుగంటలు. మనోరమ మంచంమీద బద్ధకంగా పడుకుని నిద్ర మరికాసేపు పొడిగించటానికి ప్రయత్నిస్తోంది. కాని బాలూచేసే చప్పుడు అందుకు అడ్డం వస్తోంది. టేప్ రికార్డర్‌లో సుబ్బులక్ష్మి కీర్తనలు మేల్కొలుపు పాడుతున్నాయి. మిల్కుబాయిలర్ ఈలవేస్తున్నది. బాలూ గడ్డం చేసుకుంటున్నాడు. మధ్యమధ్య, మనూ డార్లింగ్, గెటప్. పాలు కాగేయి. కాఫీ చెయ్యనా?'' అంటున్నాడు. రాత్రంతా ఆమె ప్రక్కనే పడుకున్నా, నాలుగు నెలలుగా కాపురం చేస్తున్నా, ఆమె బద్ధకంగా వళ్ళు

విరుచుకుని పడుకుంటే అస్తవ్యస్తమైన ఆమె చీరా, నిద్రకళ్ళూ, ఆ పడుకోవటంలోని కేర్ ఫ్రీనెస్ అతడికి చాల సెక్సీగా వున్నాయి.

మనోరమ కళ్ళు తెరిచి చూసేసరికి, బాలూ పాంటూ, షర్టూ, బ్లేజర్ వేసుకుని వెళ్ళటానికి రెడీగా వున్నాడు.

''క్రికెట్ ప్రాక్టీస్ సెషన్'' అన్నాడు మనోరమ అడక్కుండానే. ''వచ్చేనెల యిక్కడ లీగ్ టోర్నమెంట్స్ కాబోతున్నాయ్. ఈసారి మెకెంజీ ఎలెవెన్ సీరియస్‌గా పోటీచేస్తుంది'' అంటో కళ్ళద్దాలోసారి తుడిచి మళ్ళీ పెట్టుకొని, ''ఎలా వున్నాను క్లైవ్ లాయడ్ ఆఫ్ ఇండియా?'' అన్నాడు.

మనోరమ కాసేపు చూసి, లేచి,

''నువ్వెళ్ళేట్టయితే, నేనూ మా అమ్మవాళ్ళింటి కెడతాను'' అంది

''ప్లీజ్ మనూ, ఇవి చాలా క్రూషియల్ ప్రాక్టిస్‌సెషన్. నీకు తెలుసా, నేను టీంకు వైస్—కెప్టెన్ని. ప్రాక్టిస్ లేకపోతే మాచ్ ఎలా ఆడతాం చెప్పు. ఒకవేళ నువ్వు వెళ్ళినా సాయంత్రంకు వచ్చెయ్యాలి. లేదా నేను మాచ్‌నించి వస్తూ నిన్ను పికప్ చేసుకుంటాను ''

''సారి, నేను రాను.''

''ప్లీజ్ డార్లింగ్.''

''ఏయ్, నువ్వు మస్కాకొడితే వుబ్బిపోవటానికి నేను మీ బాస్‌ను కాదు ''

''అలా మాట్లాడక, మనూ డియర్ వైస్ కెప్టెన్ అంటే ఎంత ప్రెస్టేజి అనుకున్నావు! ఊరికే ఏ ప్రాక్టిస్ లేకుండానే మాచెస్ ఆడతారా ఏం? ప్రతి పనికీ ఎంతో వోపిక, డిసిప్లిన్ కావాలి. ఎన్నో రోజులు, వారాలు ప్రాక్టిస్ చెయ్యాలి. ఓ 'ఎ' లీగ్ మాచ్‌లో ఆడటమంటే ఎంత ప్రెస్టీజియస్‌గా వుంటుందో నీకేం తెలుస్తు! వెధవ ఆఫీస్ రొటీన్‌లోపడి చిక్కుకుపోయానుగాని నేను రాంజీ ప్లేయర్ను కావలిసినవాణ్ణి. పోనీ, ఓ పని చెయ్యి. తొరగా తయారవ్వు. నిన్ను మీ అమ్మ వాళ్ళింట్లో డ్రాప్‌చేసి వెడతాను''...

''అక్కర్లేదు. నేనింట్లోనే వుంటానుగాని, కాస్త కూరగాయ లేమైనా తెచ్చివ్వు'' అంది మనోరమ అతడి వుపన్యాసం ఆపటానికి.

''షూర్. షూర్. కానీ ఓమాట. నేను ఐదింటి తర్వాతే మళ్ళీ రావటం — అంటే రాత్రికే భోజనం. రోజంతా నిన్నిలా యింట్లో వొదిలి పోవాలంటే బెంగగా వుందోయ్''

''ఏం, బైటి నుండి తాళం వేసుకుపోతావా ?'' అంది మనోరమ.

''యూ పిల్లీ.''

## సూర్యముఖి

కొత్త చీర కట్టుకుపోతే, సెక్షన్‌లోని శాంతకుమారి ''చీర చాలా బావుంది ఎంతకు కొన్నావు ? ఎక్కడ ?'' అని అడిగితే మనోరమ గర్వంగా, 'మా హజ్బెండ్ సెలెక్షన్' అని చెప్పింది

చీర నాణ్యతను ఆడ కొలీగ్స్ చూస్తే, చీర కట్టిన మనోరమను మగ కొలీగ్స్ అడ్మైర్ చేస్తారు.

''పెళ్లి తర్వాత ఎవ్వరితోనూ మాట్లాడొద్దని చెప్పాడా, బాలూ ?'' అంటో అడిగాడు రాధాకృష్ణ. ఒకప్పుడు ఆమెకోసం బస్‌స్టాప్స్ వద్దా, కాంటీన్‌లోనూ పడిగాపులుపడి, బస్సు టిక్కట్లు కొని, కాఫీ లిప్పించి, కొత్త సంవత్సరం కాలెండర్లిచ్చి, ఇక అంతకన్నా ఎక్కువేయిస్తే ఆమె నిరాకరించిన పరిస్థితిలో డెస్పరేట్‌గా కొన్నాళ్ళు గడ్డం పెంచి, తాగి, ఆమె పెళ్లితో తిరిగి ఈ లోకంలో పడ్డ రాధాకృష్ణ.

''నేను మాట్లాడుతూనే వున్నానే'' అంది మనోరమ.

''మీ శ్రీవారితో కాదు మాతో'' అన్నాడు రాధాకృష్ణ.

మనోరమ నవ్వబోయి మానేసింది.

''మీరు కాస్త ఒళ్లు చేశారు'' అన్నాడా రాధాకృష్ణ. కాంటీన్ బాయ్ కాఫీ తెస్తే రెండు కాఫీలు తీసుకున్నాడు.

పెళ్లికి మమ్మల్ని పిలిస్తే ఏమైంది అంత రహస్యంగా ఎందుకు చేసుకున్నారు ?

''మావారి నిర్ణయం ''

''పెళ్ళైన తర్వాత మీ వారయ్యారా, ముందేనా ?''

మనోరమకు ఆ మాటకు కోపం రావలిసిందేగాని, రాధాకృష్ణ మొదలైనవాళ్లు చాలా రోజులుగా ఆమెతో అంత చనువుగానూ మాట్లాడేవాళ్లు. అందువల్ల యిప్పుడు సడెన్‌గా కోపం తెచ్చుకుంటె లాభం లేదని గ్రహించి వూరుకుంది.

రాధాకృష్ణ మళ్ళీ,

''పోనీ, మీరు పిలవచ్చుగా. మేమేం పెళ్లి చెడగొడతామని భయం వేసిందా ఏం ? ఏదో నాలుగక్షింతలు వేసేవాళ్లం. మీరు గర్వంతో మావైపు చూస్తుంటే, జెలసీతో మా ఫ్రెండు అంత మంచి మొగుణ్ణి ఎన్నుకున్నందుకు సంతోషించేవాళ్లం'' అన్నాడు

''అబ్బబ్బ. దాన్ని గురించి మాట్లాడకండిక ఏదో జరిగిపోయింది. ఊర్కోండి'' అంది మనోరమ.

''ఏం, అంత విరక్తిగా మాట్లాడుతున్నారేం ?'' అన్నాడు రాధాకృష్ణ.

''లేదే !''

కాని తనకు తెలియకుండానే తనలో విరక్తి ప్రవేశించిందేమోనని అనుమాన మొచ్చింది.

''అలాగంటే లాభంలేదు. మీరు ఆఫీసులో చేరిననాటినుండీ మనం కలిసి పని చేస్తున్నాం. కనిపిస్తూనే వుంది. మీలో ఏదో మార్పు వచ్చింది'' అన్నాడు రాధాకృష్ణ.

వెనుకటి జ్ఞాపకాలతో మనోరమ,

''చాల్లే. కాస్సేపు నోర్మూసుకోవచ్చు. ఏమైందివ్వాళ? నా క్షేమ సమాచారాలు తెలుసుకోవాలని అంతగా బుద్ధిపుట్టింది?'' అంది

రాధాకృష్ణ నవ్వుకుంటూ తన సీటు దగ్గరకి పోయాడు.

## కనిపించని గాయం

సాయంత్రం ఆఫీసునుండి బయల్దేరేముందు, ''ఈనాలుగు రోజులూ మా అమ్మ వాళ్లింటికి వెళ్తాన్తాను నన్నక్కడ దింపేసి పో'' అంది మనోరమ

రాత్రి అక్కడే భోంచేసి, మళ్లీ శ్రీపురం వచ్చేశాడు బాలూ తెల్లారి మనోరమ ఆఫీసుకు రాలేదు. వాళ్లింటి పక్కవాళ్లకు ఫోన్ చేసి మనోరమతో మాట్లాడాలని ప్రయత్నించాడు గాని ఫోను కలవ లేదు. సాయంత్రం ఆఫీసునుండి నేరుగా మారెడ్‌పల్లికి—మనోరమ వాళ్ళింటికి — వెళ్లాడు

''అది మాట్నీకి వెళ్లింది బాబూ'' అని చెప్పింది అత్తగారు. మనోరమ చెల్లెలు నీరజ అప్పుడే ఆఫీసు నుండి వచ్చింది. బాలూ వివరాలు అడగలేదు. నీరజ కూర్చుని కాసేపు కబుర్లు చెప్పి,

'ఈ పత్రికలు చూస్తుండండి'' అంటూ తన బ్యాగ్‌లో నుంచి ఆఫీసు నుండి తెచ్చిన పత్రికలు తీసి ముందరేసి జడ విప్పుకుంటూ లోపలి కెళ్లింది. ఐదు నిమిషాల తర్వాత చీరమార్చుకుని, మొహం కడుక్కుని, కాఫీతో వచ్చింది.

''ఏమిటి నీరజా, ఇంక ఆ ఆఫీసులో సెటిల్ ఐనట్టేనా?'' అన్నాడు బాలూ సంభాషణ ప్రారంభించటానికి

''ఆఁ, ఏదో ఒక వుద్యోగం.''

''అదేమిటి, అంత నీరసం వచ్చేసిందేమిటి అప్పుడే. ఇంకా కొత్త వుద్యోగాల కోసం, వున్నతికోసం ప్రయత్నించ కూడదా ?''

''ఎంత చేసినా మావి సప్లిమెంటరీ వుద్యోగాలే కదా !'' అంది నీరజ. ఆమె మనోరమ కన్నా కాస్త లావుగా వుంటుంది. నల్లగా వుంటుంది. కాని గొంతు బావుంటుంది.







కాసేపు కూర్చుని మళ్లీ లోపలికెళ్లింది.

''వంటపని నేను చూసుకుంటాగాని కాస్త అతడితో మాట్లాడు పో. ఇంట్లో ఎవరూ లేరు'' అంది తల్లి.

''నీరజ మళ్లీ వచ్చింది.

''ఏ సినిమా కెళ్లిందో ?'' అన్నాడు బాలూ.

''ఏమో మధ్యాహ్నం మా తమ్ముడి ఫ్రెండ్స్ వచ్చారట. వాళ్లు ఏదో ఇంగ్లీషు సినిమాకు ప్రయాణమైతే ఇదీ వెళ్లిందిట'' అంది నీరజ

''మరి కాస్త తాగండి'' అంటో మళ్లీ కాఫీ తెచ్చింది.

''పోనీ నేను వెడతానులే'' అంటూ లేచాడు బాలూ.

''అదేమిటండీ, కూర్చోండి. కాసేపైతే వచ్చేస్తుంది. ఇంత దూరం వచ్చి అప్పుడే వెడతారా భోంచేసి వెళ్లండి'' అంది నీరజ.

''ఆహా. అక్కర్లేదు'' అంటో లేచాడు బాలూ.

''సరే. ఆ విషయాలన్నీ అక్క చూసుకుంటుందిగాని కాస్త కూర్చోండి'' అంటో రేడియో ఆన్చేసి వచ్చింది.

ఆరైంది ఏడైంది మనోరమ రాలేదు రహస్యాలు మాట్లాడుకోలేని ఆ చిన్న యింట్లో మనోరమ తల్లి విసుక్కుంటోంది – ''ఏమి సినిమాలో ఏమిటో. అతడొచ్చి యిక్కడ కూర్చున్నాడు. ఇదేమో బయట తిరుగుతోంది. ఛీ ఛీ'' అంటోంది.

నీరజ 'ష్' అంటోంది. మనోరమ తండ్రీ వచ్చాడు. ఛేస్ నవల చేత బట్టుకుని కూర్చున్నాడు.

బైట ఆటో ఆగింది. మనోరమా, ఆమె తమ్ముడూ దిగేరు ''థ్యాంక్యూ, గుడ్నైట్.'' – మనోరమ గొంతు.

''అరెరె. నువ్వు వచ్చికూర్చున్నావా. సారీ'' అంది బాలూను చూసి.

ఆమె రాకతో తనకి పరిచితమైన వాతావరణంలోకి వచ్చి నట్టైంది బాలూకి, కాని...

## రాత్రి

''నువ్వు వుదయం వండిన అన్నంవుంది. వెడతాను. అక్కడే తింటాను'' అన్నాడు బాలూ.

''వేడి వేడి అన్నం తినమంటే చల్లారింది తింటానంటావేం. కాసేపుండిపో'' అంటూ మనోరమ అతడి కుర్చీపక్కగావచ్చి నిలబడింది.

''నువ్వు వస్తావని తెలిస్తే వెళ్లకపోదును.''

''నువ్వు ఆఫీసుకు రాకపోతే ఎందుకు రాలేదోనని వచ్చాను'' అన్నాడు బాలూ. గొంతుదాకావచ్చి అనలేని మాటలు చాలావున్నాయి. కోపంగా, జెలసీగా, అసహ్యంగా వుంది కాని ఆమె తన సన్నటి వేళ్లతో అతడి జుత్తు సవరిస్తూ, ''ఫలో, భోజనానికి లే'' అంది.

బాలూ కాళ్లు కడుక్కునివచ్చి తుడుచుకుంటూవుండగా, అతడ్ని పెదాలకో ముద్దు ప్రెజెంటుచేసి ''అమ్మా, వడ్డించు అంటో కేకేసింది

''ఛీ. నీకు సిగ్గులేకుండా పోతున్నది'' అన్నాడు బాలూ

''నాకు తెలుసు. నాకు తెలుసు. నీ కోపాన్నంతా మరో మూడురోజులు అవుకో'' అంది మనోరమ.

భోజనం తర్వాత కూడా యింటికి వెళ్లటం పడలేదు బాలూకి. మనోరమా, ఆమె తల్లీ, నీరజా, తనూ కలిసి రమ్మీ ఆడుతూ కూర్చున్నారు.

ఇదో కొత్త అనుభవం.

రాత్రి గడుస్తుంటే, కళ్లు ఎరుపెక్కుతుంటే, పగటిసిగ్గు క్రమంగా తగ్గి, ఓ కొత్త వుషారూ, కదలికల్లో అశ్రద్ధా, కాళ్లు పైకి కట్టుకొని వెనక్కువాలి కూర్చుని, ఆవలిస్తూ, విసుక్కుంటూ, నవ్వుకుంటూ—ఆ వింత వాతావరణమే అతడికి కొంత నిషా ఎక్కించింది. నీరజ రెండు మూడుసార్లు 'నిద్రవస్తూంది, వెడతాను' అంది కాని మనోరమ చెల్లెలి చెయ్యిపట్టుకుని మరీ కూర్చోపెట్టింది.

'నా మొహం. నేనెంతసేపు కూర్చోనే మీరంటే పడుచువాళ్లు రాత్రంతా జాగారం చెయ్యగలరు. నేను వెడతాను'' అంది మనోరమ తల్లి. కాని ఆవిడా వెళ్లలేదు

అర్ధరాత్రి దాటితే,

నిద్ర కళ్లకు, నిషాకళ్లకు లైట్లు కొత్తగా కనిపిస్తాయి. గదిలో ఫర్నిచర్ కొత్తగా కనిపిస్తుంది. మనుషులు కొత్తగా కనిపిస్తారు. వాతావరణం కొత్తగా వుంటుంది బైట గదిలో మనోరమ తండ్రి గుర్రుపెడుతున్న శబ్దం ఈ వింతదనాన్ని మరింత పెంచింది. మనోరమ ఆవలిస్తూ కాళ్లు బారచాపుకుని కూర్చుంది. నీరజ కూడా కాసేపు సందేహించి చివరికి కాళ్లు చాపుకుంది.

పేకాట ముగిసేసరికి రెండుదాటింది

''ఈ రాత్రి యింటికేం పోతావు, యిక్కడే పడుకో'' అంద మనోరమ. బాలూ కాదనలేదు.

తల్లీ కూతుళ్లు ముగ్గురూ వంటింట్లో పడుకున్నారు. బాలూ ఒక్కడూ ఆ గదిలో చాలాసేపు ఆలోచిస్తూ పడుకున్నాడు.

''డబ్బెట్టి ఆడితే ఎంతసేపైనా ఆడొచ్చు. ఊరికే ఆడాలంటే విసుగే'' అంది నీరజ.

''అలాగే అను. ఈసారికి అతడు మనల్ని నిలువు దోపిడీ చేసేవాడు'' అంది ఆమె తల్లి.

''ఊం. పడుకోవే'' అంది మనోరమ.

''తన మొగుడి టైం వేస్టుచేస్తున్నామని ఆమెకు కోపంగా వుంది'' అంది నీరజ.

## ఫ్రం అమెరికా విత్ లవ్

'ఎం. కె. సంపత్, అసోసియేట్ ఇంజినీర్, రాక్సన్‌స్ప్రింగ్స్, న్యూజెర్సీ, యు ఎస్. ఎ.'

''మా కజిన్ బ్రదర్ రాశాడు'' అన్నాడు బాలూ.

''ఎవరూలేరని చెబుతుంటావేమిటి మరి?'' అంది మనోరమ ఉత్తరం తీసుకుంటూ.

''ఉంటే ఏం లాభం? సంపత్ అక్కడే సెటిలైపోయాడు. పదేళ్ల క్రితం నేనీ కంపెనీలో చేరినప్పుడు వాడు పొట్ట పట్టుకొని వుద్యోగాల కోసం తిరుగుతుండేవాడు — నా దగ్గర్నుండి పదీ పరకా తీసుకుపోయేవాడు అలాంటిది, మరి ఏదో అమెరికన్ కంట్రీలో వుద్యోగావకాశా లున్నాయని వెళ్లాడు. అక్కణ్ణించి నెమ్మదిగా అమెరికాలో కాలు ఫెట్టేశాడు. ఇప్పుడు వాడికి కారు, టి వి. బ్రహ్మాండమైన ఫర్నిష్‌డ్ అపార్ట్‌మెంట్ — అంతా పోష్ లైఫ్. మొదట అవకాశం చూసి నన్ను కూడా పిలిపిస్తానన్నాడు. కాని ఎక్కడా — అన్నీ కబుర్లే. నెక్ట్స్ యియర్ యిక్కడికొచ్చి పెళ్లి చేసుకుని వెడతాడట. ఏమిటో—'' అంటో తను తయారుచేసిన వుత్తరాల ఫైల్ తీసి జాగ్రత్తగా ఈ వుత్తరం కూడా అందులో ఫైల్ చేశాడు. ఆ తర్వాత దానికి జవాబురాసి, టైప్‌చేసి, ఓ కాపీ కూడా అదే ఫైల్లో చేర్చాడు.

''ఇంట్లో మరో ఆఫీసు పెట్టుకున్నావా ఏమిటి?'' అంది మనోరమ.

బాలూ దానికి జవాబు చెప్పకుండా,

''మనూ, ఫారిన్ వెళ్లటానికి నీకు యింటరెస్టు వుందా?'' అని అడిగాడు.

''వెళ్లాలనిపించినంత మాత్రాన వెళ్లగలిగితే నువ్వీ రోజు యిక్కడ వుండేవాడివా?'' అంది మనోరమ.

''అది నిజమే గాని, అవకాశం వచ్చినప్పుడు మనం అన్ని క్వాలిఫికేషన్సుతోనూ రెడీగా వుండాలి. పోనీ, మన కంపెనీకున్న విదేశీ ఆఫీసుల కెక్కడికైనా ముందర వెళ్లి, అక్కణ్ణించి ప్రయత్నించవచ్చుగా.''

''మీ కజిన్ బ్రదర్ నుండి వుత్తరం రాగానే నీకిలాంటి యిన్స్పిరేషన్ వస్తుందనుకుంటాను.''

''మనూ, నీకెలా చెప్పను? యాఫ్టరాల్ వీడు, సంపత్ గాడు, నా కళ్లముందరి నిరుద్యోగి, నా దగ్గర అప్పులుచేసి తిరిగిన వాడు ఈనాడు అలా అక్కడ అంత లక్జరియస్‌గా బ్రతుకుతున్నాడంటే — నేనేమో యిక్కడ యిలా—నీకేమీ అనిపించదా?'' అన్నాడు బాలూ బాధగా.

''ఏమో, నా కలాంటి కోరికలేమీ లేవు. ఇక్కడే హాయిగా సరదాగా తిరుగుతూవుంటే అంతే చాలుననిపిస్తుంది.''

''ప్చ్. యాంబిషన్ లేని వాళ్లను చూస్తే నాకు చాలా చిరాకు'' అన్నాడు బాలూ తన వుత్తరాల ఫైల్ తిరగేస్తూ.

క్షణంలో అతడు ఏదో దీర్ఘాలోచనలో పడ్డాడు

కాసేపుండి మనోరమ, ''పద్దైపోయింది. పడుకుందాం. దా'' అంది.

''ఎంతసేపూ భోజనం, నిద్ర, షికార్లు. ఇవితప్ప నీ కింకేమీ కోరికలు లేవా?'' అన్నాడు బాలూ విసుగ్గా.

## కూడికలు - తీసివేతలు

జీతాల్రోజు. ఆఫీసు హడావిడిగా వుంది. అప్పులవాళ్లు ఆఫీసుముందర మోటార్ సైకిళ్లమీద కూర్చున్నారు. చిట్స్‌వాళ్లు, చందాలవాళ్లు, విరాళాలవాళ్లు, ఇచ్చిపుచ్చుకోలు వ్యవహారాలవాళ్లు సందడిగా తిరుగుతున్నారు. పెళ్లయిన ఈ నాలుగు నెలల్లోనూ మనోరమ జీతమెంతో తెలుసుకోవటానికి ప్రయత్నించలేదు. ఇంటి ఖర్చు చాలా భాగం తనే భరిస్తున్నాడు. తన డబ్బులతో ఆమె ఏం చేస్తున్నదో తెలియదు. ఆ రోజు శాలరీ సెక్షన్‌కు వెళ్లి మనోరమ శాలరీ షీట్ చూసి నిర్ఘాంతపోయాడు. ఆమెకొచ్చే జీతంలో సగానికి పైగా 'డిడక్షన్స్' వున్నాయి. ఆఫీసు వాళ్లిచ్చే అడ్వాన్సులన్నీ పుచ్చుకుంది. క్రెడిట్ సొసైటీ అప్పు ఒకటే మూడువందలదాకావుంది. తొమ్మిదివందల యాభైరూపాయలున్న ఆమె జీతంలో నికరం ఆమెకు వచ్చేది నాలుగువందల చిల్లర.

మనోరమను తను డబ్బుకోసం చేసుకోలేదు. కాని ఈస్థితిలో ఆమె వుద్యోగం ఎందుకు చేస్తున్నట్టు? పోనీ, ఈ నాలుగేళ్ల వుద్యోగంలో ఆమె ఏమైనా నగలు చేయించుకుందా, చీరలు కొనుక్కుందా అంటే అదీలేదు. ఇన్ని అప్పులు ఎందుకు చేసింది? ఎవరి కోసం చేసింది?—ఇవిగాక ఇంకా చేబదుళ్లా!

సాయంత్రం బాలూ ఆఫీసుమెట్లు దిగి వచ్చేసరికి మనోరమ స్కూటర్ దగ్గర నిలబడివుంది.

'ఈ రోజేమిటి ప్రోగ్రాం?'' అంది.

''నాదగ్గరైతే డబ్బులేదు. జీతమంతా బ్యాంకులో క్రెడిట్ అవుతుంది. నీ దగ్గిరే ఏమైనా వుండాలి'' అన్నాడు బాలూ.

''పద.''

''ఎంతొచ్చిందేమిటి?''

''ఇప్పటికే నువ్వు తెలుసుకుని వుండాలే!'' అంది మనోరమ.

''ఊఁ. ఇన్నాళ్లూ నువ్వు చెబుతావని ఆగాను. కాని ఈ రోజే చూశాను అడ్వాన్సులూ, క్రెడిట్ సొసైటీ అప్పులూగాక యింకా యితర్ల దగ్గర కూడా వడ్డీకి అప్పులు చేయాల్సినంత అవసరాలేమున్నాయి ?''

మనోరమ మాట్లాడలేదు. బాలూ స్కూటరు స్టార్టు చేశాడు. అతడి షర్టుమీద ఒక వేడి కన్నీటిచుక్క పడింది.

''ఛీ. ఛీ, అదేమిటి. వూరికే అడిగాను'' అన్నాడు ఆఫీసు కాంపౌండులో ఆమె ఏడవటం భరించలేక.

''నన్ను మరికొన్నాళ్లు జీతాన్ని గురించి అడక్కు'' అంది మనోరమ

''సరే. సరే నా వుద్దేశం లెక్కలడగటంకాదు'' అన్నాడు.

కాని అతడికి ఆ క్షణాన మనోరమ మీద కలిగిన జాలి, సానుభూతి ఎంతోసేపు నిలవలేదు. మనోరమ అప్పులను గురించిన సమాచారం యితర్ల ద్వారా తెలియటం అతడికి అవమానంగా తోచింది

## పింగ్ పాంగ్ డిప్లమసీ

మెకెంజీ బొంబాయి ఆఫీసు నుండి ఒక వున్నతాధికారి హైదరాబాదు సందర్శిస్తున్నాడు ఇది అదనుగా తీసుకుని ఆ సంవత్సరం వాళ్ల కంపెనీ స్పోర్ట్సు టూర్నమెంట్స్ ఈ అధికారి ప్రారంభిస్తే బాగుంటుందని బాలూ మెకెంజీ వుద్యోగుల సాంస్కృతిక సంఘానికి సూచించాడు. అలాగ నిర్వాహకుల అనుమతి తీసుకుని టూర్నమెంట్ కమిటీతరఫున అతడితో వుత్తరప్రత్యుత్తరాలు జరిపి ముందే అతడి అంగీకారాన్ని తీసుకున్నాడు. ఆ తర్వాత టూర్నమెంట్స్ ప్రారంభోత్సవ విశేషాలు వాళ్ల హౌజ్ మాగజైన్‌లో ప్రముఖంగా ప్రచురించబడటమూ, ఫోటోలలో ఆ వున్నతాధికారి పక్కన బాలూ ఫోటో పడటమూ చాలా మందికి కన్నెర్ర కలిగించింది. ఆ వున్నతాధికారి హైదరాబాదు వుద్యోగుల తరఫున లభించిన హార్దిక స్వాగతానికి కృతజ్ఞతలు చెప్పకుంటూ, ఎంతసేపూ లెక్కలతో, రిపోర్టులతో, ఆఫీసు వ్యవహారాలతో సతమతమయ్యే వుద్యోగుల్లో సాంస్కృతిక పరమైన అభిరుచి కలగచెయ్యటానికీ, వారి వ్యక్తిత్వాన్ని బహుముఖంగా వికసింపచెయ్యటానికీ కంపెనీ యాజమాన్యం సదా ప్రయత్నిస్తుంటుందనీ, ఈ విషయాల్లో బాలూ వంటి యువకులు ప్రదర్శిస్తున్న శ్రద్ధనూ, వుత్సాహాన్నీ అతడు ప్రశంసించాడు. ఈ సమయంలోనే బాలూ వీలుచూసుకుని, తను యింకా ఎక్కువ బాధ్యతాయుతమైన స్థానాలలో పనిచేసి కంపెనీకి మరింత సేవ చెయ్యాలన్న కోరికను అధికారికి విన్నవించుకున్నాడు. అధికారి, అవకాశాన్నిబట్టి బాలూ వంటి వుత్సాహవంతులూ, సమర్థులూ ఐనటువంటి యువకుల 'టాలెంట్' ను మరింత బాగా వుపయోగించుకునే అవకాశం కల్పిస్తామనీ, అప్పటిదాకా హైదరాబాదు ఆఫీసులోనే కంపెనీ అభివృద్ధికి మరింత కృషి చేయవలసినదనీ వుద్బోధించాడు. బాలూ సవినయంగా, కంపెనీకి ఈ దేశంలోవున్న వివిధ ఆఫీసు సిబ్బందిమధ్యా ఇంటర్ జోనల్ టూర్నమెంట్సు నిర్వహించటంద్వారా వివిధ ప్రాంతాల వుద్యోగుల మధ్య సదవగాహన పెంపొందించవచ్చుననీ సూచించాడు

ఆ సంవత్సరం వుద్యోగుల సాంస్కృతిక కార్యక్రమాల్లో వుద్యోగులకన్నా అధికారులే ఎక్కువశ్రద్ధ తీసుకున్నందుకు మెకెంజీ కార్మిక సంఘం కోపం తెచ్చుకుని యిందుకు బాధ్యులైన వుద్యోగుల్ని మరుసటి సంవత్సరం నుండీ సాంస్కృతిక సంఘంలో ముఖ్య స్థానాలలో వుండనివ్వకుండా చూడాలని తీర్మానించింది.

ఇంకా వుంది



కీ. శే. మారేమండ రామారావుగారు

# తిమ్మరసుమంత్రి - ఒక విశేషము

[కీ. శే. మారేమండ రామారావుగారి వ్యాసాన్ని తిరుపతి నుంచి శ్రీ ఆనంద్‌గారు పంపారు. సం]

ఆపస్తంబ సూత్రుడూ, కౌండిన్యసగోత్రుడూ, యజుశ్శాఖీయుడూ వేమరసుపౌత్రుడూ, రాజరాజు పుత్రుడూ అయిన సాళువతిమ్మరసు చరిత్ర ప్రసిద్ధుడు ఇతఁడు తుళువవీరనరసింహునివద్ద ప్రధానిగా ఉండి, ఆ రాజు మరణానంతరం సామ్రాజ్య క్షేమాన్ని పురస్కరించుకొని బాలుడైన ఆ రాజు పుత్రుని కాదని అప్పటికే యుక్తవయస్కుడు, మహామేధావీ అయిన శ్రీకృష్ణదేవరాయలను యుక్తితో మృత్యుముఖంనించి తప్పించి, విజయనగర సామ్రాజ్యానికి పట్టాభిషిక్తుడిని చేశాడు. అనంతరం రాయలకు శిరః ప్రధానీ, దండనాథుడూ అయినాడు. రాయల పూర్వ దిగ్విజయం జయప్రదం కావడానికీ, అందులోనూ కొండవీడు దుర్గమును వశపరచుకొనడానికీ తిమ్మరసు శక్తీ, కటకం ఆక్రమించడంలో తిమ్మరసు యుక్తీ, ముఖ్య కారణములు అయినాయి. రాయలూ, తిమ్మరసూ ఇంత అన్యోన్యంగానూ, సన్నిహితులుగానూ ఉండినప్పటికీ తుదకి తిమ్మరసు రాయల ఆగ్రహానికి పాత్రుడై, తన కండ్లను కోల్పోయి, చెరసాలలో మగ్గి మహాకష్టములను అనుభవించెనని ఒక అభిప్రాయం లోకంలో ప్రబలంగా ఉన్నది. ఈ అభిప్రాయాన్ని సహేతుకంగా విమర్శించడం ఈ వ్యాసంయొక్క ఉద్దేశం.

పై అభిప్రాయానికి మూలం న్యూనిజ్ అనే పోర్చుగీసు వర్తకుని కథనం. ఈ న్యూనిజ్ రాయలకాలంలో విజయనగరంలో ఉండి తను చూచిన, విని వృత్తాంతములను ఒక కథనంగా వ్రాశాడు. ఈకథనంలో ప్రస్తుతంపనికివచ్చేవి ఈక్రిందిఅంశములు.[1]

(1) రాయలు రాయచూరు యుద్ధం అయిన తరవాత తనకు వయసు మీరినదని తెలుసుకున్నాడు. (2) అతనికి ఆరు సంవత్సరముల పుత్రుడు ఉండినాడు. (3) రాయలు తన పుత్రుడు తన తరవాత రాజయి పరిపాలన సాగించవలెననే కాంక్షతో తను రాజ్యత్యాగంచేసి, పుత్రునికి పట్టాభిషేకం చేసి, తను అతనికి మంత్రిఅయి, అంతవరకూ తనకు మహాప్రధానిగా ఉండిన తిమ్మరసును తనకు సలహాదారును చేసుకున్నాడు (4) పట్టాభిషేకోత్సవములు ఎనిమిది నెలలు సాగినవి (5) పిమ్మట రాయల కుమారుడు వ్యాధిగ్రస్తుడై మరణించాడు. (6) కొంత కాలానికి తన కుమారుడు తిమ్మరసు మంత్రి కుమారుడు విష ప్రయోగం చెయ్యడంవల మరణించాడని రాయలకు తెలిసింది. (7) అంతట రాయలు తిమ్మరసును, పుత్రుని, తమ్ముడైన గు అందజు (గోవిందరాజు)ను నిండు సభలో నిందించి, తిమ్మరసును అతని ఇద్దరు పుత్రులను మూడు సంవత్సరములకాలం చెరసాలలో ఉంచాడు. (8) తర్వాదన్నాయకుడు (దండనాయకుడైన) తిమ్మరసు కుమారుడు చెరనించి తప్పించుకొని, ఒక ప్రబలమైన దుర్గం చేరి, అక్కడనించి రాయలపై తిరుగుబాటు చేశాడు. రాయలు సైన్యమునుపంపి ఈ తిరుగుబాటుదారును బంధింపచేసి తన ముందుకు తెప్పించాడు. (9) ఆ మీద ఇతనితోపాటు తిమ్మరసును, తిమ్మరసుతోపాటు చెరలో ఉండిన అతన మరి ఒక పుత్రుని సముఖమునకు పిలిపించి రాయలు వీరందరి కండ్లూ ఊడతీయించాడు తిరిగీ వారందరినీ చెరలో బంధించారు (10) తిమ్మదన్నాయకుడు చెరలో మరణించాడు. తిమ్మరసున్నూ అతని మరి ఒక పుత్రుడైన గండజు (గండరాజు)న్నూ చెరలోనే ఉండిపోయారు

న్యూనిజ్ చెప్పిన ఈ కథ మరి ఏ ఇతరాధారములలోనూ కనిపించదు. ఈ కథనిబట్టి తిమ్మరసు మంత్రికి తిమ్మదన్నాయకుడు ఒకడూ, గండరాజు ఒకడూ మొత్తం ఇద్దరు కుమారులు ఉన్నట్లు తెలియ వస్తుంది ఈ విషయం మరి ఏ ఇతరాధారంలోనూ చెప్పబడలేదు. ఇవిగాక న్యూనిజ్ కథనంలో కొన్ని పరస్పర విరుద్ధమైన అంశం ఒకటి ఉన్నది. తిమ్మరసును రాయలు నిందించినప్పుడు అతని కుమారుడు ఒకడే ఉన్నట్లున్నూ, మూడు సంవత్సరములు చెరలో ఉండినది అతనితోపాటు అతని పుత్రులు ఇద్దరనిన్నీ చెప్పబడినది. ఇందేది నిజమో తెలియదు. ఈ కథ విశ్వసనీయంగా కనపడదు.

న్యూనిజ్ కథనం రాయల కుమారుని పట్టాభిషేకం వరకూ విశ్వసనీయంగా కనపడుతుంది. క్రీ. శ. 1517నాటి ఒక శాసనంలో రాయలకు సంతానప్రాప్తికావలెనని కొండమరసు మంత్రి కాంక్షించినట్లు ఉన్నది.[2] అప్పటికే రాయలకు వివాహితలైనఇద్దరుకుమార్తెలుండుట వలన, ఆకాంక్ష పుత్ర సంతానానికి సంబంధించినదని ఊహించవచ్చును. క్రీ. శ. 1518వ సంవత్సరం అక్టోబరు 20వ తేదీనాటి ఒక శాసనం[3] రాయల దేవేరి అయిన తిరుమలదేవి తిరుమల రాయల కొరకు ఒక దానం చేసినట్లు తెలుపుతుంది. మరి కొన్ని శాసనములలో[4] ఈ తిరుమల దేవరాయలు కృష్ణరాయలకున్నూ, తిరుమలదేవికిన్నీ కుమారుడు అని చెప్పబడి ఉన్నది. వీటినిబట్టి రాయలకు క్రీ.శ.1518లో తిరుమలరాయడనే పుత్రుడు జన్మించినట్లు తెలుస్తుంది. ఈ తిరుమల రాయలు క్రీ. శ. 1524లో వైశాఖ మాసంనించి మార్గశిర మాసం వరకూ రాజ్యం చేసినట్లున్నూ శాసన ప్రమాణం ఉన్నది.[5] రాయలు తిరుమల

రాయలకు పుణ్యంగా తిరుమల శ్రీ వేంకటేశ్వరునికి (క్రీ శ. 1518, అక్టోబరు 10వ తేదీనాడు)[6] భూదానం చేశాడు.

రాయలు తిమ్మరసు కండ్లు పొడిపించిన వైనం మరి ఏ ఇతరాధారంలోనూ కనిపించదు. పూజ్యులు, విజయనగర సామ్రాజ్య చరిత్ర విషయమై పరమ ప్రామాణికులు అయిన డా॥ నేలటూరి వేంకట రమణయ్యగారు ఈ విషయాన్ని విపులంగా చర్చించారు. ఆ సందర్భంలో ఆయన "కాని శా. శ. ౧౪౪౬ తారణ తరువాత సాళువతిమ్మరసయ్య ప్రస్తావము శాసనములందెచ్చటను గన్పట్టదు. ఇతని పక్షమున కొండవీటి సామ్రాజ్యమును పాలించుచుండిన ఇతని యల్లుడగు నాదిండ్ల గోప మంత్రి శా. శ. ౧౪౪౭ ఫాల్గుణ శుద్ధ ౧౫ నాడు కొండవీటిలో పరివార పట్టాభిరామ విగ్రహమును ప్రతిష్ఠించెను ఇది గోప మంత్రి కడపటి శాసనము. మరియు సాళువ తిమ్మరసు శాసనములు స్వభాను, సర్వధారి సంవత్సరముల మధ్య కానరావు. కావున సాళువ తిమ్మరసు మంత్రి యధికారము శా. శ. ౧౪౪౭ కు సరియైన క్రీ. శ. ౧౫౨౫ తో ముగిసెనని నిశ్చయింపవచ్చును. ... న్యూనిజు కథ కిది యనుకూలముగనే యున్నది అని వ్రాశారు [7]. అంతేకాక "ఇట్లు న్యూనిజు వర్ణించిన యంశముల నెల్లను శాసనాద్యన్య సాధనముల మూలమున నిరూపించుటకు వీలుగాక పోయినను నతడు చెప్పు వృత్తాంతము మొత్తముమీద సత్యాత్మకమనియే యెన్నదగి యున్నది" అని అభిప్రాయ పడ్డారు. [8] కాని కొన్ని శాసనముల నుంచి తెలియవచ్చే అంశాలు ఈ అభిప్రాయం సరియైనది కాదేమోననే ఊహను కలిగిస్తున్నాయి.

రాయలు తన కుమారుడికి పట్టాభిషేకం చెయ్యడం, ఆ కుమారుడు మరణించడం క్రీ శ. 1524 లో జరిగినవి కదా! ఆ మీద మూడు సంవత్సరములు తిమ్మరసు చెరలో ఉన్నాడు అని న్యూనిజ్ చెప్పాడు. అప్పుడు క్రీ. శ. 1524 నించి తిమ్మరసు క్రీ. శ. 1527–28 వరకూ చెరలో ఉన్నట్టు ఏర్పడుతుంది. అతని కండ్లుతీయబడుట ఆ మీదనే జరగవలెను. తిరుపతి తిరుమల శాసనములలో కొన్నిటి యందు తిమ్మరసు ప్రశంస కలదు.

ఇతడు క్రీ. శ. 1536 ఫిబ్రవరి 26తేదీనాడు తాళ్ళపాకం తిరుమలయ్యంగారి వద్ద నించి 4, 600 పణములు తీసికొని అందుకు బదులుగా తన తమ్ముడు గోవిందరాజుకు రావలసిన ప్రసాదంలో 1/4 వంతును ఆయనకి ఇచ్చివేశాడు [9] అలాగే క్రీ. శ. 1536 డిశంబరు 28 తేదీనాడు తిమ్మరసుపై తిరుమలయ్యంగారివద్ద నించి 1, 900 పణములు తీసుకొని తన పేర శ్రీ వేంకటేశ్వరుడికి అర్పించే ప్రసాదంలో తనకు రావలసిన 1/4 వంతును ఆయనకి ఇచ్చాడు[10] అదే విధంగా తిమ్మరసునూ, అతని తమ్ముడు గోవిందరాజునూ 5, 203 పణములు తీసుకొని పై తిరుమలయ్యంగారికి తిరుపతిలోని గోవిందరాజస్వామి ప్రసాదంలో తమకు రావలసిన 1/4 వంతును అమ్మివేశారు.[11] ఈ మూడు శాసనములున్నూ కృష్ణరాయల తరవాత రాజ్యానికి వచ్చిన అతని సవతి తమ్ముడు అచ్యుతదేవరాయలనాటివి దీనినిబట్టి తిమ్మరసు క్రీ. శ. 1536 వరకూ సజీవి అయి, దాన ధర్మములను చేస్తూ ఉన్నట్లు స్పష్టం అవుతుంది. క్రీ.శ. 1528లో అవమానితుడై, కండ్లను గోల్పోయి ఉండినచో అతడు అనామకుడుగా ఎక్కడనో కాలం వెళ్ళపుచ్చుకుంటూ ఉండాలి కదా! ఇతని తమ్ముడు గోవింద రాజు క్రీ. శ. 1541వరకూ కూడా శాసనములలో ప్రశంసింపబడినాడు.[12] అందుచేత తిమ్మరసు కళ్ళుతీయించడం గురించి న్యూనిజ్ చెప్పినది విశ్వసనీయంగా కనపడదు.

ఇంతేకాక మరి ఒక విశేషమున్నూ తెలియవస్తుంది డా॥ వేంకట్ట రమణయ్యగారు శ 1446 లేక క్రీ. శ. 1524కు తరువాత తిమ్మరసు ప్రశంస కనిపించదు అని వ్రాశారు. దీనికి కారణం అతడు చెరసాలలో ఉండడమే కారణం కానవసరం లేదు. రాయలు తన రాజత్వాన్ని త్యజించి, తన పుత్రుడికి పట్టంకట్టి, తను అతనికి మంత్రి అయినాడు అప్పటికి శిరఃప్రధానిగా ఉండిన తిమ్మరసును తనకు సలహాదారుగా చేసుకున్నాడు దీన్నిబట్టి తిమ్మరసు క్రీ. శ 1524లోనే పదచ్యుతుడై సామాన్య పౌరుడుగా మారిపోయాడు. పైనపేర్కొనబడిన అచ్యుతరాయలనాటి తిరుపతి తిరుమల శాసనములలో ఎక్కడా ఇతడు ప్రధాని అని చెప్పకోక ఉత్త సాళువ తిమ్మరసనే చెప్పకున్నాడు కాని క్రీ. శ. 1524 కు పూర్వము తిమ్మరసు అక్కడే వేయించిన శాసనములలో ప్రధానిని అని చెప్పకున్నాడు.[13] దీనిని బట్టిన్నీ క్రీ. శ. 1524 – 1536 మధ్య అతడు సామాన్యుడుగానే ఉన్నట్టు తెలుస్తుంది. అంతేకాక రాయలు క్రీ. శ. 1524 లో తనకుమారుడు మరణించిన పిమ్మట తిరిగీ రాజత్వాన్ని చేపట్టి మరి ఐదేళ్లు పరిపాలన సాగించాడు కదా! అప్పుడయినా అతడు తిమ్మరసును తిరిగీ ప్రధానిని ఎందుకు చెయ్యలేదు అనే ప్రశ్న వస్తుంది. దీనికి రాయలు స్వార్థపరుడై తన పుత్రుడిని పట్టాభిషిక్తుడినిచేయదలిస్తే సామ్రాజ్యక్షేమం పురస్కరించుకొని తిమ్మరసు రాయల ఆ కోరికని ప్రతిఘటించాడనీ,అందువల్ల వారిద్దరికీ తీవ్రమైన అభిప్రాయ భేదం వచ్చిందనీ, తిమ్మరసు తన అన్న వీరనరసింహుడి కుమారుడిని తోసిపుచ్చి తనని సింహాసనం ఎక్కించినట్టే తన మరణానంతరం తన కుమారుడిని కూడా తోసిపుచ్చి, తన సవతితమ్ముడైన అచ్యుతరాయలకు పట్టం కడతాడేమోనని భయంవేసి తిమ్మరసును పదభ్రష్టుడిని చేశాడనీ సమాధానం చెప్పవచ్చును.

పైన ఉదహరింపబడిన తిరుపతి తిరుమల శాసనములను బట్టి రాయలు తిమ్మరసు కండ్లను పొడిపించుట అబద్ధమనీ, క్రీ. శ 1525 లోనే మంత్రి పదవిని వదలుకొన్న తిమ్మరసు క్రీ. శ. 1536 వరకూ ఒక సామాన్య పౌరుడుగా జీవించిఉన్నాడనీ చెప్పవచ్చును. ఈ సూచనను విజ్ఞులు పరిశోధించగలరని ఆకాంక్షిస్తున్నాను.

హిందీమూలం : స్వర్గీయ ప్రేమ్‌చంద్ అనువాదం : గాదంశెట్టి

# పుష్యమాసపు రాత్రి

"షావుకారు సహనా వచ్చాడు. గూట్లో పెట్టిన ఆ డబ్బులు ఇలా పట్టుకరా, అతని కిచ్చేద్దాం. ఏదోవిధంగా అతనిబాధ తప్పిపోతుంది" అన్నాడు హల్కూ పెళ్ళాంతో.

మున్నీ ఇల్లు ఊడుస్తూ చటుక్కున వెనక్కు తిరిగి "మూడురూపాయలే గదా! అవి కాస్తా ఇచ్చేస్తే కంబళి ఎక్కణ్ణుంచి వస్తుంది? పుష్యమాసం రాత్రులు ఎలా గడుస్తాయి? 'ఇప్పుడులేవు, కోతలప్పుడు ఇచ్చేస్తామని' అతనితో చెప్పేసెయ్" అంది.

హల్కూ ఒక్కక్షణం అసమంజసంగా నిలబడిపోయాడు. పుష్యమాసం దగ్గరపడింది. కంబళి లేకుండా పొలంలో రాత్రిళ్లు కాపలా కాయడం సాధ్యంకాదు కాని సహనా ఒప్పుకోడు. చీవాట్లు పెడతాడు. తిడతాడు. చలికి చచ్చిపోయినాసరేగాని ఇప్పుడు ఈ బాధ తప్పిపోతే అంతేచాలు—అని ఆలోచిస్తూ తన స్థూల కాయాన్ని కదిలించుకుంటూ పెళ్ళాంవద్దకువచ్చి "పట్టుకరా మున్నీ...ఇచ్చేసెయ్, ఆ బాధ తప్పిపోతే అంతేచాలు కంబళికోసరం మరో ఉపాయం ఆలోచిస్తాను" అన్నాడు.

మున్నీ దూరంగా వెళ్లిపోయి గుడ్లురుముతూ "ఆఁ.. ఆలోచిస్తావ్ ఉపాయం! ఏదీ చెప్పు విందాం ఉపాయం! ఎవరన్నా ధర్మంగా ఇస్తారా కంబళి? ఎంత అప్పు వుందో ఏమో! ఎప్పటికీ తీరదు అసలు నువ్వు వ్యవసాయం ఎందుకు మానెయ్యవూ అంట? చచ్చి చెడీ పని చేస్తున్నాం. పండింది కాస్తా అప్పు తీర్చేయడంతో సరిపోతుంది. మళ్లీ చేతులు ఖాళీ! బాకీలు తీర్చడానికే మనం పుట్టినట్లున్నాం. పొట్టకూటికోసరం కూలి చేసుకుందాం. అంతేగాని ఈ వ్యవసాయం వద్దూ పాడూవద్దు. ఆ రూపాయలు నేను ఇవ్వను. ఇవ్వనంటే ఇవ్వను" అంది.

హల్కూ నిరాశచెంది "అయితే తిట్లు తినమంటావా?" అడిగాడు.

"ఎందుకు తిడతాడూ' అతడిదే రాజ్యమా?"

ఈ మాటలు అంటూనే ఆమె ఉక్రోషం తగ్గిపోయింది. హల్కూ మాటల్లోని కరోరమైన వాస్తవం ఒక భయంకర జంతువులాగ ఆమెను ఉరిమి చూస్తున్నట్లున్నది.

వెంటనే వెళ్లి గూట్లో పెట్టిన రూపాయలు తెచ్చి హల్కూ చేతిలో పెట్టి "ఇక నువ్వు వ్యవసాయం మానెయ్యి. ఎక్కడన్నా కూలి చేసుకొన్నా ఒకపూట సుఖంగా తినొచ్చు. మరొకడి బాధ వుండదు భలే వ్యవసాయం! కూ:చేః తెచ్చింది కూడా అందులో ధారపోసినా పైగా చీవాట్లు తప్పడంలేదు" అంది.

హల్కూ రూపాయలు తీసుకొని బయటికి నడుస్తూవుండగా తన హృదయాన్నే తీసి ఇవ్వబోతున్నట్లనిపించింది. అతడు కూలి పనిచేసి ఒక్కొక్క పైసా మిగిల్చి కంబళి కొనడానికని మూడు రూపాయలు కూడబెట్టాడు అవి కాస్తా ఇవాళ ఎగిరిపోతున్నాయి. ఒక్కొక్క అడుగు వేస్తుంటే తన తల దీనత్వంతో దిగజారిపోతూవుంది.

పుష్యమాసపు చీకటిరాత్రి ఆకాశంలోని నక్షత్రాలు కూడా గడగడ వణకిపోతున్నట్లున్నాయి. హల్కూ తన పొలంగట్టున చెరకు ఆకుల పందిరికింద వెదురు మంచంమీద తన ముతక దుప్పటి కప్పుకొని వొణికిపోతూ పడివున్నాడు. మంచంకింద అతని కుక్క 'జబరా' కాళ్లు పొట్టలో పెట్టుకొని చలికి 'కుంయ్ కుంయ్'మంటూ పడి వుంది.

ఇద్దరిలో ఎవరికీ నిద్రరావడంలేదు.

హల్కూ మోకాళ్లను గొంతుకు ఆనించుకుంటూ "జబరా, చలేస్తుందా!" ఇంట్లో ఎండు గడ్డిలో పడుకోమంటే విన్నావా? ఇక్కడ ఏం చెయ్యడానికొచ్చావ్? ఇక చావు చలికి! నేనేం చేసేది? నే నిక్కడ హల్వా, పూరీ తినడాని కొచ్చాననుకున్నావా? పరుగెత్తుకుంటూ ఫెంటపడి వచ్చావ్! ఇక నీ తాతల్ను తల్చుకుంటూ ఏడువ్!" అన్నాడు

'జబరా' పడుకునే ఒక్కసారి తోక ఆడించి 'క౧యిఁ కుంయ్' మంటూ ఒక్కసారి ఆవలించి నోరు మూసుకుంది. బహుశాః తన మూలుగువలన యజమానికి నిద్రరావటంలేదని తన స్వబుద్ధితో తెలుసుకొన్నట్లుంది.

హల్కూ చేయి చాపి 'జబరా'ను నిమురుతూ "రేపట్నుండి నావెంట రావద్దు. లేకపోతే చలికి చల్లబడిపోతావ్" అని మందలించాడు

మరోక్షణం గడిచాక లేచి — ఒక్క దమ్ము లాగుదాం, ఎలాగో రాత్రి గడవాలిగదా! ఇప్పటికి ఎనిమిది మార్లు గంజాయి తాగాను. ఇదీ పొలంలో వుండే మజా! ఒక్కొక్క భాగ్యవంతుడు వున్నాడంటే, వాళ్లవద్దకు చలి వెళ్లిందంటే అక్కడి వేడికి తట్టుకోలేక పరుగు పెట్టాల్సిందే! పెద్ద పెద్ద పరుపులు, దిండ్లు, కంబళ్లు వుంటాయి అక్కడకు వెళ్లేసాహసం చలికి ఎక్కడుందీ? ఇదంతా విధి వ్రాత. చాకిరి మనది, సుఖం వాళ్లది—అనుకున్నాడు.

మరో క్షణం అటూ యిటూ చూసి గుంటలో నుంచి కొంచెం నిప్పు తీసి గంజాయి గొట్టం వెలిగించాడు. 'జబరా' కూడా లేచి కూర్చొంది

హల్కూ గంజాయి తాగుతూ ''నువ్వూ తాగుతావా? చలి పోవడమేగాదు, మనస్సుకు కొంచెం ఉల్లాసం కూడా కలుగుతుంది'' అన్నాడు.

''జబరా'' అతడి ముఖంవేపు ప్రేమగా చూసింది

''ఇవాళ ఎలాగో చలికి తట్టుకో, రేపు ఇక్కడ ఎండుగడ్డి పరిచేస్తాను. అందులోదూరి పడుకొన్నావంటే, చలే వుండదు.''

''జబరా'' తన ముందటి కాళ్లు అతడి వొళ్లో పెట్టి అతడి మూతివద్ద తన మూతి ఆనించింది. దాని శ్వాస అతడికి వేడిగా తగిలింది.

హల్కూ మళ్లీ గంజాయి తాగి పడుకున్నాడు. ఏమన్నా కానివ్వు, ఇక నిద్ర పోవలసిందే ననుకున్నాడు. కాని ఒక్క క్షణం దాటగానే గుండెల్లో చలి పుట్టుకొచ్చింది. అటూ ఇటూ పొర్లాడాడు. అయినా చలి పిశాచం మాదిరి అతడి గుండెలు అణచి వేస్తోంది.

ఎలాగూ వుండలేకపోయాడు. ''జబరా''ను నెమ్మదిగా ఎత్తి తన వొళ్లో కూచోబెట్టుకుని చిచ్చికొట్టి నిద్ర బుచ్చాడు. కుక్క వొళ్లు దుర్వాసన కొడుతుంది. అయినా దాన్ని తన వొంటికి, హృదయానికీ హత్తుకొని ఏదోసుఖాన్ని అనుభవిస్తున్నాడు. అలాంటి సుఖం ఎన్నో నెల్ల నుండి అతడికి కలగలేదు. స్వర్గమంటే యిదే నేమో ననుకుంటుంది జబరా! హల్కూ పవిత్ర ఆత్మలో ఆ కుక్క ఎడల అసహ్యం ఆవగింజంత కూడా లేదు. ఇలాంటి అసాధారణ స్నేహం అతడి ఆత్మద్వారాలన్నిటినీ తెరచి వేసింది. దాని ఒక్కో గుణం వెలుగులో ప్రకాశిస్తుంది.

ఉన్నట్లుండి ''జబరాకు'' ఏదో జంతువు చప్పుడు వినపడింది. ఈ విశేషమైన ఆత్మీయత దానిలో ఒక నూతన స్ఫూర్తిని కలిగించింది. దాంతో చలి గాలులను కూడా లెక్కచేయలేదు. చప్పున లేచి పందిరి బయటికివచ్చి మొరగడం మొదలెట్టింది హల్కూ దాన్ని అనేకమార్లు బుజ్జగింపుగా పిల్చాడు. కాని అది అతడి దగ్గరకు రాలేదు. పొలం నలువేపులా గంతులువేస్తూ మొరుగుతూ వుంది ఒక్కక్షణం దగ్గరకు వచ్చినా మళ్ళీ పరుగెత్తి పోయేది. కర్తవ్యమనేది దాని హృదయంలో తీరని కోర్కెగా గంతులు వేస్తోంది

ఇంకో గంట గడిచింది. రాత్రి శీతలవాయువుతో ధగ ధగ లాడుతుంది. హల్కూ లేచి కూచొన్నాడు. మోకాళ్ళు గుండెలకు ఆనించుకొని అందులో తల దూర్చాడు అయినా చలి తగ్గలేదు. రక్తమంతా గడ్డకట్టినట్లు అనిపిస్తోంది. నాళాల్లో రక్తానికి బదులుగా మంచు ప్రవహిస్తున్నట్లుంది. ఇంకా ఎంత పొద్దు వుందోనని ఆకాశంవేపు తొంగిచూచాడు. సప్తరుషులు ఇంకా ఆకాశ మధ్య భాగంలోకి కూడా ఎక్కలేదు. పైదాకా ఎక్కితేగాని తెల్లవారదు. ఇంకో జాము పొద్దు వుంది

హల్కూ యొక్క పొలం నుంచి ఒక గోలీకాయ విసురంత దూరంలో ఓ తోట వుంది. ఆకురాలడం మొదలైంది తోటలో రాలిన ఆకంతా రాసులైంది వాటన్నిటిని ఎదరకొచ్చి తగులబెట్టి చలి కాచుకుందామనుకున్నాడు. రాత్రిళ్లు ఆకులు పోగుచేయడం ఎవరైనా చూస్తే దయ్యమనుకుంటారు. అందులో ఏవైనా జంతువులు దాగివున్నా వుండొచ్చు. అయినా యిక కూర్చోజాలక పోయాడు..

దగ్గరలోవున్న కందిచేలోకివెళ్లి కందిపుల్లలు విరిచి వాటితో చీపురు తయారుచేసి మండుచున్న పిడక చేతోపట్టుకొని తోటవేపు వెళ్లాడు. కుక్క అతణ్ణిచూసి దగ్గరకు వచ్చి తోక ఆడించసాగింది

''జబరూ, ఇక తట్టుకోలేను. తోటలో ఆకులు ఎదరకొచ్చి మంటవేసి చలి కాపుకుందాం పద. చలి తీరిపోతే పోయిపడుకుందాం. ఇంకా చాల పొద్దు వుంది''

''జబరూ''కుంయ్ కుంయ్ మంటూ తన సమ్మతి తెలియచేసి తోటవేపు నడిచింది.

తోటలో బాగా చీకటి కమ్ముకొని వుంది ఆ చీకట్లో గాలి నిర్దయగా ఆకులను అణగ తొక్కుతూ వీస్తుంది చెట్లనుంచి మంచు బిందువులు టపటపా రాల్తున్నాయి.

ఉన్నట్లుండి గోరింటిపూల సువాసనలతో ఓగాలి కొట్టింది.

''ఎంతమంచి వాసన వచ్చిందో చూడు ''జబరూ''! నీ ముక్కులకు కూడా వాసన తగులుతుందా?''

కుక్కకు నేలమీద ఎక్కడిదో ఎముకదొరికితే దాన్నిచీలుస్తూ వుంది.

హల్కూ నిప్పుకిందపెట్టి ఆకులు పోగుచేయమొదలెట్టాడు కాద్దిసేపట్లో ఆకులన్నీ కుప్ప చేశాడు. చేతులు కొంగర్లు పట్టుక పోతున్నాయి. ఒట్టి కాళ్లు ఆడుతున్నాయి. అవి ఆకులను కువ్వ చేస్తున్నాయి. ఈ చలిమంటలో చలిని తగులబెట్టి భస్మం చేయాలను కుంటున్నాడు హల్కూ

కొద్దిసేపట్లో చలిమంట భగ్గుమంది. దాని జ్వాలలు పైనున్న చెట్ల ఆకులను తాకుతూ పైకెగిరిపోతున్నాయి. ఆ అస్పష్టమైన వెలుతురులో తోటలోని విశాలమైన వృక్షాలన్నీ ఆ దట్టమైన అంధకారాన్ని తమ తలలపై ఎత్తుకొని మోస్తున్నాయా అన్నట్లున్నాయి.

అంధకారమయమైన అనంతసాగరంలో ఈ వెలుతురు ఒక ఓడలాగా కదులుచున్నట్లనిపిస్తుంది.

హల్కూ మంటవద్ద కూచొని చలి కాపుకుంటున్నాడు. ఒక్క క్షణంలో దుప్పటివిప్పి చంకలో పెట్టుకొని రెండు కాళ్ళూ

చాచాడు. 'నీ చేతనైంది చేసుకో' అని చలిని సవాల్ చేస్తున్నట్లున్నాడు చలిపైన విజయం పొందిన అతడు ఆ విజయ గర్వాన్ని హృదయంలో అణచుకోలేకపోయాడు.

"జబరా, ఇంకా చలి వేస్తుందా ?" అన్న హల్కూ ప్రశ్నకు జబరా 'కుంయ్ కుంయ్'మంటూ "ఇంకేం చలివేస్తుంది" అన్నట్లుగా జవాబు చెప్పింది.

"మొదటనే ఈ ఉపాయం తట్టివుంటే చలికి ఇంత బాధ పడేవాళ్లం కాము."

కుక్క తోక ఆడించింది.

"సరే. ఇలారా, ఈ చలిమంట పైనుండి దూకిపోవాలి చూద్దాం! ఎవరు ముందుదూకుతారో ఒకవేళ నీ వొళ్లుకాలిందా, నేను మందూ మాకూ ఇప్పించను."

జబరా ఆ నిప్పుల కుప్పను కుతూహలంగా చూసింది. మళ్లీ హల్కూ అందుకొని "రేపు ఇంటివద్ద మున్నీతో ఈ విషయాలన్నీ చెప్పవద్దు చెప్పావో, తగవులాడుతుంది" అంటూ ఎగిరి చలిమంట దాటుకొని ఆవలివేపు దూకాడు. కాళ్లకు కొద్దిగా మంటతగిలింది అదేమీ లెఖ్ఖలోది కాదు. కుక్క చలిమంటకు అటూ ఇటూ తిరిగి అతడివద్దకు వచ్చి నిలబడింది.

పద పద, అలా కాదు. పైనుంచి దూకిరావాలి అంటూ అతడు మళ్లీ దూకి ఇవతలి వేపుకు వచ్చాడు

ఆకులన్నీ కాలిపోయాయి. తోటలోమళ్లీ చీకటి ఆవరించింది. నివురు గప్పిన నిప్పు కొద్ది కొద్దిగా వుంది. గాలి కొట్టినప్పుడల్లా రగులు కొంటున్నట్లున్నా మళ్లీ క్షణంలో చల్లారిపోతూ వుంది

హల్కూ మళ్లీ దుప్పటి కప్పుకున్నాడు. వేడి వేడి బూడిద వద్దకూచొని ఏవేవో కూనిరాగాలు తీస్తున్నాడు వొళ్లువేడెక్కింది చలిగాలి తగిలిన కొందీ సోమరితనం అణచివేస్తోంది

"జబరా" పెద్దంగా మొరిగి పొలంవేపు పరుగెత్తింది జంతువుల గుంపు ఏదో తన పొలంమీద పడ్డట్లు, హల్కూకు అనిపించింది. అవి అటూ ఇటూ తిరిగే శబ్దం స్పష్టంగా చెవుల్లో పడుతూంది. అవి పొలంలోనిపైరు పరపరా నములుతున్న శబ్దం కూడా వినవస్తోంది.

హల్కూ తనలో తాను ఇలా అనుకొన్నాడు—కాదు కాదు, "జబరా" వుండగా ఏ జంతువూ, పశువూ పొలంలోకి రాలేదు. వస్తే నులిపి పారేయదూ? బహుశాః నాకేదో మతిభ్రమ కలిగివుంటుంది. ఏదీ! ఇప్పుడు వినపడ్డంలేదే! ఇప్పుడు ఏవీ వినపడ్డంలేదు. నేనే మోసపోయాను.

పెద్దంగా కేకపెట్టాడు—జబరా, జబరా!

'జబరా' మొరుగుతూనే వున్నది కాని అతనివద్దకు రాలేదు. తరవాత పొలంలో ఏవో మేస్తున్నట్లుగా శబ్దమయింది. ఇప్పుడు అతను మోసపోవడంలేదు. కాని వున్నచోటునుండి కదలడం విషమంగా వుంది. గట్టిగా ముడుచుకొని కూచొన్నాడు. ఈ చలికీ


**Statement about ownership and other particulars about newspaper**

**BHARATI**

FORM IV (See Rule 8)

1. Place of Publication VIJAYAWADA
2. Periodicity of its Publication. MONTHLY
3. Printer's Name. Sri S Radhakrishna
   Whether citizen of India: Yes
   Address 8-2-322, Banjara Hills, Hyderabad-500 034
4. Publisher's Name. Sri S. Radhakrishna
   Whether citizen of India: Yes
   Address 8-2-322, Banjara Hills, Hyderabad-500 034
5. Editor's Name. Sri S. Radhakrishna
   Whether citizen of India: Yes
   Address: 8-2-322, Banjara Hills, Hyderabad-500 034
6. Names and addresses of individuals who own the newspaper and partners or share holders – holding more than one percent of the total capital.
   1. Name: S Kamakshamma
      Address 16, Luz Avenue, Mylapore, Madras-600 004
   2. Name. S Radhakrishna
      Address. 8-2-322, Banjara Hills, Hyderabad-500 034.
   3. Name: S. Nageswara Rao
      Address 16, Luz Avenue, Mylapore, Madras-600 004
   4. Name S. Rajeswari
      Address 8-2-322, Banjara Hills, Hyderabad-500 034.
   5. Name: S Seshamma
      Address 16, Luz Avenue, Mylapore, Madras-600 004
   6. Name S. Sreeramamurty, Trustee, Kasinadhuni Nageswara Rao, Sivalenka Sambhu Prasad Dharma Nidhi.
      Address 14/15, Luz Church Road, Mylapore, Madras-600 004
   7. Name: Dr P S. N. Murthi
      Address. P.O. Yellamanchili, Vizag Dt
   8. Name: S. Ramayamma
      Address: 16, Luz Avenue, Mylapore, Madras-600 004.
   9. Name. P Satyanarayana
      Address C/o Allied Sales, 183/184, Rashtrapathi Road, Secunderabad
   10. Name. D. Subba Rao
       Address. 8-2-322, Banjara Hills, Hyderabad-500 034.

I, S Radhakrishna, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**S RADHAKRISHNA,**
Signature of Publisher.

1—3—1978.

మంచుకూ పొలంలోకి వెళ్లడం, పశువులవెంటపడి అరవడం సహించలేననుకున్నాడు అంతే, వున్నచోటినుండి కదల్లేదు.

పెద్దగా అరిచాడు—పోఫో, వెళ్లిఫో; కుక్క మొరుగుతూనే వుంది పశువులు మేస్తూనే వున్నాయి. పంట బాగా కోతకు వచ్చి వుంది. ఎంత మంచిపంట! పాడు పశువులు సర్వనాశనంచేస్తున్నాయి.

హల్కా దృఢసంకల్పంతో లేచాడు రెండడుగులు ముందుకు వేశాడు. ఇంతలో చల్లటి గాలి విసురు తేలుకొండిలాగా గుచ్చుకపోతు న్నట్టు తగిలింది. వెంటనే మళ్లీ ఆరిపోయిన చలిమంటవద్దకు వచ్చి కూచొని బూడిదను పెళ్లగించి చల్లబడ్డ వొళ్లు కాచుకో మొద లెట్టాడు

'జబరా' తన గొంతు చించుకుంటోంది. పశువులు పొలాన్ని పాడుచేస్తున్నాయి. హల్కా వేడిబూడిదవద్ద ప్రశాంతంగాకూచొని వున్నాడు. అకర్మణ్యత్వము అతన్ని నలువేపులా తాళ్లతోకట్టివేసింది.

ఆ బూడిదవద్దనే వేడినేలమీద దుప్పటి కప్పుకొని నిద్ర పోయాడు.

తెల్లవారగానే అతడి నిద్రమత్తు వదిలింది నలువేపులా ఎండ తగులుతూవుంది. మున్నీ అంటూవుంది.

''ఏంటీ, ఇవాళంతా నిద్రపోతూనే వుంటావా? నువ్వేమో ఇక్కడకువచ్చి మజాగా నిద్రపోయావు అటు చూడు, పొలమంతా సర్వనాశనమైపోయింది.''

హల్కా లేచి కూర్చొని కళ్లు నలుపుకొంటూ ''నువ్వు పొలంవేపునుండే వస్తున్నావా?'' అన్నాడు.

''అవునవును. పొలమంతా పాడైపోవటం చూచే వచ్చాను అవ్వ! ఇలా ఎవరైనా నిద్రపోతారా? నిన్ను ఇక్కడకు కాపలాకు పంపినందుకు ఇదా ఫలితం?''

హల్కా నెపం అందుకొన్నాడు ''నేను ఛస్తూ ఛస్తూ బతికాను నీకు నీ పొలమే పట్టింది. కడుపులో ఎంత నొప్పి పుట్టిందంటే, నీకేం చెప్పను!''

ఇద్దరూ పొలం గట్టుమీద కొచ్చారు. చూచారు. పొలమంతా చెడతొక్కి పారేసివుంది 'జబరా' మంచంవద్దనే నిత్తుగా పడి వుంది. ప్రాణమే లేదా అన్నట్టుంది.

ఉభయులూ పొలం తీరు చూస్తున్నారు. మున్నీ ముఖాన ఉదాసీనత నిండుకుంది. కాని హల్కా ముఖం ప్రసన్నంగావుంది

మున్నీ దుఃఖిస్తూ ''ఇక కూలిపనైనా చేస్తేనే గాని పొలం శిస్తు కట్టలేము'' అంది.

హల్కా ఆనందంగా ''అయితే అయింది, కాని ఇకమీదట ఇక్కడ రాత్రిళ్లు చలికి బాధపడవలసిన అవసరంమాత్రం వుండదు కదా!'' అన్నాడు.

# కార్తిక చంద్రికలు

## శ్రీ శనగన నరసింహస్వామి

పాలసముద్రమే పుడమిపై పడపొంగెనో కాక కాంతిలో
కాల కవాటముల్ తెరువగా బడెనో శతకోటి చంద్ర బిం
బా లొకసారిగా గగనమండలమం దుదయించెనో జగ
జ్జాలమునిండ కార్తికిక చంద్రిక లింతగ పండ బారునే!

కురియునో పారిజాతంపు విరులు స్వర్గ
నందనమునుండి కైలాసనగమునిండి
రాలునో. విభూతిరాశులు నేలపైన
ఎంతవెన్నెల చెల్లరే! యెంతసొగసు.

ఒహో వెన్నెల! అమృత ప్రవాహమట్లు
ట్టుకొని పొంగు దోసిళ్లబట్టి త్రావి
ఆర్తునో దాహమును పాత్రలందు నించి
దాచుకొందునొ కృష్ణరాత్రముల కొఱకు

మలిన వసనమ్ములూడ్చి దిఙ్మండలములు
తెలి దుకూలములను దాల్చి తేజరిల్లు
ఈ మనోజ్ఞశరద్రాత్రి కేగతి పెడ
మొగమువెట్టి నిద్రించునో ముగ్ధ జనము

ఏ యవవూన దుఃఖమొ సహింపగరాక తనంత మూగయై
పోయి ప్రవాస భారమును మ్రోసెడి నా కవితావిపంచి యూ
రేయి నిమేషమేని నిదురింపక కాకలికాస్వనంబులన్
మ్రోయునదేమొ స్వప్నపరిమూఢము లింద్రియముల్
చలింపగ...

ఈ తెలివెల్గు వైభవము లేసడిసద్దును లేక యూరకే
భూతల మేలియేలి యుడి వోవుట స్తైపగజాల సారెకున్
చేతమునందు పొంగు రససింధువులన్ భరియింపజాల ఈ
రాతిరి యెల్ల దిక్కులు కరంగగ పాడుచు సంచరించెదన్.

శ్రీ సోమసుందర్

# నల సమర్పించిన ఉత్తమకావ్యాలు-౨

## చేయిపట్టుకు నడిపించే బాల్యస్మృతులు

నల సమర్పించిన ఉత్తమ కావ్యాలలో 'మృత్యువృక్షం' రెండోది తన తొలి కావ్యసంపుటి "చెట్టు నా ఆదర్శం" ద్వారా ఒక వినూత్న కవితా శ్రేణిని ప్రదర్శించి రసజ్ఞ హృదయాలను ఆకర్షించిన శ్రీ ఇస్మాయిల్—నాలుగు సంవత్సరాల తర్వాత తన రెండో కవితా సంపుటని ప్రచురించాడు వైశాఖంలో- తెలుగు కవితా సహకార శాఖపై ఒక వినూత్న కవితా వనప్రియ అధివశించింది, కొత్తదీ, మెత్తనిదీ ఒక కలరవాన్ని వినిపించింది

శ్రీ ఇస్మాయిల్ ముప్ఫయ్యేళ్ల క్రితంనుంచీ కవితారాధన చేస్తున్న సంగతి అస్మదాదులే ఐదారుగురికో తెలుసు శ్రీ కృష్ణశాస్త్రిగారి సచ్ఛాత్రుడుగా మౌనతపస్సమాధిలో మూడు దశాబ్దాల కాలాన్ని నెట్టివేసి—ఒక్కమాటుగా ఒక కొత్త ఉరవడితో 'కళాకేళి' మాసపత్రిక పుటలో ప్రథమ సాక్షాత్కారం కలిగించడం పాత మిత్రుల కాశ్చర్యమే కలిగింది ఇన్ని ధోరణులీ దేశంలో మడ త్రొక్కుకుంటూ సాగాయే—సాహిత్యోపరితలాన్ని అందడి చిత్తడిగా మార్చాయే—'ఇదేమి కొత్త ధోరణి?' అనుకుంటూ కొందరు సంశయాత్ములు శంకాశరాలనూ సంధించకపోలేదు. కవిత్వానికి దిన వారీ ఔపయోగిక ప్రయోజనం తప్ప అన్యమేదీ పనికిరాదనే పచ్చి భౌతికవాదులు కొందరు—స్వచ్ఛకవిత్వమంటే ఇదేనా అనీ, ప్రాకృతిక చిత్రాలను యథాతథంగా స్వీకరించడం చిత్రకారుని పనేమోతప్ప కవి బాధ్యత అంతటితో తీరుతుందా అనీ సందేహాలు వెలువర్చారు ఆధునిక కవిత్వంలో—ఉద్ఘాటనా ధోరణి మితిమీరింది నెత్తురూ చెమటా కన్నీళ్లూ తప్ప యితరమైనవేవీ కవిసమయాలుగా పనికి రావనే నియతి ఏర్పడింది ప్రతివాడూ ఔపదేశిక ప్రవక్తగామారి కూర్చున్నాడే తప్ప గుండెక్రింది గుసగుసలను వినిపించే అనుభూతి పరిపాకాన్ని అందుకోలేకపోయాడు. అలా ఒక భ్రష్టాచారం ప్రదర్శిత మవుతున్న దశలో ఒక విశిష్ట వికలామోదంలా, క్రొత్త పొలుపలు తెలిపే మందపవనంలా ఇస్మాయిల్ కవిత్వం వీచి అస్మదాదులకెంతో రిలీఫ్ అందించింది. ఒక సుభోచ్ఛ్వాస మొనగూర్చింది కనుకనే ఆ ఆనందంతోనే—ఈ వ్యాసకర్త—'చెట్టు నా ఆదర్శం' అనే యితని తొలి కవితా సంపుటికి విపులపీఠిక సంతరించాడు. అతి నిరాడంబరంగా ఆధునిక కవితారంగ ప్రవేశం చేసిన వినూత్న సన్నివేశమది.

మనోగగనంలో చాపుకున్న జ్ఞాపకాల కొమ్మల్నీ, గాఢానురాగాల ఊడల్నీ వెనక్కి పీల్చేసే 'మృత్యువృక్షం'—వ్యత్యస్తంగా తలకిందుగా మొలిచే నిరంతర సత్యాన్ని వింపాదిగా విప్పే యితని కవిత, అనివార్య మృత్యువుతో ఆరంభమై, జీవన నిరంతరాయతవైపుగా సాగుతుంది. ఈ భూమిపై జీవితంవలెనే మృత్యువుకూడా అజరామరమైనదే! మానవ శిశువు పుడుతూనే, బిగించుకొన్న పిడికిళ్లలో మృత్యుచ్ఛాయల్నే—జననాంతరంనుంచి తెచ్చుకుంటాడు. కనుకనే ప్రతివాడి జీవితం ఏడుపునుంచి ప్రారంభమై నవ్వులోకీ, నవ్వునుంచి దుఃఖంలోకీ ఒక చక్రభ్రమణం కావిస్తుంది.

వ్యత్యస్త మనోహరంగా ప్రదర్శితమైన కవితను అవగాహన చేసుకుందుకీ కవితా సంపుటిని చివరినుంచి ప్రారంభించి మొదటికి రావడం సుకరమైన పద్ధతి. కనక చిట్టచివరి కవిత 'గోదావరి దాటాం'తోనే పరిశీలన ప్రారంభిస్తాను. గోదావరి మండలపు జన జీవితంలో యేటి కిద్దరికి అద్దరికీ పోతూ ఉండడం నిత్యకృత్యం. సాధారణ ప్రాపంచిక సన్నివేశాన్ని అసాధారణ కవితోక్తిమయ ప్రపంచంగా చిత్రించడంలోనే కవి ప్రతిభ! ఆకాశం పాఠాలు చెప్పింది; ఒరి మళ్లు చక్కగా అప్పగిస్తున్నాయి ఎక్కాల పట్టికలకుమల్లే మూడేసి వరుసలుగా బాతులూ సాగుతున్నాయి బాల్యవిద్య కొద్దిగా ముందుకుపోయింది గేదె కొమ్ముల కుండలీకరణాలు ఎదురయ్యాయి. ఇవన్నీ విద్యార్థి దశకు సంబంధించిన పదచిత్రాలు. బాలహృదయానికెదురయ్యే పరిష్కారంకాని బీజగణితాలు. మహాకవి రైనర్ మేరియా రిల్కే చెప్పినమాట జ్ఞప్తికి వస్తుంది ప్రతివాడి బాల్యమూ వాడి కందకుండా దూరంగా వ్రేలాడిన మధుకోశం దానిస్మృతి సీమల్ని అందుకుందుకైనా కవి బాల మనస్కత నవలంబించాలి. లోక వాస్తవికతను చూసి అబ్బురపడ్డంలోనే అద్భుత కవిత లుద్భూతమవుతాయి! బాల్య చైతన్యపు ఊహాశాలిత్వం (Nostalgic imagination) నుంచే అద్భుతావహమైన పద చిత్రాలు అడుగడుగునా అడ్డుతగిలి, పఠిత హృదయాన్ని పరవశింపచేస్తాయి. "కొమ్ముల కుండలీకరణాలతో లెక్కచేయకుండా నిలబడ్డ లెక్కల్లాంటి గేదెలు" అప్పుడప్పుడు కవిచేసిన చమత్కారం మనల్ని ఒదలదు. మనల్ని గుర్తించకుండా, గౌరవించకుండా నిలబడతాయి గేదెలు. అవి లెక్కచేయకుండా నిలచిన లెక్కలు. మనకు పరిష్కారం గాని సమస్యలు! ఊళ్లమధ్యనుంచి మన ప్రయాణం సాగుతున్నపుడు—ఇళ్ల అరుగుల పెదవులు పలకరించే చిరునవ్వులు విరుస్తాయి. ఆ నవ్వుల్లో కలకలలాడే జనాలు తారసపడతారు. చరిత్ర గమనంలా సాగుతుంది ప్రయాణం. గలగలమని గొణుక్కుంటూ, వీడని నీడలా వెన్నంటి వచ్చే ముసలి నౌకరులాంటి పంటకాల్వ. కెళ్లేడస్కొపు

మాదిరిగా నిరర్థక పదార్థంనుంచి సార్థకమైన రంగురంగుల్నిచూపిస్తుంది ప్రయాణం. తరుచ్ఛాయలు కెరటాలు కెరటాలుగా తాకుతాయి. వాత్సల్యాన్ని చూపుతాయి. మెడచుట్టూ చెయ్యవేసి దగ్గరగా లాక్కుని చెవిలో గుసగుసలాడే నేస్తంలా చిరుగాలులు! ఇన్ని దృశ్యాలను దాటి చివరికి కోటిపల్లి చేరుకుంటాడు కవి. —వైతరణి దాటాక స్వర్గాన్ని చేరుకొన్నట్టు—గోదావరి దాటాక కోటిఫలితాల నందుకుంటాడు.

మానవ జీవితంలో బాల్యం రంగు రంగులతో సాగిపోయింది మనసు మాత్రం ఇంకా వాటిపైకే చెంగు చెంగున దుముకుతోంది అది పిచికలా చిట్టిమనసు దాని రెక్కలంతకన్నా చిన్నవి. ఆకాశానికే ఆచ్ఛాదన లేదు భూమికి సీమలులేవు ఇంత భూమ్యాకాశాలకీ తన చిన్న రెక్కల్ని ఎలా చాచగలుగుతుంది, బాల్యస్మృతి అనే పిచిక ?

బాల్యం యౌవనంలోకి మారింది. పసిడిరంగు కండువావంటి ఇసుక తిన్నెల్ని ధరించింది పెళ్ళికొడుకులా ముస్తాబయింది. నదిని ఇంతవరకూ పెళ్ళికూతురన్న కవులే ఉన్నారు. పెళ్ళికొడుకుగా దర్శించగలిగిన వాళ్ళులేరు అలాంటి నది ఆశ్చర్యం కలిగించింది. ఆ శోభినపు పెళ్లికొడుకుని చూస్తే—బాల్య హృదయం పెళ్ళి కూతురులా బిడియంతో, భయంతో ముడుచుకుపోయింది కాలు క్రిందకు పడలేదు ఇంతలో అరచెయ్యి లాంటి దోనెని చూపింది నది; అది ప్రేమతో చాపిన అభయహస్తం పగిలిన గాజుపెంకుల్లా పదునుగా మెరుస్తోంది పడవ గుండె! పదును అనే మాటకు మనభాష సాధించుకొన్న రెండు అర్థాలనూ చక్కగా వినియోగించుకొన్నాడు కవి గాజుకీ నీటికీ మెరిసేగుణం ఉంది. పడవలో అక్కడక్కడా చేరిననీరు పగిలిన గాజుపెంకుల్లా మెరుస్తుంది అలాంటి మెరుపులతో నిండినదా పడవ పగిలిన గాజు పెంకులపై అడుగులు వేయడం లేదు కదా అని పడవెక్కే ప్రతివాడికీ ఒక భయం దాటగలమనే ధీమా; పడవలో ప్రవేశించిన తర్వాత నదిలో సాగడం ఎలా ఉంది? అంతవరకూ పక్షివలె ఉడువీధిలో విహరించిన మనోవిహంగం—రెక్కల్ని దులిపేసింది. నగ్నంగా చేపలా మారిపోయింది అప్పుడిక సర్వ జల భయాన్నీ పోకార్చుకుంది!

వెనకి నుంచి వస్తూంటే తగిలే రెండో కవిత—'ఏకాంతానికి గేలం;' పట్టణమనే ట్యూబులోంచి పంచరంగుల పేస్టులా సంధ్య అవతలికి జారిపోయింది. పరిచితమైన గోడలే తమ ఆనవాళ్ళు పోగొట్టుకున్నాయి. చీకటి వ్యాపించగా విశాలావధి కుంచించుకు పోయింది. ఇరుకుల్లోంచి గోడలు ఉరికి, ఊరవతల పడుతున్నాయి. నిజానికిలా పడేవి గోడలు కావు. గోడల మధ్య ఇరుక్కున్న జనాలూ మనసులూ; సాయం సమయాన ఆరు బైటకిపోతాయి. అలా పోయి, కాలవ ఒడ్డున తదేకధ్యానంతో, గేలంవేసి కూర్చున్నవాడి మాదిరిగా కూర్చుంటారు. కాని ఈ గేలం—ఏ కాంతాకేగాని, ఏ కాంతకో ఏ మీనానికో కాదు. మనుషులకు మల్లేనే కాలవలకి కూడా బయళ్లంటేనే యిష్టం. గట్టులేని గగనాన్ని గడగడా తాగేస్తుంది కాలవ. కొత్త ఆకాశాలకోసం వెదుక్కుంటూ పోతుంది.

సాయంత్రమనే పంచరంగుల టూత్‌పేస్టు సాంతం ఖర్చయి పోయాక, కాలవా మనిషీ ఒకరిలో ఒకరు మెరుస్తారు ఆకాశమనే ప్రమిదలో ఏకాంతంగా వెలిగే వత్తులవలె జ్వలిస్తారు. అప్పుడగాళ్లో దీపాలు చటుక్కున వెలుగుతాయి. కాంతిలో పట్నం తన యధా వైశాల్యాన్ని పరచుకొంటుంది. అంతులేని ఆకాశంతోసహా అప్పుడు మనిషి పురప్రవేశం చేస్తాడు అంతులేని హృదయానుభూతితో సహా! కాలవల అంతులేని చైతన్యంతోసహా! కవి స్వీయానుభూతిని ఆంతరిక ఆగాధాలలో మథించి, స్వాత్మకానుభవాన్ని పరాత్మకంగా అభివ్యక్తం చేయడం ఈ కవితలోని విశేషం!

**"To go into ones self and to explore the depths whence your life wells forth, at its source you will find the answer to the question whether you must create"** అంటాడు రిల్కే. చెరువొక్కటే చిన్నప్పటి జ్ఞాపకం అనే ఒక నిరాడంబర పద చిత్రాన్ని విడిచేసరికి, మనో జలధిలో ఎన్నెన్ని ఉత్తుంగ తరంగాలో! అప్పుడో కవితా హృదయం సృజనాత్మక రంగప్రవేశం చేయక ఎలా ఆగిపోగలుగుతుంది! పడగ విప్పిన చప్పుడు, నిద్దర పెలయేరు; నిద్దుర ఒడ్డులు, అచ్చాడే వింత మృగాలూ—వంటి వెన్నెన్నో పద చిత్రాలు క్రిక్కిరిసి సాగుతూ, పఠిత హృదయంలో సౌందర్యానుభూతిని మేల్కొల్పుతాయి! అతని కవితనీ చిరస్మరణీయం చేస్తాయి.

కవిత ప్రథమశః సాధించే విజయం ఏమిటి? పాఠకుని, లేదా శ్రోత హృదయంలో చిరంతన ముద్ర వేయడం! ఆలోచింపచేయడం! ఆ తరువాతనే ఆ కవిత ఆవిష్కరించే భావ జాలమేమిటి, సిద్ధాంత ప్రత్యయాలేమిటి? అనే చర్చ ప్రేక్షక హృదయంలో బయల్దేరుతుంది. అంటే—అంటే అంటక జారిపోయే తొలుగుడ్లవంటి కవిత్వ గురించి ఆలోచనా మిగలదు; అనుభూతీ మిగలదు.

లార్డ్ టెన్నీసన్ కవి — **"OENONE"** అనే రెండువందల డబ్బయి దీర్ఘ పాదాల కావ్యం రాశాడు. అత్యంత విషాదకరమైన సన్నివేశం యితివృత్తంగా స్వీకరించి పఠితకెంతో విషాదోద్రేకం కలిగేలా రచించాడా కావ్యాన్ని కాని ''ఈనన్''కావ్యమంతా చదివిన తర్వాత చదువరి మనసులో మిగిలేది ఒక లేశమైన విషాదానుభవ రేఖ మాత్రమే ... **"One silvery cloud had lost his way between the piney sides of this long glen"** వంటి ఒకటో రెండో సుందరోక్తులు మన హృదయంలో చిరావాసం, కల్పించుకుంటాయి. ఇది ప్రతి కవితా పాఠకుడికీ ప్రతి మహాకవి పట్లా లభించే అనుభవమే! అలాంటప్పుడు కవిత్వ నిర్మాణంలో సారభూతమైన అంశాన్ని మాత్రమే స్వీకరించి, తదితరమైన సాధారణ పదార్థాన్ని పాఠకహృదయానికే ఎందుకు విడిచిపెట్టరాదని ఈ కవి ప్రశ్నిస్తాడు. అతడు విశ్వసించే ఆ కవితా శిల్ప సిద్ధాంతం పట్లనే దృష్టి లగ్నం చేస్తాడు. లార్డ్ టెన్నీసన్ భార్య ఎమిలీ ఉద్ఘాటించినట్లు ఆ స్వేచ్ఛను మనం కవి కీయవలసిందే! **"The Poet should have the freedom to be nothing but a Poet"** అంటుంది ఎమిలీ!

వెనుకనుంచి ఏదో కవిత — 'నీడలా దృఢంగా' లో కూడ. ఇస్మాయిల్ మనోహర పదచిత్రాలను ఖచితంచేస్తాడు. హడావుడిగా పరుగెత్తే కాలువ లన నీడల్ని తనతో రమ్మని చెయ్యట్టుకు లాగుతుంది నిజానికి నీడలు తనవికావు తన ఒడిలో పవళించే చెట్ల కొమ్మలు కాని అవి రామంటూ తలలాడిస్తున్నాయి నిత్యానుభవ చిత్రాలను జ్ఞాపకం చేసుకుంటూ జాగ్రత్తగా ఊహించవలసిన పద చిత్రమిది. ప్రపంచమంతా ప్రయాణ సంరంభంలో ఉండగా, కాలవ గట్టుమీద తొందరలేని నీడలా తానొక్కడే దృఢంగా నిలచాడట కవి! క్షణ క్షణం కదిలే మబ్బులా కదులుతూపోతుంది లోకం ద్రష్టమాత్రం చిర స్థిర చిత్తంతో, దృఢంగా నిలుస్తాడు. లోకపు వెలుగు నీడల్ని విశ్లేషిస్తూంటాడని కవి నిర్దేశించిన భావం!

'ఆమె చిన్నప్పటి ఊరు' అనే కవితలో నిదర, బాల్చీల చప్పుళ్లు వినిపిస్తాయి మాటలొలకడం మెరుస్తుంది. స్మృతుల మునివేళ్లు మృదువుగా నిమురుతాయి వికసించిన చివురాకులాంటి మనసు విప్పి కూచో పెడుతుంది కటకటాల వెనకాల ఖైదీలా ఊరు ఒదిగిపోతుంది అలనాటి ముచ్చట్లు మాటల్ని వెలిగిస్తాయి. మెరిసే మబ్బంచులు దర్శనమిస్తాయి. (వ్యావహారికానికి వ్యాకరణ దీపం చాలా చిన్నది కనుకనే దాని గుడ్డికాంతుల టుగా గమాన్ని గ్రహించదు.) దీపాలపై పురుగు మబ్బులు క్రమ్ముతాయి. ఇలా ఈ కవిత నిండా పద చిత్రాలు గుంపుల గుంపులుగా కదులుతాయి దీనమైన స్మృతులు శిక్షితుల మాదిరిగా తలలు వొంచి, చేతి గొలుసులు లోకానికి కనిపించకుండా దాచుకుంటూ ఖైదుకుపోయే నేరస్థుల సమూహంలా కదులుతాయి!

'కోసిన మామిడిపండు' అనే కవిత విచిత్రమైంది. ఒక సామాన్య దృశ్యాన్ని అనుభూతిగా మార్చుకొని, అసామాన్య చిత్రణతో దాని ఉనికిపట్లకు కొత్త అర్థాలనద్ది, కొత్త అనుభవాలుగా రూపొందించి ఉన్నతీకరించే ప్రజ్ఞాశాలి! అనవరతం అచుంబిత సీమలనే అన్వేషిస్తుంది. అనుకరణల నేలబారు ప్రాకులాటకు దిగదు. అంటే—'ప్రజ్ఞానవనవోన్మేషశాలినీ, ప్రతిభా మతా!' అనే ఆలంకారిక మతానికి లక్ష్య ప్రాయమవుతుంది. ఇది ఫలానా ప్రాచ్య అప్రాచ్య కవికి అనుకరణ అని ఏ విమర్శకునికైనా తాంబూలాల మీయవలసిన అవసరంగాని, దానితో తన్నుకు చావవలసిన పని ఈ కవికిగాని కలలో గూడా సంభవించవన్నది యథార్థం!

అలల కనురెప్పలక్రింద అలజడిలేని స్వప్నంలా నిశ్చలంగా వ్రేలాడుతుంది చేప. ఆకుల జలపాతంకింద ఆకుపచ్చని నీడల్లో నిశ్చింతగా ఈదుతుంది మామిడికాయ! ఇక్కడ ఉపమాన ఉపమేయాలు తమ ఉనికిపట్లు మార్చుకున్నాయి. తద్వారా చమత్కారాన్ని భాసింపచేస్తున్నాయి. చేప వ్రేలాడదు. అలలక్రింద అలజడిగా కదులుతుంది. మామిడికాయ ఈదదు. నిశ్చింతగా ఆకుపచ్చని నీడల్లో వ్రేలాడుతుంది. జలరాశిలోని చేపకీ, మావి గుబురులోని

కాయకీ సారూప్యత ఘటింపచేశాడు కవి. ఎండాకాలం గాలంవేసి, ఈ కాయని పట్టుకుంది. అంతవరకూ ఎక్కడో మామిడిగుండె లోతుల్లో విశ్రమిస్తోంది. ఎర్రటి ఎండుగడ్డిలో పండబెడుతుంది. చేపని పట్టుకుందు కుపయోగించే గేలం విసరడంతో మంచి షోకు చేకూరింది. ఎండాకాలం సకల లోకస్థుల కాయాలనూ ఎండుగడ్డి వంటి ఎర్రటి ఎండలతో మండబెడుతుంది. అప్పుడు చల్లని మంద హాసం లాంటి తళతళలాడే కత్తి వచ్చి, అంతరాళాన్ని బహిర్గతంచేసి, మామిడిపండు స్వాదుత్వానికి చెర విడిపిస్తుంది!

ఇంతవరకూ అనుభోక్తవ్యమైన ఒక మధురానుభూతి అందరికీ నోరూరిస్తుంది. ఇక్కడే ఒక మెలిక—పిలక పట్టుకుని లాక్కుపోతుంది. పఠితను అంతర్ముఖుడ్ని చేస్తుంది. మందహాసంలా వస్తుందో, మాన్పానులా వస్తుందో తెలియదు కాని, ప్రతి జీవికీ ఒక కత్తి ఎదురై అంతరాళాన్ని కోస్తుంది. ప్రాపంచిక జీవితమనే చెర విడిపిస్తుంది. ఇక్కడే సామాన్యార్థాన్ని అసామాన్య ఉత్త మార్థానికి ఉన్నతీకరించడమనే ఆధునిక కవితాధర్మం నెరవేరు తుంది. ప్రత్యేక సన్నివేశంనుంచి సార్వత్రిక సూత్రీకరణను లగించడం అనే విశిష్ట లక్షణం సాధింపబడుతుంది. అన్యాపదేశమనో, అర్థాంతరన్యాసమనో సాంప్రదాయిక మానదండాలతో ఈ ఆధునిక ప్రక్రియా విశేషాన్ని కొలవకూడదు.

ఒంగిన సంధ్యాకాశాన్నీ, చీలిక రహదారుల్నీ, అతికించే చిరునవ్వులా, విజయద్వారాల్ని సృష్టించే అంగలూ, జగాన్ని తెల్లగా మార్చిన చంద్రోదయాలూ, వెనక్కి వెనక్కి విశాలంగా జరిగే యిళ్ళూ—ఇలా ఎన్నో అనుభూతులుగా మూర్తీభవించే సుందర పద చిత్రాలు !

ఈ 'మృత్యువృక్షం'అనే కవితా సంపుటిలో మొత్తం ఇరవై ఆరు కవితలను పొందుపరచాడు శ్రీ ఇస్మాయిల్. ఇవి నిడివిలో లఘు కవితలేగాని, సునిశిత భావుకత్వంతో (Refined sensibility) అధ్యయనంచేసే పాఠకునికి అలఘుప్రాతమైన ఆలోచనామృతాలు. ఒక ప్రసిద్ధకవి యిటీవల ఒక పత్రికలో రాస్తూ, ''మినీ కవితలు రాసే కవి ఉత్తమ కవిగా గణుతికెక్కలేడని ఒక అనాలోచిత ప్రతిపాదన'' చేశాడు. ఇది ఎంత నిరాధారమైనదో అంతా అవివేకమైనదే! నేటి ప్రపంచ కవిత్వాన్ని తేరపారిచూస్తే యిది ఎంతటి హాస్యదృష్టో తెలుస్తుంది. నిడివి వెడల్పులమీద ఏ దశలోనైనా కవిత్వ గుణా గుణాలాధారపడ్డాయేమో,ఇలాంటివారు కళ్ళుమూసుకొని ఆలోచించుకోవడం మంచిది. తొందరపడి ఒక తీర్పు విసిరితే, అది ఎదురు తిరిగి తమ కంఠాల్నే బంధిస్తుందని ఇలాంటి వారెందుకో చప్పున గ్రహించరు.

ఈతని కవితల్లో సుకుమార భావుక సామగ్రి ఎంతో లభ్యమవుతుంది. ఈమాట చెప్పడం అనుకరించి గాడిద బరువు లెత్తుకొనేవారి కోసం కాదు; అధ్యయనం చేసి తమ హృదయానుభవాల్ని సౌభాగ్యవంతం చేసుకొనేవారికి ! అకస్మాత్తుగా చిగిరించిన చెట్టు వినిపించిన ఆర్కెస్ట్రా వేయి ప్రతిధ్వను లీనుతుంది. ఒక యింద్రియానుభవాన్ని వేరొక యింద్రియానుభూతిగా పరివర్తింపచేయడం ఆధునిక కవితా విశిష్టత! అనుభవాలన్నిటికీ కేంద్రమైన మనస్సులో ఇంద్రియానుభూతుల ఆదాన ప్రదానం సంస్లిష్టమవుతూ ఉంటుంది. సముద్రపు నీలికళ్ళు, నిద్దట్లో వికసించిన పొద్దుటి కనురెప్పలు, చిగిర్చే చెట్టుకి ఎగిరే పిట్ట ఆదర్శ. పత్రాలవీపులపై మేపులు, సామాన్యమైన మట్టితో సారూప్యం పొందడం, మఱ్ఱి వృక్షశిఖరాన్ని చేరి చలిమూకల్ని తరమడం—ఇలా వందలాది పద చిత్రాలు—వేయి వీణల్నీ, వేయి వేణువుల్నీ మ్రోయిస్తూ మాధుర్య గుణంతో సాగిపోతాయి.

ఐతే ఈ కవి శిల్ప రహస్యం — అభివ్యక్తిలోనేగాక, ఉక్తికీ ఉక్తికీ నడుమ ఉట్టిపడే నిశ్శబ్దంలో సైతం నిక్షిప్తమవుతుంది. చెప్పిన భావం ఎంత రక్తి కలిగిస్తుందో, అర్థోక్తిగా విడిచిన భావం సైతం సహృదయుడికి అంతే రమ్యత కలిగిస్తుంది. "The best Craftsman ship always leaves holes and gaps in the work of the poem – so that something that is not in the poem can Creep; Crawl, flash, or Thunder in'' అని డిలాన్ థామస్ కవి చెప్పిన సూక్తి యితనిపట్ల అక్షరాలా సత్యం ! ఆ శిల్ప రహస్యమే యితని కవితలకు అంతఃకరణ ప్రవేశం లభింప చేస్తుంది.

> "Oppressed water of the well
> Gushes silence in the JARS" – అనీ,
> ... ... ... ... ... ...
> "When the Stars nail
> Spears on the gray water . . ." అనీ

. అద్భుత ఊహా కల్పనలు చేసిన అమర కవి, గర్షియా లోర్కా గురించి — సర్ సి. పి. బౌరా యిలా అభినందిస్తాడు : "A Strangely in memorial quality which tran cends their local and temporal limitations and makes them typical of the unchanging elements'' అనిన వింగడింపు ఇస్మాయిల్ కవితలకి కూడా ఇంపుగా సరిపోయే కితాబే !

ఏమైనా, ఎప్పుడూ ఊర్ధ్వలోకాలకే చేతులు చాపుతూ, పచ్చగా బ్రతకడమూ, వెచ్చని చెలిమితో బ్రదకడమూ జీవలక్షణమైన చెట్టు తన ఆదర్శంగా స్వీకరించి తొలి కవితా సంపుటి ప్రచురించిన కవి — మృత్యువును వృక్ష ప్రతీకతో అనుసంధించి మలి కవితా సంపుటిని ప్రచురించడం తాత్త్వికంగా విరోధాభాసమే! కనుకనే కవితానుభవానికి తాత్త్విక చింతన గౌణమేనని ముందే మనవి చేసుకొన్నాను.

['మృత్యు వృక్షం' ప్రతివారూ చదవాల్సిన కొత్త కవిత! ఇది—నేనా కావ్యాన్ని ఆవిష్కరిస్తూ చేసిన ప్రసంగానికి వ్యాస రూపం ! ]

# నా చెట్టు

## శ్రీ కె. గోదావరిశర్మ

చిన్నప్పటినుండి చూస్తున్నాను
భూస్థాపితమైపోయిన నా చెట్టు
ప్రతి రాత్రీ
ప్రపంచం నిద్రలో ఉన్నవేళ
ఎక్కడికో
పారిపోదామని ప్రయత్నిస్తుంది.
మనుషుల్లో మూఢ భావాల్లా
పాతుకుపోయిన వేళ్లు
మట్టిని కౌగిలించుకుని నిద్రలేవవు.
చెట్టు మాత్రం
పట్టువదలని విక్రమార్కుడిలా
గాలి బుజంమీద చెయ్యివేసి
భూమి పట్టు వదిలించుకోవాలని
విశ్వప్రయత్నం చేస్తుంది.
ఊపిరి బిగబట్టి
నిశ్శబ్దంగా గింజుకుంటుంది.

ఆకుల కన్నుల్ని నిగిడ్చి
ఆకాశంవైపు ఆశగా చూస్తుంది.
గాలిలో ఎగిరిపోవాలని కలలు కంటుంది.

ఒళ్లంతా వెన్నెల ముద్దులతో నిండినవేళ
చంద్రుడికేసి చూస్తూ
విరహంతో నిట్టూరుస్తుంది.

రాత్రంతా కన్న కలల్ని
మంచు బిందువులుగా మార్చి
ఆకుల చివర ముత్యాల తోరణంలా వ్రేలాడదీసి
తూర్పువైపు తిరిగి
ఆశలకి నీళ్లొదిలేస్తుంది.

సూర్యుడి ముందు
పట్టుబడిన దొంగలా
తలొంచుకు నిలబడుతుంది,
పారిపోయిన గాలిని తిట్టుకుంటూ
సాయంకాలంకోసం ఎదురుచూస్తూ ... ...



డా. ఆర్వీయస్. సుందరం

# శేషేంద్రశర్మగారి గొరిల్లా★

శేషేంద్రశర్మగారి 'గొరిల్లా' కొంగ్రొత్త కవితా–సంకలనం. ఈ వచన కవితా సంకలనం నిజానికి సంకలనంకాదు; కావ్యమే. దీనిలోని వచన కవితా ఖండికలు విడివిడిగా పత్రికల్లో ప్రచురితమయ్యాయి, రేడియోలో ప్రసారమయ్యాయి. అయినా ఈ కావ్యంలో దృగ్గోచరమయ్యే దర్శనం అవిచ్ఛిన్నమయింది. ప్రతి ఖండికలో అలలు అలలుగా వినిపించే ధ్వని ఒకే తత్త్వస్రవంతికి చెందినదే.

శేషేంద్రశర్మగారి కలం చాలాకాలంనుంచి కమ్మని కవితన్ని అందిస్తున్నా శర్మగారే 'గొరిల్లా'లో చెప్పినట్లు "ప్రభాతం పసిదిగా ఉన్నప్పుడు సనాతన గంగలో స్నానంచేశాడు మానవుడు; ఇప్పుడు మధ్యందిన మార్తాండ–మండలాన్ని ఉపాసిస్తున్నాడు"– ఆ మానవుడు ఎవరో కాదు శేషేంద్రశర్మగారే

యుగాన్ని సాహసోపేతంగా కార్యోన్ముఖం చేయాలని కొత్త గొంతుకను విప్పిన శేషేంద్రగారికి కవి–కావ్యాలను గురించి కొన్ని నిశ్చితాభిప్రాయాలున్నాయి. "కవినుంచి సామాజిక చైతన్యం అడగడం సూర్యుడ్ని ఒక కొవ్వొత్తి అంత కాంతి ఇమ్మని అడగడంతో సమానం. సామాజిక చైతన్యం కవికి కావలసిన చైతన్యంలో వెయ్యోవంతు కూడా కాదు" అంటారాయన. అంతేకాదు. "సామాజిక చైతన్యంకంటే, సాహిత్య చైతన్యం గొప్పది కానీ సాహిత్యచైతన్యంకంటె, గొరిల్లా చైతన్యం గొప్పది. ఈ గొరిల్లా చైతన్యమే" మనకు కావాలని అంటారు శేషేంద్ర. గొరిల్లా రాయడానికి చాలాకాలంముందే 'పక్షులు' అనే పుస్తకంలోనే 'తత భయంకర కవితా శతఘ్ని అగ్ని' అన్నారాయన. ఇది చూచి నాటి నుంచీ నేటివరకూ అవిచ్ఛిన్నంగా ఆయన కవిత్వంలో ప్రవహిస్తున్నది గొరిల్లా చైతన్యమే అని కొందరు వ్యాఖ్యానించారు. ఏమిటీ గొరిల్లా? ఏమిటీ చైతన్యం?

'అవ్యక్త భవిష్యత్కానన నాంతరాల్లో'లేచే 'భయంకర ఆకార రేఖ గొరిల్లా'. 'మనిషిలో నిద్రిస్తున్న క్రియాశక్తి' గొరిల్లా. దానిని చైతన్యవంతం చేయడమే కవి పరమోద్దేశం. అందుకే శేషేంద్రకవి గొరిల్లాను ఎలుగెత్తి పిలిచారు. "లేలే గొరిల్లా ఇది నీవు నిదురించడానికి వేళకాదు నీ మహాద్వారం దగ్గర నిల్చుని ఈ పాటలల్లుతున్నా ఈ పాటలన్నీ పాడుతున్నా. ఈ పాటలన్నీ అరుస్తున్నా. ఈ పాటల జన్మ నిన్ను మేల్కొల్పడానికే... నీ సుషుప్తి కోసం రాసే జోలపాట ఒక మహానేరం క్రియాశక్తీ నీ వంటేనే నాకు భక్తి" అన్నారు. గొరిల్లా కర్మయోగి. గొరిల్లా నిద్రిస్తే పొలాలు నిద్రిస్తాయి. గొరిల్లా నిద్రిస్తే పొగగొట్టాలు ఖాళీగా నిలబడతాయి. ఇదీ గొరిల్లా – ఇదీ గొరిల్లా చైతన్యం. మనిషిలోని గొరిల్లా నిద్రిస్తే మనిషీ రాయీ ఒకటే. క్రియాశక్తి విజృంభిస్తే, గొరిల్లా దివ్యమంగళ**మూ**ర్తి సాక్షాత్కరిస్తే లోక కల్యాణం సిద్ధిస్తుంది.

'గొరిల్లా' కావ్యం ఆరంభం నుంచి అంతంవరకు ఎవ్వరినీ ఎక్కడా ఆగనివ్వదు. ఇంకా ఏముందో, ఎంతమంచి పదాలున్నాయో, ఎంతమంచి భావాలున్నాయో, ఎన్ని పద చిత్రాలున్నాయో, ఎంత అనుభూతి ఉందో, ఎంత సుందర అభివ్యక్తి ఉందో అని మనసు పరుగులు పెడుతుంది.

నూతన యుగ ద్వార తీరాలు చేరిన మానవతను గురించిన అంతరాత్మ ఆక్రోశంతో 'గొరిల్లా' చిత్రణ ఆరంభమయింది 'దేవుడ్ని గూర్చి దీర్ఘ చర్చలు చేసేంతటి మూర్ఖులమూ కాదు; ధనికులమూకాదు; మనవి పనిచేసి బ్రతకవలసిన చేతులు' అంటూ 'దేవత లొస్తుంటారు దేవతలు పోతుంటారు ఆకాశంలో; మనకందే దేవతమాత్రం మన చేతుల్లో ఉన్న నాగలి, మన కండరాల్లో నిదురించే గొరిల్లా' అన్న వాక్యాలతో క్రియాశక్తికి ప్రతీక అయిన గొరిల్లా రూపురేఖలు రేఖామాత్రంగా మన కళ్ళకు అగుపిస్తాయి

మానవ జీవన చరిత్రలో మలుపుల్ని దాటుకుంటూ వెనక్కి వెళ్ళగా వెళ్ళగా 'పాతరాతి యుగపు గుడ్డు బద్దలు చేసుకొని ప్రళయ ప్రభంజనంలా బయటికొచ్చిన మహోగ్రమూర్తి' గొరిల్లా కనిపిస్తాడు కవి జ్ఞాపకాలను దర్శనం చేసుకుంటూ పోగా – పోగా అతని భాషలో భూకంపం పుట్టింది; శబ్దాల గుండెలు పగిలి ఆగ్నేయ రక్తం ప్రవహించింది. ఎందుకు? ఏమయిందని? ఈ శబ్దాలు, ఈ అర్థాలు ఇవేనా కవి చెప్పదలచుకున్నవి? కాదు. కవే **సూ**చన ఇచ్చాడు. 'ఈ శబ్దాలచెత్తంతా చీపుర్లతో చిమ్మివేయండి. అప్పుడు ప్రత్యక్షమవుతుంది పేజీలమీద శుభ్రంగా నా తెల్లటి గొంతుక' అని.

కవి గొరిల్లాను నిద్ర లేపవలసిన పరిస్థితి ఎందుకు కలిగింది? 'సామాజిక చైతన్యం కవికి కావలసిన చైతన్యంలో వెయ్యోవంతు కూడా కాదు' అన్న కవి సామాజిక చైతన్యాన్నే ఎందుకు ఆశ్రయిస్తున్నాడు? సామాజిక చైతన్యాన్నే ఎందుకు చూపిస్తున్నాడు? కవే అంటున్నాడు – 'నా దేశంలో శవం చెపుతుంది

★ బెంగుళూరు విశ్వవిద్యాలయంవారు శేషేంద్రశర్మగారి రచనలను గూర్చి ఏర్పరచిన సదస్సులో చదివిన వ్యాసం.

బ్రతికున్న వాడికంటే ఇంకా బాగా, బ్రతుకంటే ఏమిటో' అని. అంతేకాదు. 'ఎన్నాళ్ళు ఈ పాట పాడకుండా ఉండేది. నా ఆత్మ దాని బరువు మోయలేకుండా ఉంది' అంటున్నాడు కవి. 'నాగుండెలో ఈ దేశం ఒక రైల్వే ప్లాట్‌ఫారం అయింది' అని వాపోతున్నాడు. 'నా పిల్లలచేత వాడు నా తిండి తినిపించకపోతే భూమిచేత నేను వాడి రక్తం తాగిస్తా'నంటున్నాడు. 'నా కవిత్వం ఏ జెండానూ ఎగరేయదు కానీ నా చేతులు నా దేశపు ఖడ్గాలు' అంటున్నాడు. కట్టుబడకుండా ఉండడానికీ, కట్టుబడడానికీ ఇక్కడ సంఘర్షణ ఉన్నది. 'మార్క్స్ దర్శనానికి ఉండే మానవతాదృష్టి, సామాజిక దృష్టి వేదాంతానికి లేదనుకోవడం పెద్దపొరపాటు' అని ఆర్.ఎస్. సుదర్శనంగారు అభిప్రాయపడినా, 'నా కవిత్వం ఏ జెండానూ ఎగరేయదంటూ' వేదాంతానికీ, విప్లవభావాలకూ వైరుధ్యం వైషమ్యం లేదని నిరూపించాలని శేషేంద్రశర్మగారు ప్రయత్నించినా వీరి మాటలూ, ప్రయత్నాలూ మరింత అస్తవ్యస్త పరిస్థితిని మాత్రమే తెచ్చి పెట్టాయని నా దృఢమైన అభిప్రాయం.

శేషేంద్రగారి కవిత్వం ఏ జెండాను ఎగరేసినా, వెయ్యక పోయినా ఇది 'గొర్రిల్లా' యుగమనీ, గొర్రిల్లా బలిష్ఠ హస్తం అందిమ్మని దిక్కులేని పక్షుల మిలియన్లు ప్రత్యక్షమవుతాయని గుర్తించడం మాత్రం సామాజిక దృష్టి ఉన్న ప్రతివాడికీ సంతోషాన్ని కలిగిస్తుంది. 'గంగానది మొదట ఒక దేవత, తర్వాత పడవల రస్తా, ఆ తర్వాత మన పొలాల్లోకి పారే ఒక పంట కాలువ ! కాలం చేతుల్లో దేవతల రూపాలు కూడా మారుతాయి చూచావా' అన్న వాక్యాలు నా గుండెల్లో నిలిచిపోయిన మంచి ప్రశ్న. 'బాబూ, నదిలో ఇవాళ మనమంతా మునిగిపోతే పోవచ్చుగానీ రేపు నదే సముద్రంలో మునిగిపోయే రోజు కూడా రాకపోదు' అనడంలో నూటికి నూరుపాళ్ళు ఆశావాదం రేకులు విప్పుకుంది. సామాజిక చైతన్యంలో వ్యక్తి చైతన్యం ఎంత అల్పమైందో గుర్తించి 'ఆ దినాన్ని నా కంటితో చూస్తా. తర్వాత ఒక ఉదయం లోకంలో ఉన్న రంగులన్నీ మింగి హాయిగా చనిపోయి ఒక చిన్న స్మృతినై ఎగిరిపోతా'అన్నప్పుడు శేషేంద్రకవి త్రివిక్రమరూపంతో కనిపిస్తాడు. 'అదిగో ఉదయించే దిక్కు దానికే హృదయపూర్వకంగా మొక్కు' అంటే శేషేంద్ర కవి మాటను తోసివేసేవాడు ఎవడుంటాడు ?

'నేను జేబుల్లో కోకిలల్ని వేసుకురాలేద'ని స్పష్టంగా చెప్తూ కవి 'సమానత్వం ఒక పౌరాణిక స్వప్నంగా మార్చివేశారనీ' 'కవులకు శబ్దాలకూ ఈ దేశంలో చెద పట్టింద'నీ గుర్తించిన కవి 'నా ఊపిరితిత్తుల్లో గాలికాదు, గాలి వానలు గాండ్రిస్తున్నాయి' అనడం అతని అనుభూతి ప్రధానమైన దృష్టికి పరాకాష్ఠ. కవిలో మొదటినుంచి ఉన్నది గొర్రిల్లా చైతన్యమని చెప్పడానికి అక్కడక్కడా సూచనలు కనిపిస్తున్నా, కవే అన్నట్లు 'పంట పొలాలమీద పరుగులెత్తే గాలిగా ఉన్న నేను అడవుల్లో దూరే భయంకర తుఫానుగా మారేను మీకోసం' అన్నది నిజం. కవి కండలు విప్లవ పల్లవి ఆలాపన చేశాయి. చేతులు శత్రుకంఠాన్ని తడి తుండుగుడ్డల్లా పిండెయ్యడానికి లేచాయి 'ఆకలి మంటలు అమాయక శిశువుల్ని దహిస్తుంటే చూస్తూకూర్చోడం నాగరకతా? మనుషుల్ని మృగాల్లా వాడుతూఉంటే మౌనంగా ఊరుకోడం సభ్యతా?' అని ప్రశ్నించాడు. 'ఓ గొర్రిల్లా లే మనిషిలో నిద్రిస్తున్న ఓ క్రియాశక్తీ ఓ మహాత్మా ఓ గొర్రిల్లా నిద్రలే' అన్నాడు. 'మమ్మల్ని ఆవహించు ఓ గొర్రిల్లా...పవిత్ర హింసాసీమలకు మోసుకుపో నీ రోమరోమాల్లోంచి పుట్టాలి కోటాను కోట్ల కర్మ వీరులు, త్యాగవీరులు పతనమవుతున్న ధరిత్రిని పైకెత్తి ప్రాణ ప్రతిష్ఠ చెయ్యాలి' అని గొర్రిల్లా కోపానికి గుండెలతో ధూపం వేశాడు. ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో పవిత్రహింస తర్వాత ధర్మం అవతరించిందో లేదో కాని శేషేంద్రశర్మగారి ఊహల్లో మెదిలో భవిష్యత్ యుగంలో నవశకం ఉదయించింది. 'గొర్రిల్లా' కావ్యంలో పతాకస్థాయికి చేరుకున్న భీభత్స సంగ్రామదృశ్యం భరత వాక్యంతో సమాప్తమయింది. 'నవతరాల పిల్లలార యువతా పతాక లారకడదామురండి కాలపు తీరాలమీద బొమ్మరిళ్ళు, అల్లరి చేద్దాము రండి, ఆడుకొందాము రండి' అంటూ కవి వ్రాసిన భరతవాక్యం మనల్ని స్వర్గధామాలకు తీసుకువెళ్తుంది. నవలోకంవైపు ఆశల్ని రేపుతుంది.

ఈ పుస్తకం శీర్షికను గురించి రెండుమాటలు. దీన్ని కవి 'గొర్రిల్లా' అన్నారు. ఇంగ్లీషు అనువాదంలో మొదటినుంచి చివరి వరకు గెరిల్లా (Guerilla) అని వాడారు గొరిల్లాకు గెరిల్లాకు ఏ సంబంధమూ లేదు. అసలు 'గొరిల్లా'నే గాని 'గొర్రిల్లా' లేదు. గెరిల్లా సైనికదళం. దాన్ని గెరిల్లా అన్నా పరవాలేదు. 'ఫోర్స్' కోసం గొరిల్లాను 'గొర్రిల్లా' అన్నా తప్పులేదు గాని, గెరిల్లా అన కూడదని శేషేంద్రగారికి సూచించాను. సహృదయంతో వారు దానిని తీసుకొని పుస్తకంలో ఈ విషయాన్ని దిద్దుకున్నారు.

అద్దేపల్లి రామమోహనరావుగారు 'నా దేశం నా ప్రజలు' గూర్చి 'మీ కావ్యం ప్రతి పంక్తిలో కవిత్వం ఉంది' అని ఒప్పుకుంటూనే 'మీది అనుభూతి ప్రధానమైన ధోరణి. సామాజిక చైతన్య ప్రధానమైనదికాదు...మీ కవితలో అక్కడక్కడ సామాజికోద్దేశాలు ప్రధాన అనుభూతి ప్రవాహంలో ఒదిగినట్లు తోచదు' అన్నారు. గొరిల్లా కావ్యం చదివేవరకు నేనూ అలాగే అభిప్రాయ పడ్డాను. కాని శేషేంద్రశర్మగారు ఈ కావ్యంలో అనుభూతిని విడిచి పెట్టకపోయినా, సామాజిక చైతన్యానికి ప్రాధాన్యం ఇచ్చి ఆ ప్రవాహంలో అనుభూతి ఒదిగేట్లు చేయగలగడం నాకు నచ్చిన మొదటి అంశం. అనుభూతిని పూర్తిగా వదలి సామాజిక చైతన్యం మాత్రమే కలిగిఉంటే అది కేకలుగా తయారవుతాయేగాని కవిత్వం సృష్టికాదు ఈ రెంటికీ సామరస్యాన్ని సాధించిన శేషేంద్రశర్మ గారి కవిత నాలుగు కాలాలపాటు నిలబడుతుందనే నా నమ్మకం, నా ఆశంస.



హిందీ మూలం :
డా. హం. ధీ. సాంకలియా

అనువాదం :
కావలి రాములు

# రావణుని లంక మధ్యప్రదేశ్ లో నుండెను

రామాయణంలో ఉల్లేఖించబడిన రావణుని లంక ఎక్కడున్నదను సమస్యను గూర్చి విద్వాంసులలో లోతైన భిన్నాభిప్రాయాలున్నాయి. కొందరు విద్వాంసులానుసారంగా నేటి శ్రీలంక లేదా సిలోనుయే నాటి రావణుని లంక. ఈ రావణుని లంక మధ్యప్రదేశ్‌లో ఎక్కడో వుండి యుండెనని మరి కొందరి అభిమతం. ఈ విషయాన్ని నేను శిలా – తామ్ర శాసనాల సందర్భములో పరిశీలించుటకు ప్రయత్నించితిని. ఒకవేళ, మనం నేటి శ్రీలంకను లంకగా భావించినట్లయితే మనలో సహజంగా నాలుగుప్రశ్నలు రూపొందును. అవి యిట్లుండును :

1 సిలోను (నేటి శ్రీలంక) అచ్చటి సాహిత్యం, యితిహాసం; పరంపరలో ఎప్పటినుండి 'లంక'గా పిలువబడుతున్నది?

2 ఈ ద్వీపంపై నివసించిన ఆదిమవాసు లెవ్వరు ?

3 బారతదేశపు ఐతిహాసిక వృత్తాంతాలలో లేదా సామగ్రిలో ఈ ద్వీపం 'లంక'యని ఎప్పటి నుండి పేర్కొనబడినది ?

4 అక్కడ నివసించువారిని 'రాక్షస' మొదలయిన పేర్లతో ఎప్పటినుండి పిలువబడెను ?

ఈ సంబంధంలో శిలాశాసనలు, తామ్ర శాసనాల ద్వారా లభ్యమయిన సూచనలు అత్యవసరం. అవి సత్యాన్ని ఎంతో చక్కగా విశదీకరిస్తున్నాయి.

ఇప్పటికి క్రీ. పూ. 200 నుండి క్రీ. శ. 200 వరకుగల శిలా శాసనాలు వెయ్యికి పైగా అన్వేషించబడినవి. వీటిపై డా. పరణవితాన్ 'ఇన్స్‌క్రిప్షన్స్ ఆఫ్ సిలోన్' [సంపుటము—1] అను శీర్షికతో ఒక బృహద్గ్రంథాన్ని క్రీ. శ. 1970 లో ప్రచురించిరి. ఈ శిలాశాసనాలు క్లుప్తముగా ఒకటి – రెండు పంక్తులలో వున్నాయి. వీటి ద్వారా ఉత్తర, పశ్చిమ భారతదేశ ప్రాంతాలనుండి బౌద్ధమత ప్రచారార్థంగా వెళ్ళిన వారిని గూర్చి మాత్రమే తెలుస్తున్నది. ఇంతేగాక, వారి పేర్లు, కులాలు మరియు నాటి ధార్మిక వృత్తులు కూడా తెలుస్తున్నాయి. ఈ శాసనాలన్నీ సిలోనులో అరణ్యాలతో కప్పబడిన కొండ ప్రాంతము లందలి గుహలలో చెక్కబడినవి. ఈ శాసనాల ద్వారా సిలోను యొక్క పురాతన పేర్లను గూర్చి ఏమీ తెలియటం లేదు

సిలోనునకు సంబంధించిన అతి ప్రాచీన గ్రంథం 'దీపవంశ' ఈ కాలానికి చెందినదే ఇది 'పాలీ'భాషలో లిఖింపబడింది. ఇందులో శ్రీలంక పేర్కొనబడలేదు. అయితే, క్రీ. శ. 4వ శతాబ్దంలో రచించబడిన 'మహావంశ' లో ఈ ద్వీపం 'లంక' అను పేరుతో ఉల్లేఖింపబడింది. ఇందులోనే ఒకచోట 'లంకాపుర' అని కూడా పేర్కొనబడింది. అక్కడ బౌద్ధమతం ఎప్పుడు, ఏ రీతిగా వ్యాప్తి పొందినది, అందులో ఏయే ప్రాంతీయులు ప్రధానమయిన పాత్రలు వహించిరను విషయాలు ఈ 'మహావంశ' అధ్యయనం వలన సహజంగా విశదమౌతున్నవి.

క్రీ. పూ. దాదాపు 250 కి పూర్వం తూర్పు భారతదేశపు పాటలీపుత్ర (పాట్నా) నుండి సిలోనుకు వెళ్ళిన అశోక చక్రవర్తి పుత్రుడయిన మహిందుడు అక్కడ బౌద్ధమతాన్ని స్థాపించాడు. అటు పిమ్మట తూర్పు - పశ్చిమ భారత ప్రాంతాలకు చెందిన నాసిక్, సోపారా, కల్యాణ్ మొదలయిన స్థలములనుండి యాత్రికులు సిలోనుకు వెళ్లసాగిరి.

మహిందునకు పూర్వం సోపారా (బొంబాయికి సమీపం) నుండి 'విజయు'డను ఒక రాజపుత్రుడు సిలోనుకు వెళ్లినట్లు కూడా ఈ 'మహావంశ' లో ఉల్లేఖింపబడింది ఈ విజయుడు 'సింహళీ పుత్రు' డని లోకోక్తి ఉన్నది.

'మహావంశ' లో సిలోన్ను 'సింహళ' మనే పేరుతో ఒక్కసారియైనా సంబోధించక పోయినప్పటికీ ఏదో నానుడి కారణంగా సిలోను భారతదేశంలో 'సింహళ' మనే పేరుతో పిలువబడిందని తెల్లమౌతున్నది. విజయుడు ఎవ్వరో 'సింహ' బిరుదాంకితుడయిన రాజుయొక్క పుత్రుడై యుండునని అనుమానింపవచ్చును.

శిలా శాసన ప్రమాణానుసారంగా క్రీ. శ ప్రథమ—ద్వితీయ శతాబ్దులలో సిలోనుకి పేరు వచ్చివుండును. ఎట్లనగా, అశోకుని గిర్నారు శిలా శాసనంలో సిలోను 'తామ్రపర్ణి' గా పేర్కొనబడినది. [1]

చంద్రగుప్తుని (మౌర్య) కాలంలో భారతదేశానికి వచ్చిన గ్రీకు రాయబారి కూడా సిలోన్ను యిదే పేరుతో పేర్కొన్నాడు. 'తామ్ర పర్ణి' అనునది 'సింహళ మనే పేరు కంటెను అతి పురాతనమయినట్లు స్పష్టమౌతున్నది. ఈ పేరు భౌగోళికమైనట్టిది, ఎట్లనగా, కన్యాకుమారి, రామేశ్వరం, ఉత్తర సిలోను వంటి ప్రదేశాలలో నేల పై భాగం నేటికిని రాగివలె తామ్ర వర్ణంలో నున్నది.

## 'సింహళం' యొక్క ప్రప్రథమ ఉల్లేఖనం

'సింహళ'మనే పేరు ప్రప్రథమంగా ఇక్ష్వాకు రాజవంశస్థుల శిలాశాసనాలలో ఉల్లేఖించబడినది. ఈ రాజవంశం తూర్పు, ఆంధ్ర దేశాన్ని, నేటి గుంటూరు, నెల్లూరు, తూర్పు–పశ్చిమ గోదావరి జిల్లాలను పరిపాలిస్తుండేది. గత శత సంవత్సరాలలో యిచ్చటి అమరావతి, నాగార్జునకొండ మొదలయిన చోట్లలో బౌద్ధవిహారాలు, స్తూపాలు కనుగొనబడినవి. నలువైపుల పర్వత పంక్తులతో సుశోభితమైనట్టి కృష్ణానది తీరాన ఒకప్పుడు నాగార్జునకొండ ఒక విశాలమయిన నగరంగా వెలసియుండెను ఇచ్చట స్తూపాలు, విహారాలేగాక, రోమను శైలిలో ఒక క్రీడాస్థలం కూడా నిర్మింపబడి యుండెను. పురాతత్త్వదృష్ట్యా భారత దేశంలో నింతటి పురాతనమైన క్రీడాస్థలం యిదొక్కటే. రామాయణ సుందరకాండమందలి లంకలో క్రీడాస్థలమున్నట్లు పేర్కొనబడినది. అదిదే క్రీడాస్థల కారణంగా లేదా యిలాంటిదే వేరో క్రీడాస్థల కారణంగా చేర్చబడింది. నేను నా స్వాధ్యయనానుసారంగా సుందరకాండలో నధికభాగం ప్రక్షిప్తమని అంటాను. ఇక్ష్వాకు రాజులకు, రాణులకు బౌద్ధమతంపట్ల ఆదరాభిమానాలుండేవి అందువల్ల, వారు స్తూపాలు, విహారాలు కట్టించియుండిరి. ఇచ్చట లభించిన అనేక శిలాశాసనాలద్వారా యిది వెల్లడి అవుతున్నది. ఒక సింహళరాజు బౌద్ధ భిక్షువులు వుండుటకు మరియు బుద్ధభగవానుని ఆరాధనార్థంగా విహారాలు, చైత్యాలు కట్టించినట్లు ఒక శిలాశాసనం తెలుపుతున్నది.[2] ఇట్లు స్పష్టంగా పేర్కొనటంద్వారా సిలోనుకు ఒకపేరు 'సింహళ'మని వచ్చినది ఇదే కారణంగా అక్కడి ప్రజలను, వారి భాషను 'సింహళీయులు', 'సింహళీ' అని కూడా పిలువబడెను. ఈ భాషపై పాలీ ప్రభావమధికం. కావున దీన్ని మనం భారతీయ భాషగా పరిగణించినచో తప్పుకాదు.

క్రీ. శ. 3వ శతాబ్దమునకు తరువాత భారతదేశానికి వచ్చిన చైనా యాత్రికులలో ఫాహియాన్, యువాన్‌చ్వాంగ్, ఇత్సింగ్‌ల యాత్రా వృత్తాంతాలు లభిస్తున్నవి ఈ ముగ్గురూ యాత్రికులు సిలోన్ను 'సింహళ'మనే పేరుతోనే ఉల్లేఖించారు, అనగా క్రీ. శ 8వ శతాబ్దం వరకు సిలోను యిదే పేరుతోనే భారతదేశంలో సంబోధించబడుతుండేది.

## 'లంక' ఒక దేశంపేరు

'సింహళ'మను పేరుతోపాటు సిలోనుకు 'లంక' అనే పేరు బహుశా మొట్టమొదటి, దేశ్యనామం–కూడా ఉండేది. మహానామా శిలాశాసనంద్వారా మనం యిట్లు చెప్పవచ్చును.[3] ఈ శిలాశాసనం క్రీ. శ. 588–89 నాటిది ఈ రాజు బౌద్ధ గయా విహారంలో ఒక సుందరమైన ఆలయాన్ని కట్టించాడు. సిలోనుకు 'లంక' పేరుగాక, 'ఆమ్రద్వీప'మనే పేరు కూడా ఉండేదని యీ శిలాశాసనం వలన విశదమౌతున్నది

బౌద్ధగయాలో వేరొక శిలాశాసనం కూడా లభించినది. దీనిమూలంగా ప్రఖ్యాతకీర్తి శ్రమణుడు లంకా రాజవంశీయుడని తెలుస్తున్నది.

రమారమి 500 సంవత్సరాల పిదప ఢాకా జిల్లా (బాంగ్లదేశ్)లోని 'బేలావా' పేరుగల గ్రామంలో భోగవర్మ తామ్రశాసనం లభ్యమైనది. ఈ తామ్రశాసన కాలం దాదాపు 1200 క్రీ శ. నాటిది ఈ శాసనంద్వారా ఎవ్వరో పురుషోత్తముడు లంకపై దండెత్తి అక్కడి రాక్షసులతో యుద్ధంచేసి వారిపై తన ఆధిపత్యాన్ని స్థాపించుకొన్నట్లు మొట్టమొదటిసారిగా తెలుస్తున్నది.

ఇది మొట్టమొదటి ఐతిహాసిక సాక్ష్యం, దీని ఆధారంతోనే నేటి సిలోను 'లంక'యని, అక్కడి ప్రజలు 'రాక్షసు'లని చెప్పవచ్చును.

## 'రాక్షస' శబ్ద ప్రయోగం

'రాక్షస' పేరుతో ఏ జాతీలేదు, లేకుండెను. రెండు దేశాలకు మధ్య యుద్ధం సంభవించినప్పుడల్లా యీ శబ్దం వాడుకలో కొచ్చేది రెండవ ప్రపంచయుద్ధ సందర్భంలో ఆంగ్లేయులు హిట్లరును 'రాక్షసుడు' (DEMON) అని పిలిచేవారు

ఆనాటి తమిళనాడు, సిలోన్‌ల చరిత్రను అధ్యయనం చేసినచో చోళరాజులు సిలోనుపై పదే పదే దండెత్తి ఉత్తర సిలోన్ను జయించినట్లు స్పష్టంగా తెలుస్తున్నది. మరియు నాటినుండియే తమిళులు అక్కడి వారిని 'రాక్షసు'లని పిలువసాగిరి. (ప్రస్తుతమిప్పుడు సిలోనులో యిదే తమిళులు, ఆదిమ సింహళీయులకు మధ్య గృహ–కలహం రేకెత్తినది. వీరు ముఖ్యంగా తూర్పు–పశ్చిమ భారత ప్రాంతీయులు. వీరు స్వయంగా తాము 'ఆర్యుల'మని చెప్పుకొంటున్నారు.)

ఈ చోళవంశపురాజుల కాలమున రామేశ్వరంలో ఒక శివాలయం నిర్మించబడినది. రామాయణంలోని ఉత్తరకాండలో రాముడు యిలాంటి ఆలయంలోనే శివపూజచేసి, బ్రహ్మహత్య పాపంనుండి–రావణుడు బ్రాహ్మణుడు(?) గనుక–ముక్తి పొందినాడు. ఈ భాగం (అంశం) ప్రక్షిప్తం కావున సంపాదితమైన కూర్పు (Edited Edition) నుండి దీన్ని తొలగించబడింది, యిట్లు చేయుట సముచితం.

సంక్షిప్తంలో నేమనగా, క్రీ. శ. 6వ శతాబ్దమునకు పిమ్మటనే సిలోను 'సింహళం', 'లంక' పేర్లలో భారతదేశంలో పిలువబడినది. తదుపరి కొన్ని శతాబ్దములకు పిదప అక్కడ నివసించువారు 'రాక్షసు'లని కూడా వాడుకలోకొచ్చినది.

ఈ అభిప్రాయం మరొక విధముగా ఎంతో స్పష్టంగా దృఢమౌతున్నది, అదీ తామ్రశాసనాల మూలంగానే.

క్రీ. శ. 500–700ల మధ్య కాలంలో దక్షిణ గుజరాతు, మహారాష్ట్ర, కర్ణాటక ప్రదేశాలు చాళుక్యుల పరిపాలనలో నుండేవి. వారి తామ్రశాసనాలలో యీ రాజులకు 'పశ్చిమ సముద్రాధిపతి' అను బిరుదు యివ్వబడెను. అటు పిమ్మట యీ విశాలమైన ప్రదేశం రాష్ట్రకూటుల పాదక్రాంతమైనది. సుమారు 200 సంవత్సరముల పరిపాలన తరువాత యీ సామ్రాజ్యం ఛిన్నాభిన్నం కాసాగింది. అందులో కొంతభాగం శిలాహారులనబడే రాజులకు లోబడింది, మరికొంతభాగం కదంబ రాజవంశీయుల అధికారంలో క్కొచ్చినది ఈ రెండు రాజవంశములకు మధ్య మారు మారు యుద్ధాలు జరిగేవి. ఇట్టిదే ఒక యుద్ధ–వర్ణనలో శిలాహారరాజు 'గోవా'ను జయించగా అతడు "నిఃశంకలంకేశ్వర"యను బిరుదు నొందెను మరొక తామ్రశాసనంలో శిలాహార రాజు తాను సింహళ దేశపు వంశస్థుడనని ఎంతో గర్వంగా చెప్పకొంటున్నాడు.

సింహళవంశస్థుడైన, లంకాధిపతియైన యీ శిలాహార ముమ్మనితుడు కదంబ రాజగు షష్ఠదేవుని ఓడించాడు. ఈతడు గర్వితుడై 'లంకను జయించుటకు నేను వారధిని కట్టలేదు, వానరుల సహాయం పొందలేద'ని పలుకుతున్నాడు.

ఎది–పదకొండవ శతాబ్దములలో గోవాద్వీపం 'సింహళం', 'లంక' పేర్లతో పిలువబడుతుండేదని యీ తామ్రశాసనాల ఉల్లేఖనాలు స్పష్టంగా ఋజువు చేస్తున్నాయి.

దీనికంటెను ప్రధానమైన రెండవ నిష్కర్ష మేమనగా– క్రీ. శ. 7వ శతాబ్దంనుండి 10వ శతాబ్దంవరకు రామాయణం దక్షిణాపథమునకు వ్యాపించినది, యీ కారణంగా యిలాంటి ఉల్లేఖనాలు ముందుకు రాసాగినవి

ఇక మూడవ నిర్ణయమేమనగా–"లంక" శబ్దానికి ముండారీ భాషానుసారంగా మూలార్థం "నది లేదా సముద్రం, లేదా సరస్సులోని చిన్నని దిబ్బ, లేక దీవి" లేదా "ఎత్తయిన విడి భూభాగం"గా ప్రయోగించబడుతుండేది. నేటికిని ఆంధ్ర ప్రదేశంలోని గోదావరి నదియొక్క విస్తీర్ణమైన, నున్నని డెల్టా ప్రదేశాలపైగల యిలాంటి చిన్నని మెరకలను 'లంక' లేదా 'లక్క'యని పిలువబడుతున్నది.

నిజమైన లంక మధ్యప్రదేశ్‌లో నుండవచ్చునని నేనూ, మరికొందరు పరిశోధకులూ అనుమానిస్తుండేవారం. ఈ అనుమానమును బలపరచుటకు రెండు తామ్రశాసనాలు లభ్యమైనవి. ఆంధ్ర–ఒరిస్సాల సరిహద్దులోనున్న సోనపూరు గ్రామంనుండి దొరికిన తామ్రశాసనంయొక్క ఉల్లేఖన ప్రకారం అప్పటి రాజు కోసలవంశీయుడైనట్లుగాను, అతడు 'పశ్చిమ లంకాధిపతి'యను బిరుదాంకితుడయినట్లు స్పష్టమౌతున్నది. ఈ తామ్రశాసనం సుమారు 1000 క్రీ. శ. నాటిది.[4] రెండవ తామ్రశాసనం విక్రమ సంవత్ 1760 నాటిది.[5] ఇది చాలా తరువాత కాలానికి సంబంధించినప్పటికిని ఎంతో ముఖ్యమైనది. దీనిద్వారా దండకారణ్యం బస్తర (నేటి బస్తర్ జిల్లా, మధ్యప్రదేశ్) దేశానికి సమీపంలోనుండి యుండెనని తెలియుచున్నది.

నాగార్జునకొండ, బౌద్ధగయాల శిలాశాసనాలు మరియు బాంగ్లాదేశ్, కోంకణ్, మధ్యప్రదేశ్‌ల తామ్రశాసనాలు ఐతిహాసిక సత్యంవైపుకు మన దృష్టిని ఆకర్షించుకొంటున్నాయి. అంధ విశ్వాసాలను వదలి, కల్పితమైన, అసంభవమైన ఘట్టాలను విస్మరించి సత్యాన్వేషణ సల్పుటయే ఐతిహాసిక సత్యంయొక్క లక్ష్య

నేటికి రెండు–రెండున్నరవేల సంవత్సరాలకు పూర్వమును, తరువాతను సముద్రమార్గం ద్వారానే సిలోనుతో సంబంధముండేది. తూర్పునవున్న పాట్నా, తామలూక్ (తామ్రలిప్త)నుండి యాత్రికులు జలయానాలలో ప్రయాణించి సిలోనుయొక్క ఉత్తరతీరపు రేవున దిగే వారేకాని, మహారాష్ట్రం, కర్ణాటక, తమిళనాడులగుండా వెళ్లేవారు కాదు.

సిలోనుపై దండెత్తవలెనన్నచో తమిళనాడు రాజులకు మాత్రమే సాధ్యంలోనుండేది. ఈ కారణంగా క్రీ. శ 1000కి ముందును, తరువాతను కూడా యిలాంటి దండయాత్రలు చేయబడినవి. వీటి వర్ణనలే /రామాయణంలో చేర్చబడినవి మరియు అక్కడ నివసించు ప్రజలను 'రాక్షసు'లని పిలువబడినది

## అధో జ్ఞాపికలు:

1 హల్ చర్చ్, ఇన్స్క్రిప్షన్స్ ఆఫ్ అశోక్. సంపుటం–1, పుట–3.

2 ఎపీగ్రాఫియా ఇండికా సంపు. 20; 1929–30, పుట–3.

3 ఫ్లీట్, బౌద్ధగయా ఇన్స్క్రిప్షన్స్ ఆఫ్ మహానాయా, సంవత్సరం–269, గుప్త ఇన్స్క్రిప్షన్స్, పుట–274.

4 బి. సి. మజూమ్దార్, సోనపూర్ ప్లేట్స్ ఆఫ్ కుమార్ సోమేశ్వర్, ఎపీగ్రాఫియా ఇండియా, సంపు 12, పుట. 239.

5 హీరాలాల్, దాంతీవాడా ఇన్స్క్రిప్షన్స్ అఫ్ దిక్‌పాల్‌దేవ్, సంవత్ 1760; ఎపీగ్రాఫియా ఇండికా, సంపు. 12, పుట. 247.

శ్రీ పి. రామకృష్ణారెడ్డి

# మూడు గొప్ప కథలు

కథలు వ్రాయడం చాలామంది కథకుల విషయంలో చాలా సులభం. మరి కొంతమందికిమాత్రం సులభంకాదు. 'కంటికి కనిపించిందంతా కవితగా వ్రాసేస్తున్నాను' అని వొక కవి అన్నట్లూ, కనిపించిందల్లా కథగా అల్లగలిగినవాళ్ళు మొదటివాళ్లు. కదిలించిందే కథగ చెప్పేవాళ్ళు తరువాత చెప్పిన వాళ్లు. అట్లా...కదిలించిందే కథగా చెప్పిన వారు ఆర్. ఎస్. వసుంధరాదేవిగారు. ఆమె వ్రాసిన ప్రతికథకూ, తెలుగు కథ యెంతో కొంత పెరిగింది. సాధారణమైన వేషంతోనే అసాధారణమైన వ్యక్తిత్వాన్ని ప్రదర్శిస్తుంది 'ఆమె కథ. ఇట్లా అంటే, ఆమె కథలన్నిట్నీ వొకే మోతాదులో మెచ్చుకుంటున్నానని అర్థంకాదు. నాకు చాలా యిష్టమైనవీ, అంతగా నచ్చనివీ, వెతికితే...వొకటి రెండు అసలు నచ్చనివీ వుండొచ్చునన్న సంగతి దాచుకోనవసరంలేదు. స్పష్టం చెయ్యవలసిన సంగతి. అయితే, కథను గుర్తించినా, గుర్తించకపోయినా, కథకురాలిని గుర్తించకపోవడం జరగదు. కథకు మూలమైన అనుభవంపట్ల ఆమె పరిశీలననూ, నిజాయితీని, ఐక్యతనూ తోసిపుచ్చడం యే సహృదయునికీ సాధ్యం కానిపని.

కథలు వ్రాయడంలో ఆమెకు ప్రత్యేకత వున్నట్టే, వాటిని పత్రికలకు పంపడంలోనూ పత్యేకతుందనిపిస్తుంది. ఈ ప్రత్యేకత గూడా యాదృచ్ఛికంగా వచ్చిందికాదు. రచయిత్రిగా తనకున్న 'కాన్షస్‌నెస్'వల్లా వచ్చిందే. ఆమె కథల్ని యెక్కువగా ప్రచురించగల్గింది 'భారతి'. ఇంచుమించు యేడెనిమిదేళ్ళుగా ఆమె కథల్తో నాకు పరిచయముంది. అంతకుముందు ఆమె యెన్ని కథలు వ్రాసిందో తెలీదు ఆ కథలు చదవడమెట్లా? ఈ నవలల మార్కెట్టులో కథాసంకలనాలు రావడం అరుదు. అందులోనూ 'పాపులర్ రైటర్' కాని వసుంధరగారి కథల్నువేసే ప్రచురణ వ్యాపారి యెవరు? ఈ సమస్యకు జవాబుగా యిన్నాళ్ళకు 'గాలిరథం' అన్న ఆమె మొదటి కథాసంకలనం వచ్చింది. మిగిలిన కథలుగూడా పుస్తకాలుగా వచ్చే అవకాశం తెలుగు సాహితీ లోకానికి లభ్యం కావాలని ఆశించడం అసందర్భం కాదనుకుంటాను. 'గాలిరథం' కథాసంకలనంలోనించీ నాకు నచ్చిన మూడు కథల్ని మాత్రమే ప్రస్తుతం ప్రస్తావించదలుచుకున్నాను ఇది విమర్శనా వ్యాసంకాదు. కనీసం సమీక్ష గూడాకాదు. పాఠకుల్తో ప్రమేయంలేని వొకరకమైన తీర్పులుగాకాక, పాఠకుల్తో కలిసి ఆలోచిస్తున్నట్లుగా వుండాలనుకున్నది నేను అనుకున్నట్లుగాక, అనుకోనట్లుగానే యీవ్యాసం రూపొందినట్లు యెవరికైనా అనిపిస్తే...అది నాచేతగాని తనంగానే అంగీకరిస్తాను

'గాలిరథం' కథల సంపుటిలో మొదటిదీ, పెద్దదీ అయిన కథ 'పెంజీకటి కవ్వల' అన్నది. 'మృత్యువు కవతల యేమిటి?' అన్న మానవుని అనాది ప్రశ్న అది అయితే, యీ కథలో ఆ ప్రశ్న, అందుకు లభించిన జవాబూ శుష్కవేదాంత పరమైనవికావు. వాస్తవ జీవితానుభూతుల అంచనానించీ, సంపూర్ణ మానవతా చైతన్యంనించీ, అన్వేషణనించీ, సహజంగా పుట్టిన జిజ్ఞాసా,పొందిన సమాధానం! తపస్సుచేసి...తనకు తానుగా ముక్తిని సాధించుకోడం. ఆ ముక్తి ఆముష్మికమైందికాదు. పూర్తిగా ఐహికమైంది జీవితాన్ని అనాసక్తితో చూడటంకాదు, ఆత్మీయంగా ప్రేమించగలగడం. సృష్టితో ఐక్యమై, చావుపుట్టుకల కతీతమైన 'వునికి'ని సాధించుకోడం. స్వార్థానికి సంకేతమైన చావుభయాన్ని నిర్జించడం.

ఆ వూరి పేరేమిటో తెలీదు, అవసరంలేదు. అన్ని పట్టణాల వంటిదే అదీ. అక్కడ...శ్రీనగర్ కాలనీలో జయలక్ష్మి తన కుటుంబంతో వుంది. భౌతికంగా ఆమెకేలోపం లేదు. ఆమెకే కాదు, ఆ కాలనీలో వాళ్ళెవరికీ ఆ లోపముండడానికి వీల్లేదు, అది దేవలోకం. అక్కడ నివసించేది మనుష్యమాత్రులుకారు. 'సామాన్యుడు కోరుకునే కోరికలూ, కనేకలలూ!' జీవితం వెనకాల చావున్నట్టే, ఆ కాలనీ గోడల కవతల శ్మశానముంది. ఆ కాలనీకున్న **లోటు** అదీ! 'ఒక్కోసారి యేమరుపాటున సంజె వెలుగుల్ని చూసిన అమ్మగార్లు వాటిని కాష్టజ్వాలలని ఝడుసుకుని తలుపులు మూసుకోడంకద్దు.' ఈమాట, కథను కవిత్వస్థాయికి పెంచడమేకాదు వాళ్ళలోవున్న (అంటే మనుషుల్లోవున్న) మృత్యుభయభ్రాంతిని ప్రస్ఫుటం చేస్తోంది. అంత సుఖజీవితాలనూ మృత్యుస్పృహ భయంలో ముంచుతుందనడానికే, సంజవెలుగుల సౌందర్య దర్శనానికి మారుగా భయంకరమైన కాష్టజ్వాలలను చూస్తారనడం. 'ఆ కాలనీలోవుండటం వల్ల, డాక్టర్ సీతారామారావు క్లినిక్‌కు వెళ్ళడానికీ, కూతురు రాధ కాలేజికి వెళ్ళడానికీ దూరంగావుండి అసౌకర్యంగా వుంది. జయలక్ష్మి పట్టుదలవల్లనే అక్కడున్నారు. అక్కడే వుండాలని యెందుకనుకుందో ఆమెకూ తెలీదు!' మనిషిని వెంటాడుతోన్న మృత్యుభయం, భయంనించీ పుట్టిన ఆసక్తి అది. ప్రాణికి సహజమైన చావుని చూసి భయపడిపోవడం అసహజమైంది. అందుకే ఆమె ప్రవర్తన అసహజంగా వుంటుంది. 'ఒక్కోసారి ఆమెకు చాలా వుత్సాహంగా వుంటుంది. కనిపించిన ప్రతిప్రాణిమీద ప్రేమ పెల్లుబికి వస్తుంది. మరోసారి మనస్సు నిస్పృహతోనిండి, కృంగదీస్తుంది. ఆమె మనస్సు యెప్పుడూ వెతుక్కుంటూ వుంటుంది దేన్నో పట్టుకోవాలన్న నిరంతర ప్రయత్నంలో వుంటుంది.' జయలక్ష్మి ఆంతరిక ఘర్షణనూ, అన్వేషణనూ గురించి రచయిత్రి

అద్భుతమైన పోలిక చెబుతుంది. జీవితానికి అర్థం లక్ష్యమయి, అతి ముఖ్యమైన 'అది' క్షీరార్ణవశాయి అయిన విష్ణువులాగా దుఃఖ సముద్రం మధ్యన అందకుండా నిలిచివున్నది. జీవితం క్షీరార్ణవం, జీవితానందరూపం విష్ణువు. ఇక్కడీ పోలిక పాఠకుని వూహను పెంచడానికి ప్రయత్నిస్తుందిగానీ, అర్థన్నెత్తి పురాణాల్లోకి విసిరెయ్యదనుకుంటాను. రచయిత్రిమీద ఆస్తికత్వపు పట్టు లేదన్న అర్థం కల్పించడానికి యిట్లా అనుకోనవసరంలేదు. రచయిత్రి తాత్త్వికతలో భగవంతుడికూ్కడా స్థానముంది. ఆమె విశ్వాసం, యింకొకరి విశ్వాసాన్ని చెడగొట్టడానికి అదేపనిగా ప్రయత్నించనప్పుడు జీవితాన్నీ, దాని వాస్తవికతనూ వక్రీకరించి చూపనప్పుడు యెవరికీ అభ్యంతర ముండవలసిన అవసరంలేదు

ఒక్కసారి ఆమెలో వున్నట్టుండి యేదో భయం పుట్టుకొస్తుంది. ఏదో పోతున్నదన్న బాధ పొంగివస్తుంది భర్త, పిల్లలూ, అందరూ బాగున్నారని గుర్తు చేసుకున్నాకనే అది శాంతిస్తుంది 'వాళ్ళకు ... యేమైనా జరిగితే వాడు దేవుడేకాదు.' నాశనమైపోతాడు, వాడి సృష్టి మసైపోతుంది...వాడు ...' ఇది ఆమెలోని మృత్యు భయ తీవ్రతకూ, స్వార్థంయొక్క పరాకాష్ఠకూ నిదర్శనం. పెద్దకూతురు రాధికకు పదహారేళ్ళు. అరటి బోదెలాగా, నవనవలాడుతూ యేపుగా పెరిగింది. చురుగ్గా, ధీమాగా, ఆకర్షణీయంగా వుంటుంది 'తన కోరికలకూ ఆశయాలకూ మూర్తి కట్టినట్లున్న రాధికను చూసి పొంగిపోతుంది' జయలక్ష్మి ఆరేళ్ళ చంద్రికమాత్రం ఆరోగ్యవంతమైన పెరగుదలతోలేదు. మెదడులో యేర్పడిన యేదో లోపంవల్ల తెలివి లోపించింది. శారీరకంగా మూడేండ్ల యెదుగుదలతోవుండి చొంగ/కార్చుకుంటూ వుంటుంది. ఆ పిల్లను చూస్తుంటే జయలక్ష్మికి 'జాలి, దుఃఖం కోపం' కలుగుతాయి ఏ సాకుతోనో కొట్టి, కసరి కళ్ళముందు నించీ తరిమేస్తుంది. రాధికను చూస్తుంటే తన కోరికలకూ, ఆశయాలకూ మూర్తి కట్టినట్లయి పొంగిపోయేజయలక్ష్మి చంద్రికనుభరించలేదు తన మనో వైకల్యానికీ, అపరిణతకూ, భయానికీ ప్రతిరూపంగా కనిపిస్తూ, చంద్రిక దగ్గరగా వుంటే అలజడిలోముంచే తనను తనే భరించలేదు· దూరంగా తరిమితే కానీ తట్టుకోలేదు. అయితే, ఆమె మాతృ హృదయం లేనిది కాదు. చంద్రికమీద భర్త చూపే ఆదరణకు భర్తమీద ప్రసన్నత చూపుతుంది తనబాధ చంద్రికను గురించిందే కాదని ఆమెకూ తెలుస్తుంది 'ఈ మాటలన్నీ వూరికే అంటున్నాను అంతా అసత్యం' అనుకుంటుంది. తనను తాను చేసుకుంటున్న మోసానికి ఆమె యింకా భయపడిపోతుంది, యింకా ఆవేశపడుతుంది 'పిల్లలంటే అక్కర్లేదు, యేం మనిషి మీరు! మీ దగ్గర నిజం లేదు' అని తన లోపాన్ని భర్తమీదనెట్టి సమాధాన పడాలని చూస్తుంది.

సర్కస్‌లో ఫీట్సుచేసే ఆరేళ్లపిల్లను చూసినప్పుడు విషాదం. పద్మ చెడ్డీలోవున్న తేలుకుట్టి యేడ్చి యేడ్చి ఆ సంగతి గమనించగలవాళ్లు లేకుండా చచ్చిపోవడం తలుచుకుంటే, గుండెలో దుఃఖ భారం. ఇక్కడ, జయలక్ష్మికి తటస్థపడిన రెండు దుఃఖ సన్నివేశాలూ యిద్దరు పిల్లలకు సంబంధించినవే. వీటిపట్ల రచయిత్రికేమైనా ప్రత్యేకమయిన వుద్దేశ్యముందా? వుందనిపిస్తుంది. ఆ యిద్దరు పిల్లల్ని చూస్తోంటే జయలక్ష్మికి తన చిన్నకూతురు జ్ఞాపకం రావడం సాధారణ స్మృతి. పాత్ర ఆంతరిక స్మృతులు వేరనిపిస్తుంది. సర్కస్‌లో పాప ఫీట్స్ మృత్యు భయాన్నీ, తేలు కుట్టి పాప చనిపోవడం మృత్యు బాధనూ స్ఫురింప జేస్తుంది. తను తీసుకుంటున్న 'రిస్క్'ను గురించి సర్కసు పిల్లకు తెలీదు. తను పడుతున్నబాధను పోల్చుకుని, చెప్పుకునే జ్ఞానం పద్మకులేదు. తను అనుభవిస్తున్న అవ్యక్తమైన దుఃఖాని కర్థం జయలక్ష్మికీ తెలీదు. ఇక్కడే ఆమెకు ఐక్యత వుంది కాన్సర్ ఆసుపత్రిని చూడటంతో ఆమె మనసులోని ఆఖరు దుఃఖపు మీటను నొక్కినట్లయింది. వెంకటప్ప కుటుంబంలో బ్రతికినవాళ్ళు పల్లెలోనూ, చచ్చినవాళ్ళు చింతల దొడ్లోనూ వుంటారు. వాళ్ళకు చావుకూడా బ్రతుకులోనిభాగమే. వెంకటప్పను బెంగుళూరు కాన్సర్ ఆస్పత్రిలో చేర్చడానికి సీతారామారావు పోతుంటే జయలక్ష్మి గూడా పోతుంది. కాన్సర్ ఆస్పత్రి పక్కనే మెదడు నరాల వ్యాధుల ఆస్పత్రి వుంది. 'అక్కడ చంద్రికను చూపించాలన్నది.' అంతకంటే అసలువిషయం యింకోటుంది జయలక్ష్మికి అది ... మృత్యువుకు దగ్గరగా వుండి పరిశీలించడం, మృత్యు రహస్యం తెలుసుకోడం. అందుకే... మెదడు నరాల వ్యాధుల ఆస్పత్రిలో చంద్రికను చూపించినట్లు కథలో ప్రసక్తం కాలేదు కాన్సర్ఆస్పత్రి చూసొచ్చిన తర్వాత చావుభయం యింకా పెరుగుతుంది. కాన్సర్ భ్రమ ఆమెలో వొకచోట ఆపితే యింకోచోట పెరుగుతుంది. 'వూరగాయలో బూజు పెరిగినట్లు' ఆమె గుండె దెబ్బతిన్నట్లు కార్డియాలజిస్ట్ చెబుతాడు. ఆమెకు తన జీవితంపట్ల విపరీతమైన అభిమానమూ, ప్రపంచంపట్ల కసి యేర్పడుతుంది. 'నేను లేకున్నా వీళ్ళందరూ ఇలాగేవుండి భోంచేసి, తిరుగుతూ, నవ్వుతూ వుంటారా? ఈ చెట్లు యిలాగే పచ్చగా వుంటాయా? ఇండ్లూ, వూరూ, భూమీ, ఆకాశం...ఈ ఆకాశం యింత స్వచ్ఛంగా, నీలంగా, అనంతంగా వుంటే దాన్ని చూస్తూ ఈ క్రింద నేనుండనా! నాకంటే ముసలివాళ్ళు, అప్రయోజకులు, రోగిష్టులు, మూర్ఖులు యిందరూవుంటే నేను మాత్రం లేకుండా పోవాలా! ఎంత అన్యాయం! నేను లేకుంటే యిదంతా యెందుకు? అంతా నశించిపోవాలి...నశించిపోతుంది.' నేను లేకపోతే ప్రపంచం నాశనంకావాలనే 'అహం'నించీ, 'నేనంటే యెవరు?'అనే జిజ్ఞాసలోకి వస్తుంది శరీరంకాదు, మనస్సు కాదు, అనుభవం కాదు, యిచ్చ కాదు,మరి'నేను'యెవరు? యెవరో తెలీదు.కానీ,బ్రతుకంటేయేమిటో తెలిసింది. చావును గురించిన భయంతో నిరంతర జీవితాన్ని హింసించుకోడంగాక, చావు స్పష్టమైన తర్వాత జీవితాన్ని అభిమానించ గలిగింది ఒకసారి ఆమె పూజగదిలో దేవుడిముందు పెద్ద బల్లి పడి వుండటం చూసింది. ఆమెకు బల్లి అంటే చెప్పరాని భయం, పట్టరాని అసహ్యం. దాన్ని తరిమెయ్యాలని చప్పుడు చేసింది, పుల్లతో కదిలించింది. అది కదల్లేదు. దాని చూపులో భయంలేదు, ప్రాధేయపడటం లేదు 'నా పాటికి నన్ను చావనీ' అంటున్నట్లు ఆమెకు స్పష్టంగా తెలిసింది. దాని పక్కనే అన్నం

మెతుకులూ, నీళ్ళూ పోసింది. అప్పుడు ఆమెకు బల్లి అంటే భయం లేదు, అసహ్యం లేదు మృత్యు భయం కూడా ఆమెకు బల్లిని గురించిన భయం వంటిదే. పరిశీలించి చూసి, యదార్థం తెలుసుకుంటుంది ఇంటి వెనక శ్మశానాన్ని చూస్తే ఆమెకు జుగుప్స కలగలేదు. మిట్ట పల్లాలూ, తుప్పలూ, బూడిద కుప్పలూ సన్నని యేరూ అంతా సూర్యకాంతిలో మామూలుగా వున్నది. ఊళ్ళో వీచే గాలి యిక్కడా వీస్తున్నది. ఊళ్ళో ప్రకాశించే సూర్యుడు ఇక్కడా ప్రకాశిస్తున్నాడు.

ఎక్కన్నించో తమాషబంగ్లావాడి తాళాలశబ్దం వినిపిస్తుంది. 'టింగ్ టికా ... టింగ్ టికా...' విశ్వమంతా వ్యాపించి నవ్వుతూ, నర్తిస్తూ ఆమె గుండెల్లోకి చేరి అక్కడ సంతోషంతో నాట్యం చెయ్యడం ప్రారంభించింది. ఆ తాళాల శబ్దం క్రమబద్ధమైన, నిర్ణీతమైన సృష్టిలయ. ఆ సహజత్వంతో ఐక్యం కావడంతో, విషాదం తొలగి ఆనందం చేరుకుంది.

మొత్తం కథకు సూత్రప్రాయమైన వ్యాఖ్యానంగా, తమాష బంగ్లావాన్ని ప్రవేశపెట్టడంలో కథలో యెక్కడా కనిపించని వొక కృత్రిమత్వం కొంచెంగా తొంగిచూసినట్లు అనిపిస్తుంది.

'అందాల లోకంలో
ద్వంద్వాల శోకం, టింగ్ టికా...టింగ్ టికా
తిండికి బట్టకు రోదనా
నెత్తిన కప్పుకు వేదనా ...'

యీ తమాష బంగ్లావాడు రచయిత్రి సృష్టించినవాడుగా పట్టుబడిపోతాడు. అంతేకాదు, యీ కథలో జయలక్ష్మి పడిన బాధకూ, ఆ బాధను ఆమె పరిశీలించినతీరుకూ, ఆఖరున ఆమె పొందిన సమాధానానికీ, యీ తమాషా బంగ్లావాడి చిత్రణ సరైన సమన్వయంగా వుందానిపిస్తుంది. 'ఇందులో ప్రకటితమయ్యే గొప్ప మెళుకువ లోకమంతా వొకబొమ్మలాటేనన్న వేదాంతార్థ నిరూపణ కోసం తమాషా బంగ్లావాన్ని ప్రవేశపెట్టడం' అని యీ పుస్తకానికి పరిచయం వ్రాసిన మధురాంతకం రాజారాంగారు అన్నారు. ఈ కథ వేదాంతార్థ నిరూపణకోసం వ్రాయబడిందిగా అనిపించదు. అదేలయితే, అదంత గొప్ప మెళుకువా అనిపించదు. తమాష బంగ్లావాడిద్వారా 'జీవితమొక తమాషా' అని రచయిత్రి చెప్పదలచుకున్నట్లు అనుకోడంవల్ల రచయిత్రికి అన్యాయం జరుగుతుంది. 'ఒక శరీరంలోని సహజమైన కణాలన్నిటిమధ్యనా వొకప్రాణం, వొక నియమం, వొక సంబంధం వుంటుంది. సంబంధం తప్పిపోయినవి అసహజమైన కాన్సర్ కణాలై అస్తవ్యస్తంగా పెరిగి శరీరాన్ని నాశనం చేస్తాయి. ఈ మానవజాతికూడా యెదుటిమనిషితోనూ, అతని సుఖదుఃఖాలతోనూ, కష్టనిష్ఠూరాలతోనూ సంబంధం కోల్పోవడం మూలాన రోగగ్రస్తమైపోతున్నది' జయలక్ష్మి అంతకు ముందు అనుకున్నదిట్లా. అంటే . మనిషిబొమ్మగా కాక యెదుటి మనిషిపట్ల స్పందన కలిగివుండాలన్న రచయిత్రి అభిప్రాయం స్పష్టమవుతోంది. లోకమంతా బొమ్మలాటగా కాక, అద్భుతమైన, అనుభూతిపూర్వకమైన, ఆనందమయరూపంగా ఆవిష్కరింపబడింది. అందుకు ఆఖరుపదచిత్రాలు సాక్ష్యం.

'వేపచెట్టు కొమ్మలన్నిటిమీదా గోరింకలు వాలి గోలగోలగా అరుస్తున్నాయి. మేఘాన్ని చీల్చుకుని వెలికిరావడానికి ప్రయత్నించిన యెర్రనిమెరుపు, ఆ మేఘపు గుండెలోని లోతుల్నిచూసి మళ్ళీ లోపలికి, వెళ్ళిపోయింది. కొమ్మకొమ్మలమీది గోరింకలు కిందికి కిందికి గెంతుకుంటూ నెమ్మదిగా చెట్టులోపలికి మాయమయ్యాయి. ఈ వెలుగును వున్నంతసేపూ అనుభవిద్దామన్న కోరికతో రెండు గోరింకలుమాత్రం గొంతులుతగ్గించి కబుర్లాడుకుంటున్నాయి. ఆమె మనసునిండా ఆనందం. నేను లేకపోయినా యిదంతావుంటుంది. ఈ మనుష్యులు, చెట్లు, గోరింకలు, సూర్యుడు, ఆకాశం, అన్నీ వుంటాయి అనుకున్నది జయలక్ష్మి ఆనందంగా'.

'నేను లేకుండాపోయినా యీ ప్రపంచం ఇలాగేవుంటుందా? యీ చెట్లు యిలాగే పచ్చగా వుంటాయా ? నేను లేకుంటే యిదంతా యెందుకు ? నశించిపోవాల' అనేస్వార్థంనించీ 'నేను లేకపోయినా యిదంతా వుంటుంది. ఈ మనుష్యులు చెట్లు, గోరింకలు, సూర్యుడు. ఆకాశం, అన్నీవుంటాయి' అని ఆనందించ గలిగిన అమరత్వానికి యెదుగుతుంది జయలక్ష్మి. ఈ కథ చదివి, యెవరైనా యెదిగినట్లు అనుభూతి చెందకపోవడం అసంభవం అనిపిస్తుంది.

* * *

ఈ సంపుటిలో రెండోకథ 'బిడ్డకింద' అన్నది. సుంధర గారి కథల్లో యిది ప్రత్యేకమైందనిపిస్తుంది. వ్యక్తి అంతరంగ ఘర్షణకూ, వ్యక్తిగత అనుభవాలకూ, వాటిప్రభావంతో రూపొందే కుటుంబ జీవితానికి ప్రాధాన్యతయిచ్చి వ్రాయడం ఆమె రచనావిధానంగా అదివరకటి ఆమెకథలు తెలియజేస్తాయి. ఈకథ ఆధునిక ధనిక స్వామ్యవ్యవస్థనూ, దాని దుర్గతాన్నీ సమగ్రంగా నిగ్రహంగా చిత్రిస్తుంది.

ఈ 'సోట్లో వుండి బాగుపడ్డోడు యెవడు ? యిరసాలు దున్ని గుంటక కొట్టి దున్నకం సేసుకుని యింటో వుండే యిత్తనాలు జల్లి వానదేవుడా అంట మొబ్బు దిక్కు సూసుకుంటా కూసుసేవాడు బాగుపడేది యేకాలానికి ? మానాయున కట్టిపోయిన పద్దెనిమిది మూర్ల అప్పు యే కాలానికి తీరేది ! టవునుకుపోయి ఏ పనన్నా సేసి మడిసిగా నిలబడతాను' అని పట్నం చేరుకున్నాడు పోతప్ప. 'కొనమడి, దాన్ని చేత్తే బొమ్మిడీలు గొట్టుకొని పోవాల్సిందే' అని వాళ్ల నాయిన కౌలుకు తీసుకునేవాడే అన్నాడు.

'బతకాలన్న ఆత్రంలో' కొడుకుమాట చెవినేసుకోలేదు తండ్రి. 'ఫలితంగా' అప్పులు తలుచుకుని వురిపోసుకుని చచ్చిపోయినాడు.

పట్నానికొచ్చిన పోతప్పకు రిక్షాతొక్కడంతప్ప మరోమార్గం కనిపించలేదు. పోతప్ప భార్య లచ్చుముకు మాత్రం భయంగానే

వుంది. 'మావా! ఈ రిచ్చా తొక్కి బాగుపడ్డోడు లేడంట. ఆకరికి టీబీ ఆస్పత్రి కెళ్ళాలిసిందేనట. ఎంత మందో రిచ్చాతొక్కే వాల్లురగితం కక్కుకుని టీబీ ఆస్పత్రిపాలయినారంట. యింగేదన్నా పని సూడు' అని గోలెత్తింది. 'యాపని సేసేది? అన్నీ అంతే. గవర్నమెంటు పనులైతే నెలజీతం వత్తాది. సిన్నపనిగ్గూడా అయి దొందలు యెయ్యి లంచంపోత్తె పని, లేకుంటే లేదు. ఎంప్లాయి మెంటు ఆపోసోడి కాన్నించి పనిచ్చే దొరదాక అందరికీ పొయ్యాలి మన కట్టం అక్కర్లేదు గవర్నమెంటోడికి, లంచం కావాలి. పోన్లే... ఈ రిచ్చేనే మనకు శాశవితవా! ఒంటో సత్తువుంది గనుక యిప్పటి అప్పు తీర్చుకని యింగా అంత బూవి కొనుక్కునో, పది జీవాలు జత సేసుకునో మనూరెల్లిపోదామి' అన్నాడు పోతప్ప. లచ్చుము కూడా తమలపాకుల గంప ముందుపెట్టుకుని రోజూ రూపాయో, రెండో తెస్తున్నది. 'దేనికైనా దుడ్లుకావాలి. దుడ్లు!' పోతప్ప లచ్చుమును టవునుకు తెచ్చుకోక ముందు నించే పరిచయ మైనాడు చలపతి, ఒకరోజ పోతప్పకు తనింట్లో అన్నం గూడా పెట్టినాడు 'అతని సొంతభాష చదువుకున్నోళ్ల పుస్తకాల భాష.'

'ఇపటి పరిస్థితుల్లో నిజంగా పనిచేసే వాడికి గుర్తింపు లేదు. సమాజం వాళ్ళ మిద ఆధారపడి నడవడం లేదు పనిచేసే వాడు బ్రతకలేక బాధపడుతుంటే, సోమరులూ మోసగాళ్ళూ, అనినీతిపరులూ యింకా యింకా సంపాదిద్దామన్న మోసాల కుమ్మ లాటలో కష్టపడే వాళను పురుగులకంటే హీనంగా చూపేస్తు న్నారు. ఇప్పటి పరిస్థితులు మనిషిలోని మూలాన్నీ, అభిమానాన్నీ, నేనూ మనిషినన్న జ్ఞానాన్నీ తుడిచిపెట్టేస్తున్నాయి ఇది కష్ట పడేవాళ్ళ సమాజం కాదు, సుఖపడేవాళ్ళదికాదు' అంటాడు చల పతి. 'మనిషి మంచోడే కానీ లావంత లిక్క!' అనుకుంటాడు పోతప్ప

నాలుగడుగుల మందపువి, గట్టి సిమెంటు గోడలు రైలు లైనుకు ఈ పక్కా ఆ పక్కా ఆ బ్రిడ్జిని మోస్తున్నాయి నిజ మైన బలమైనగోడలు. చాకళ్ళు, మంగలి, ఇడ్లీల రాజమ్మ, కళాయిపని చేసే మస్తాను, సారా అంగడి ఇతర చిల్లర వ్యాపారులూ అక్కడే వున్నారు.

'ఏ క్షణాన్నో వచ్చి వొక్కో కుటుంబం దిగుతుంది. ఒక గుడ్డ వేలికలమూట, వొక సంచీ, రెండు కుండలు, వొక లోటా, నీళ్ళు ముంచుకునే డబ్బా తెచ్చుకుంటారు. ఎంత అకస్మాత్తుగా వస్తారో అంత అకస్మాత్తుగామాయమైపోతారు ఒకరోజున ఉకులుక లాడిపోయిన సందు మరునాడు ఖాళీగా వుంటుంది. బారెడెత్తు నల్లని విగ్రహం, కాయకష్టంతో కండల తేరిన వొళ్ళు, పట్టు దలతో బిగుసుకన్న దవడలూ, నవ్వటానికి వుబలాటపడుతూ మెరిసే చిన్నకళ్ళూ, సూనెపెట్టి దువ్విన నిగనిగ క్రాపూ, కట్ బనీనూ, ఖాకీ నిక్కరూ పోతప్ప బ్రిడ్జి కిందరిక్షానిలుపుకుంటాడు పట్నం పోకడలన్నీ అర్థమైన టెర్లిన్ చొక్కా, వాచీ, మెడకు కర్చీఫ్ కట్టడు. టీ నీళ్ళు గూడా అలవాటు లేదు, మంచి నమ్మ కస్తుడుగా పేరుతెచ్చుకున్నాడు ఎనిమిదొందలు బాకీ గూడా వల్లైలో చెల్లు గట్టినాడు. అయితే స్టోరువాళ్ళు వస్తువులు పోతప్ప అమ్మి పెట్టడం చలపతికి సరిపడదు డబ్బెక్కడుంటే అక్కడ దండాలు పెడుతూ బతికే గొర్రెలు తమకూ, మొత్తం సమాజానికీ యెట్లా కీడు చేస్తున్నారో చెబుతాడు.

'లెచ్చర్లు దంచుకోవాలంటే దంచుకో, గొర్లు గొర్లు అంటే మరాదాగారు' అని కోపగించుకుంటాడు పోతప్ప. 'ఈయప్ప సావాసం చాలుసామీ' అని గూడా అనుకున్నాడు. చలపతినాయన యేదో వూళ్ళో కాలేజీలో స్వీపరు అమ్మా నాయినా, అవ్వ, ముగ్గురు మగపిల్లలూ, ఆడపిల్లా వున్న కుటుంబం నాయిన యింట్లో పులి, సిస్టమ్ ప్రకారం జరగాలి. ప్రొద్దున్నే చద్ది తింటే, ఒంటిగంట కొట్టేనే ఇళ్లా అన్నం. రాత్రి యెనిమిదికి మళ్ళా! ఆదివారం వూరి బయటికి పోయి సిల్లలంతా వారానికి సరి పడేట్లు కంప యేరుక రావాలి అబద్ధం దొంగతనం అన్నమాట చెవిని పడకూడదు ఎస్ ఎస్ ఎల్. సి. మంచి మార్కుల్తో పాసై పి.యు సి.లో చేరాలనుకున్న చలపతి కాలేజిలో ఖాళీ అయిన స్వీపరు పనిలో చేరతాడు. తనకంటే తక్కువ మార్కులొచ్చిన వాళ్ళు కాలేజీలో చదువుతూంటే; వాళ్ల కూర్చునే కుర్చీలూ, బల్లలూ తుడిచేవాడు గుండెలో కనపడని గాయం యేర్పడింది. తిండికి జరగని వాళ్ళకు సమానత్వం, స్వాతంత్ర్యం అనేవి వుత్త మాటలు అని తెలుసుకుంటాడు. స్టూడెంట్స్ పార్టీ చేసుకుంటే మిగిలిన తినుబండారాలకు కుక్కలా యెగబడుతున్న తండ్రిని చూస్తాడు ఈ తినుబండారాలకోసం చిన్నప్పుడు ఎదురు చూసిన దృశ్యం జ్ఞప్తికొస్తుంది. ఆవేశంతో ప్రిన్సిపాల్ దగ్గరికి పోయి తననెందుకు ప్యూన్‌గా వేసుకోలేదని అడుగుతాడు. ఖాళీ లేర్పడిన రెండు ప్యూన్ పోస్టుల్లో, ఆర్నెళ్ళుగా తన ద్రాక్షతోటలో వుచి తంగా పని చేస్తున్న వాడి కొకటీ, మూడొందల లంచమిచ్చిన వారికి రెండోదీ యిచ్చినాడు ప్రిన్సిపాల్. స్వీపరు వుద్యోగానికి రిజైన్ యిచ్చేసి ఇంటోనించి వచ్చేసి నాడు చలపతి

'నీకు ఆలోచన జాత్తి అన్నా' అన్ని అనర్థాలకూ అదే కారణమన్నట్లు అన్నాడు పోతప్ప చెప్పా పెట్టకుండా పోతప్ప చెల్లెల బేరమ్మ, మొగుడు అంజనప్ప, ఆరుగురు పిల్లల్తో వచ్చి దిగినారు. అంజనప్ప సోమరి, తాగుబోతు. పోతప్పకు అట్లాంటి వాళ్లంటే అసహ్యం. చలపతి కొన్ని బాకీలు ఎగవేసి, ఎవరికీ తెలీ కుండా పోయినాడు

'లోకమంతా సెడిపోయిందనీ, మరామత్తు సెయ్యాలనీ' కబుర్లు సెపుతాడు ఆఖరికి అప్పులు ముంచేసి వూపిచ్చుకుని పోయినాడు, అనుకుంటే పోతప్పకు కొంత తృప్తికలిగింది. స్టోరు వాళ్లకు వస్తువులు అమ్మి పెడుతున్నప్పు చలపతి అన్నదే నచ్చ లేదు పోతప్పకు తన తప్పును యెత్తి చూపుతున్న అతన్నించి తప్పు కోడానికి 'ఈయప్ప సావాసం చాలుసామి' అనుకున్నాడు రిక్షా తొక్కి అప్పు తీరుస్తానంటే తిరస్కారంగా నవ్వినాడు మానం మార్యాద, కృతజ్ఞతల మీద మోసపోవడాన్ని గురించి చెప్పినాడు వీటన్నిటినీ అంతర్యంలో వొప్పుకున్నాడు పోతప్ప అప్పట్నించీ

అతనకి లోపల బాధగానే వుండాల. ఆ బాధ చలపతి బాకీలు ఎగర కొట్టి పోవడంతో 'అప్పులు ముంచేసి వూపిచ్చుకొని పోయినాడు' అనుకోడంతో కొంత తీరింది కష్టపడి అప్పు తీరుస్తున్న తన నిజాయితీకి అప్పుడు తృప్తిగా గర్వంగా వుండాల.

పోతప్ప కొన్న కొడమనెవరికో పదిరూపాయలకు పట్టిచ్చి తాగొచ్చి పడుకున్నాడు అంజనప్ప. పొట్టేలుపిల్ల యేమయిందంటే 'యేమో...నాకేం తెల్సు! ఆ యప్పనేలడుగు' అంది బేరమ్మ. పోతప్ప బేరమ్మ పొయ్యికాడి కట్టెపుల్ల తీసుకుని కసిగ వుతికినాడు అంజనప్పను 'అమ్మో...నాయినా! సత్తావుండడన్నో' అంటూ పరుగెత్తుకొచ్చింది బేరమ్మ. ఎక్కడికో ఆ దోవనపోతున్న వాను ఆపి, పోతప్ప చెయిపట్టుకుని 'పద, స్టేషను కు' అన్నాడు పోలీసు. 'మావోడేనయ్య .. మా అన్నే! ఆడు తాగి దొంగపనిజేత్తేను కోపగించుకున్నాడు...అంతేనయ్య! మా అన్నే...పోతప్ప...అదిగో రిచ్చాతొక్కుతాడే...మేంమేం వొగిటే' అని ప్రతిమాలుతూ పోలీసు కడ్డంపడింది బేరమ్మ పోలీసువింటాడా? అంజనప్పనూ తీసుకొని పోయినాడు. ఈ కథలో బేరమ్మపాత్ర చిన్నది. ఒకటి రెండు మాటలుమాట్లాడుతుంది అయితే, ఆపాత్రను అత్యంతసహజంగా, గొప్పగా చిత్రింపగలిగినారు రచయిత్రి. పాండురంగమహాత్మ్యంలో నిగమశర్మ అక్క అంతటి వ్యక్తిత్వంగలది బేరమ్మ

'ఏమిటి గ్గమీలివూరొచ్చింది' అని మొగున్నిగురించి నుందలించినప్పుడు, 'ఆడనాకు కూడవున్నాడుండి, లేన్నాడు లేకపాయె. తిండికి జరక్క యేమయితే కానిమ్మని యెల్లొచ్చేసినాం, యెల్ల కాలం నీ మీందనేపడి తింటామనుకుంటివా! మా బతుకు మేం బతుక్కుంటాంగానీ' అన్నది. అనడమేగాదు, అప్పుడే బ్రిడ్జికిందికి చేరడానికి తయారయింది. 'ఆడమరీ అన్నయపోల్లువుంటారు. అంతగా మానం, మరాదా యిడిసేసినావా? నానాల్లుండు, అంగిడో యాదో సూసుకుందాం' అన్నాడు పోతప్ప.

'తిండికి జరగనోల్లకు మానం మరాదాయేంది?' అని చాపా బొంతా యెత్తుకుని కుటుంబంతోపోయింది బేరమ్మ పోతప్ప, మొగున్ని రక్తంకారేట్లు కొట్టినప్పుడు 'సత్తావుండడన్నో' అని అడ్డంపడింది. అయితే, మొగుని తాగుడుమీదా, దొంగతనంమీదా సానుభూతిలేదు. 'ఆడు తాగి దొంగపనిజేత్తేను కోపగించుకున్నాడయ్య అంతే' అని వాడుచేసినదానికి అట్లా చెయ్యాలిసిందేనన్న అంగీకారం చూపింది.

'మా వోడేనయ్య — మా అన్నే' అని అన్నను గురించిన ఆదుర్దా, నిష్కల్మషప్రేమ ప్రదర్శించింది. 'పోతప్ప ... అదుగో రిచ్చాతొక్కుతాడే మాయన్నే' అని అన్న జనప్రియతనూచాటింది అనుమానంమీద అరెస్టుచేసే పోలీసుమొరటు చట్టానికి మృదువైన సమాధానమిచ్చింది. 'మేం మేం వొగిటే' అని దెబ్బలుతిన్నమొగునికీ కొట్టినఅన్నకూ,తనకూతేడాలేనిప్రేమప్రదర్శించింది.బేరమ్మయింత యాతన, యింత గొప్పవ్యక్తిత్వమూ పోలీసుదగ్గర ప్రయోజనం సాధించలేకపోయినాయి. 'ఆడు నా కొడమను అమ్ముకుని తిన్నాడు. ఆన్ని జైలు కెయ్యాలగానీ నన్నెందుకు?' అని పోతప్ప యెంత యినా అడిగినాడు పోలీసాయన్ను. పోతప్ప మాటకు బదులు రాక పోవడమేగాదు, అంజనప్ప నొదిలి పోతప్పను లోపలికి తోసినారు మరుసటిరోజూ దిల్తే యింటికొచ్చేటప్పటికి, వూరికేవదల్లేదని అర్థమైంది రొండోపొట్టేలు పోయింది, వున్నడబ్బు పోయింది అప్పు అయింది పోలీసుకిచ్చిన లంచానికి. అప్పుడు చలపతిజ్ఞాపకం వచ్చినాడు. చలపతిబాకీలు యివ్వకుండాపోవడంతో అప్పులుముంచేసి వూపిచ్చుకొనిపోయినాడు అని పోతప్ప అనుకోడంతో, చలపతి సంగతి ఆ తర్వాతకథలో ప్రసక్తం గాకపోతే యేమయ్యేది? చలపతి పాత్ర విషయంలో రచయిత్రికి నిర్దిష్టతలేదేమోనని అనుమానం రావడానికి అవకాశంవుండేది తను ఘోరంగా మోసగింపబడి నప్పుడు పోతప్ప జ్ఞాపకం చేసుకోడంద్వారా, రచయిత్రి చలపతి పాత్రకు స్పష్టతా, కంటిన్యుయేషన్ యిచ్చినట్లయింది.

బాధభరింపలేక రెండుసీసాల సారాయి తాగేసరికి, నవ్వాలనీ, యేడవాలనీ అనిపిస్తోంది పోతప్పకు తలెత్తి బ్రిడ్జికేసి చూసినాడు కంట్రాక్టర్లు, ఇంజనీర్లు, యింకెందరో పెద్దలు కలిసి బలుసూ, సిమెంటుకుబదులు యిసుకపోసి కట్టి, బక్కజనంమీద నిలబెట్టినారు ఇదెప్పుడో కూలిపోయి అందర్నీ పూడ్చేస్తుంది. బేరమ్మ, పిల్లలూ అంతా దానికింద బజ్జిబజ్జి అయిపోతారు ఎదురుగ్గా ఆర్ టి వో కారుషెడ్డు తలుపులు బంగారు తలుపుల్లా మెరుస్తున్నాయి యెండలో ముందట బేరమ్మ అక్కడే చేరింది. నేనంతా పేడనీళ్ళుచల్లి కష్టపడి అలుక్కుని గట్టిజేసుకుంది ఆర్ టి వో కారుషెడ్డుక్కావాలని మునిసిపాలటీవాళ్ళు తరిమినారు ఆమెను. షెడ్డు తడకెలు వూడదీసి విసిరేసినాడు!

'షెడ్డు నీదేనా?' అన్నారు 'ఓరెరినాయాలా! నీదేంది నాదేంది! ఆళ్ళదేంది! ఎవుడిసేతి కొత్తే ఆళ్ళదిసొమ్ము నేను రిచ్చాతొక్కి సంపాదిచ్చినదుడ్లెయ్య ... పొట్టేలుపిల్లలెయ్య...... సెప్పు! సాపంద బురదనీరల్లే పరమారతావుందిరా కొత్తపద్దతి నీ సాప నానిపోయి కుల్లుకంపు కొడతావుంది. నాయం నాయం అంటావు...యాడుందిరానాయం?' పోతప్ప చలపతి మాటల్లోని నిజం అనుభవపూర్వకంగా గ్రహించినాడు షెడ్డులో కారులేదు ... శంకరరెడ్డిగారు లయన్సుక్లబ్ మీటింగుకుపోయినారు (కథలో ప్రతి చిన్నవిషయాన్నీ వాస్తవికంగా రచయిత్రి వూహించగలుగుతుందనడానికి యిది నిదర్శనమే) పోలీసులు మళ్ళా రంగంలోనికొచ్చినారు. పోతప్పతరఫున బంకు యజమాని క్షమాపణ చెప్పుకున్నాడు పోలీసులకు. పోతప్ప మంచివాడనీ, తాగి తెలీకచేసినాడనీ, తలుపు కట్టిస్తాడనీ, యికెన్నడూ అట్లా చెయ్యడనీ హామీయిచ్చినాడు. లచ్చుము, బేరమ్మ పోలీసుల సలహామీద ఆర్. టి వో. భార్యకు క్షమాపణ చెప్పుకోడానికి వారు పోలీసులశ్రమకు బదులుగా పోతప్పయింట్లోని బిందె, చెంబుకూడా దాటిపోయినాయి ఖాళీగా వున్నయింట్లో, కష్టపడి సంపాదించుకున్న డబ్బుతోపాటు ఆత్మ విశ్వాసం పోగొట్టుకున్న పోతప్ప అయోమయంలో కూర్చున్నాడు 'ఎందుకు రాజీ తనంచేశాడో, యెందుకు జైలుకెళ్ళాడో తెలీదు

ఇంతవరకూ యెందుకు కష్టపడి కండలు కరిగించుకున్నాడో, యెందుకు కడుపుకట్టుకున్నాడో, యెందుకు షావుకారుకు అప్పు పెట్టాడో దేన్ని మానం మర్యాదా అన్నాడో అర్థం లేకుండా పోయింది అతనికి'

'నేనూ మనిషినన్న అభిమానంతో, రేపటిమీది నమ్మకంతో మనిషి యెన్ని కష్టాలనైనా యెదుర్కోగలడు కానీ, యిప్పటి పరిస్థితులు మనిషిలోని మూలాన్ని, అభిమానాన్ని నేనూ మనిషి నన్న జ్ఞానాన్ని తుడిచిపెట్టేస్తున్నాయి' అన్న అంశాన్ని నిరూపించింది కథ. ఈకథను గొప్పకథగా అంగీకరించనివాళ్ళు చెప్పగలిగేది వొక్కకారణం నిరాశావాదంతో ముగిసిందనీ, మార్క్సిస్టు సుగింపుతో లేదన్నదే అది అవాస్తవ అతిశయ ప్రచారధోరణిలో వున్న కథ మార్క్సిస్టుధోరణిలో వుండీ వొరిగించేదేమీలేదు అంతకన్నా నేటి సామాజిక సత్యాన్ని స్పష్టంగా పలికే యిట్లాంటికథ ప్రయోజనకరమైందిగా గుర్తించవలసివుంది సమకాలీన చైతన్యం రచయితలో లోపించలేదనీ, పైగా అది బాధ్యతాయుతమైన ప్రాధాన్యతతోవుందనీ యీకథ తెలియజేస్తోంది

* * *

ఆ బుక్కరాయ సముద్రం 'చెరువుదగ్గరగా' ఆకాశం కింద నిలబడి చూస్తూంటే సుశీలమ్మ మనసు విప్పారి వికసించి చెరువు నీళ్ళలాగా మహానందంతో సుళ్ళు తిరుగుతుంది. యింటికి వెళ్లగానే మనసు శ్మశానంగా మారుతుంది. తన జీవితం తనది కానట్లు యెవరి బలవంతం మీదనో బ్రతుకుతున్నట్లు బాధ. 'ఎప్పుడూ పొరపాటు రాకూడదు. తప్పు అనే దానికి నిష్కృతిలేదు పేరు నిలబెట్టు జాగ్రత్త' జీవితాన్నిట్లా స్వీకరించి, శిక్షణ యిచ్చిన కుటుంబం నుంచి వచ్చింది సుశీలమ్మ. భర్త గోపాలరావులో తన కిష్టమైన కోరుకున్న లక్షణాలన్నీ వున్నాయి. 'పిల్లలు పుట్టకపోవడం యీ అసంతృప్తికి కారణమా ?' అనుకుని తోసిపుచ్చింది లేనివాటి కోసం బాధపడే తత్త్వం కాదు తనది [illegible]ంగప్ప గోపాలరావుగారి బాంకులో క్యాష్‌మన్‌గావున్నాడు రాత్రి బాంకులో నిద్రపోతాడు. పగలు యింటికాడ తోటపని చూస్తాడు. పనిలేనప్పుడు సుశీలమ్మ లింగప్ప కబుర్లువింటుంది కొండలాగా, చెట్లులాగ. బుక్కరాయ సముద్రంచెరువులాగా అనిపిస్తాడు లింగప్ప ఆ కబుర్లువింటుంటే ఆమె మనస్సు యేదో స్వేచ్ఛను పొందుతుంది లింగప్ప నొప్పులూ ముసలితనం అన్నీ విడిపోయి వొక జీవవాహినిగా మారిపోతాడు లింగప్పలో యేదో [illegible]య వున్నది సజీవమైన భాష, దాని కనుగుణమైన చేతు కదలిక, ముఖభంగిమ, యీ అన్నింట్లోంచి ప్రవహించే విషయమూ, ఆ విషయాన్ని జీవించిన లింగప్ప .. లింగప్ప అతని జీవితం వేరుకానేకావు

లింగప్ప మాటలు వింటూంటే సుశీలమ్మకు వొకనాడు బాలమురళీకృష్ణ కచేరీ విన్నప్పటి తన్మయీ భావం, స్పందన గుర్తుకొస్తుంది. యఱ్ఱగడ్డ చరిత్రలోని వాక్కోగ్రాం అందరిలో స్వేచ్ఛగా లింగిని కురవల జీవితాల్లోని విశేషాలు తిరిగి జీవిస్తాయి అతని మాటల్లో అతి సామాన్యజీవితం, అధమాధమపు జీవితం కూడా! కానీ అది చావుతాక లేని జీవితం ' కపాలేమయిందంటే...' అని ప్రవహిస్తుంది లింగప్ప చైతన్యస్రవంతి.

'పలనా మనిషి ఎట్లాంటివాడు ?' అనడిగితే ఆలోచనల్లో పడతాడు 'ఎవరికీ ఏదీ అన్యాయం సెయ్యలా . ఎవరినోరూ కొట్టలా' అంటాడు. అదొక్కటే లింగప్పకు తెలిసిన విలువ దీర్ఘమైన జీవితంలో అతనివల్ల కొందరికి సహాయం జరిగింది అయినా లింగప్పను 'పరోపకారి' అనడానికి వీల్లేదు అన్నీ యాదాలాపంగా జరిగినవి కనుక!

చెరువుకట్టదగ్గరున్న గణేశుడి పూజకు సుశీలమ్మ, గోపాలరావూ పోతారు గోపాలరావు మీద కక్షకట్టిన వాళ్లు సుశీలమ్మను అవమానం చేస్తారు. ఆమెతప్పేలేదనితెలిసిన అతను యెందుమాదిరిగా అంగీకరించడు ఆమెను. సుశీలమ్మ పుట్టింటి వాళ్ళ, భర్త తరుపు వాళ్లు కన్పించే సానుభూతి ఇంకా బాధాకరంగా వుంటుంది ఇంతవరకు యింత మార్పు కన్పించినా లింగప్పలో మార్పులేదు.

'లింగప్పా ! నాకేమైనా తెచ్చిపెట్టు' అని ఏడిస్తే,

'ఏలనమ్మా ! వూరికే సత్తావ టావు. ఈవూళ్లో వుండ లేకపోతే మావాళ్లకాడికి కుంటిమద్దికి పంపిస్తా. అయిదరబాదలనించి వచ్చినాదనీ, మా కోడలు సుట్టంరాలివనీ యాదో నేసెప్తా. నీకేల అరంతా ! బతకడానికి సోటేలేదా ?' లింగప్పకు తెలిసిందల్లా బతకడమే !

'ఆమెకు చీకట్లో యెదుర్రాయి తగిలింది. బోర్లాపడి క్రిందికి దొర్లిపోయింది. రాళ్లు తగిలిన చోట చర్మం చీరుకుపోయింది ఆమెకు నొప్పికానీ, భయంకానీ అనిపించలేదు ఏమీ తెలియరాని స్థితిలోకి వెళ్లిపోయింది '

ఈ కథను ఆద్యంతం ఆక్రమించిన విశ్వరూపం లింగప్ప లింగప్పను కాలంతోపాటు కరిగిపోనివ్వకుండా నిలుపుకోవాలనే తాపత్రయం పడటం మూలంగా ఈ కథ పుట్టిందనిపిస్తుంది తెలుగు కథా సాహిత్యంలో లింగప్పవంటి మనిషి యింకెక్కడైనా తటస్థపడినాడేమో యిప్పుడు నాకు గుర్తురావడంలేదు లింగప్పను గొప్ప పాత్రగా నిర్మించడానికి ప్రత్యేకించి కష్టపడనక్కరలేదు స్వతస్సిద్ధంగానే లింగప్ప గొప్పపాత్ర రచయిత చేయవలసిందల్లా ఆ లయను, సజీవమైన భాషను పట్టుకోడం. ఆ విషయంలో వసుంధరాదేవిగారు పూర్తిగా కృతకృత్యురాలయినారు. ఉన్నవాన్నిఉన్నట్లుగా లింగప్పను నిలిపి కృతజ్ఞత చెల్లించుకుంది కృతజ్ఞతయెందుకంటే...లింగప్ప వూహాసృష్టికాదు. బాలమురళీకృష్ణపాట యివ్వగలిగిన'అనుభూతి'ని రచయిత్రి కిచ్చినవాడు ఆ 'అనుభూతి'నందుకోవడానికి ప్రత్యేక సంస్కారం, సాధన, వేదనవుంటే తప్ప సాధ్యం కాదని కూడా గుర్తుంచుకోవాలి.

కథాశిల్పరీత్యా లింగప్ప యిట్లా పెరగకూడదనడం కాదు గానీ, పెరగవలసిన అవసరంలేదు. ఒక పాత్ర యిట్లా కథనంతా

(మిగతా 55వ పేజీలో)

కుమారి బలుసు రుద్రమాంబ

# గాంధేయతత్త్వంలో నీతి శాస్త్రము

శాంతి, అహింసలే మానవాభ్యుదయానికి మార్గము

## ETHICS IN GANDHIAN PHILOSOPHY

**జ**నతాపార్టీ కేంద్ర ప్రభుత్వంలో అధికారాన్ని స్వీకరించి గాంధేయ మార్గంలో ప్రజాస్వామిక లౌకిక సోషలిస్టు సమాజాన్ని నిర్మిస్తా నని చెబుతోంది. స్వేచ్ఛ, భయరాహిత్యత, న్యాయస్థానాలకు స్వాతం త్ర్యము కావాలంటోంది. అందువల్ల గాంధీతత్వంలోని నైతిక సిద్ధాం తాలు తెలిసికోవడం అవసరం. అసమానత్వము, అంటరానితనము, నిరుద్యోగము ఎలా తొలుగుతాయో చూద్దాము

## భగవంతుడు

గాంధీ అంతిమలక్ష్యం భగవత్‌సిద్ధి. ఉపనిషత్, గీతల తత్వంమీద భగవత్ సంబంధమైన అతని ప్రమేయాలు ఆధారపడి ఉన్నయ్యి భగవంతుడనగా-సంపూర్ణమైన ఆనందము; నిజము, వెలుగు; ప్రేమ; భయరాహిత్యత. భగవంతుడు కూడా తన నియమా లను తాను పాటిస్తాడు. అతడు వ్యక్తికాదు; జీవుల ఆత్మ; విశ్వము మనిషికి తాను చేయవలసిన పనులను నిర్ణయించుకునే స్వేచ్ఛ ఉన్నది; అయితే ఆ చర్యల ఫలితాలు అతని యిష్టప్రకారము ఉండవు. మానవ స్వేచ్ఛను గురించిన గాంధీ ఆలోచనలు భగవత్‌గీత నుండి గ్రహించబడినవి. ఆత్మదేవుడు కాదుకాని, ఆత్మను, దేవుణ్ణి విడదీయడానికి వీలులేదు మనుష్యులందరిలోను దేవుడున్నాడు. అందువల్ల విశ్వమానవ సౌభ్రాతృత్వము అవసరము ''దేవుని సేవ నా కర్తవ్యము; అందువల్ల మానవసేవ నా కర్తవ్యమౌతోంది'' అని గాంధీజీ అన్నారు.

## స్వదేశి : స్వరాజ్యము

భగవత్‌సిద్ధి జీవిత పరమావధి. ప్రతి వస్తువులోను దేవుణ్ణి చూడవచ్చు. అందువల్ల దైవసిద్ధి స్వీయసిద్ధి, స్వరాజ్యసిద్ధి అవు తోంది. సాంఘిక కోణంనుండి చూచినట్లయితే యీ స్వరాజ్యసిద్ధి రాజకీయ, ఆర్థిక, సాంఘిక స్వయంనిర్భరత అవుతుంది. ఈ సాంఘికతత్వంమీద ఆధారపడి గాంధీజీ స్వదేశీ ఉద్యమాన్ని నడిపారు. ''దూరంలో ఉన్న వాటిని కాకుండా సన్నిహితంగాఉన్న వాటిని ఉపయోగించేట్లు నడిపించే మనలోని చైతన్యము, స్వదేశి అవుతుంది''. స్వదేశీ నుపయోగించడంవల్ల వ్యక్తికి, సమాజానికి స్వయం నిర్భరత ఏర్పడి దేశంఎడ ప్రేమ కల్గుతుంది. అంతర్జా తీయవాది అయినా గాంధీ దేశభక్తుడు. ''ఇతర దేశాల సంస్కృతు లన్నీ స్వేచ్ఛగా నా ఇంట్లో జొరబడాలి, అయితే అవి నా పాదాల క్రింద దూరి నన్ను తల్లక్రిందులు చేయడాన్ని తిరస్కరిస్తాను''అని గాంధీ అన్నారు.

## సర్వోదయం

భగవంతు డందరిలోను ఉన్నాడు కాబట్టి, మాధవసేవకు మానవసేవ సాధనమార్గము. భగవత్‌సిద్ధి సాధనలో స్వదేశి, స్వరా జ్యము, సర్వోదయ వివిధమెట్లు. స్వదేశినుండి స్వరాజ్యము; స్వరా జ్యము నుండి సర్వోదయ సిద్ధించగలవు. సర్వోదయాశయము రామ రాజ్య స్థాపన (అనగా రంజింపజేయు రాజ్యస్థాపన). సర్వోదయ అనగా వ్యక్తి సర్వతోముఖ వికాసము. ప్రతివ్యక్తికి భాషకు, సారస్వతానికి, మతానికి ఆటంకంలేని అవకాశం లభ్యమయ్యే సమాజాన్ని స్థాపించ డమే సర్వోదయాశయము. మతమనే నీరు పోయడంవల్లనే నైతిక ధర్మం మొలకెత్తి మొక్కగా పెరుగుతుంది ''నైతిక ప్రాతిపదికను వదలిపెట్టగానే మనలో మతధర్మం నశిస్తుంది'' అని గాంధీ అన్నారు

## నీతిస్వభావము : ప్రాముఖ్యత

మంచిని సాధించేందుకు, ప్రయత్నంచేయించేందుకు సత్యాన్ని అసత్యాన్ని కూలంకషంగా చర్చించడానికి నీతిశాస్త్రం మార్గం చూపుతుంది. ఆదర్శపూర్వకమైన ఆశయాల శాస్త్రమే నీతి శాస్త్రము (ETHICS) వ్యక్తికి, సమాజానికి కూడా నీతిశాస్త్రం సూత్రాలను తయారుచేసి ఇస్తుంది. ఇది విశ్వ అనువర్తితశాస్త్రము నీతిసూత్రం శాశ్వతమైనదేగాక, మార్పుచెందనట్టిది. ఉన్నతోన్నత మైన నైతిక సూత్రము విశ్వమంతటా అనువర్తితమౌతుంది.

ఈ విషయాన్ని గ్రహించిన ప్రభుత్వమే సుఖంగా ఉంటుంది. మిగతా దంతా ఫలప్రదాయిని కాని ప్రయత్నమౌతుంది. ''ఏ వ్యక్తి, ఏ జాతి నైతిక సూత్రాన్ని ఉల్లంఘించి శిక్షపొందకుండా తప్పుకోలేరు'' అన్నారు గాంధీజీ.

రాజకీయ, ఆర్థిక విషయాలు రెంటికి కూడా నీతిశాస్త్రము ప్రాతిపదికగా ఉండాలి. బలంవల్ల హక్కు ఏర్పడుతుందనే వాదము పనికిరాని పురాతన సిద్ధాంతము. వర్తమానకాలంలో బలంవల్ల హక్కు అనేవాదానికి తావులేదు. అహింస, పరోపకారము ప్రధాన నీతి సూత్రాలు. ''మానవజాతి మంచికి సతతం కృషిచేస్తూ ఉండటం ఉన్నతోన్నతమైన న్యాయసూత్రము.''

## నైతిక సూత్రాల లక్షణాలు

నైతికసూత్రాల లక్షణాలను గాంధీజీ యీవిధంగా చెప్పారు: (1) నైతిక సూత్రాలు నిశ్చలమైనవి (2) నైతిక సూత్రాలు వ్యక్తినిబట్టి, పరిస్థితులనుబట్టి సాపేక్షికంగా ఉండవు; అవి విశ్వ వ్యాప్తంగా గ్రాహ్యములు, అనువర్తనములు (3) నైతిక సూత్రాలు దివ్యస్వభావంగలవి (4) నైతిక సూత్రాల అంతిమ ఫలితంకూడా మంచిగానే ఉంటుంది. (5) నైతికసూత్రాల చరిత్ర కూడా చివరకు మంచిగాఉండి తీరుతుంది. (6) శాశ్వతంగా, విశ్వాంగీకార సమన్వితంగా, మార్పు లేకుండాఉండే నైతిక సూత్రాల పరిణామ ప్రదర్శనా చరిత్ర నైతిక సూత్రాల చరిత్ర అవుతుంది. నాగరికత పురోగమించిన కొలది నైతిక సూత్రాలు బాగా అర్థం చేసుకోబడతాయి. (7) ఆత్మ దివ్య విస్ఫులింగము (Shark). అందువల్ల ఆత్మ నీతిశాస్త్ర సూత్రాలను బోధించే ఆచార్యుడు

## మంచి : చెడు : మార్గము : లక్ష్యము

యాంత్రికంగాను, అంతర్బుద్ధిద్వారాను జరిగే కార్యకలాపాలు నైతికతీర్పు పరిధిలోకి వచ్చే విషయాలుకావు. హేతువాదులవలెనూ, ఆశయ సాధనోద్దీపిత నైతికవాదులవలెనూ, గాంధీ ఐచ్ఛిక కార్యాలనే నైతిక తీర్పుకు సంబంధించిన విషయాలుగా పరిగణిస్తాడు. ఐచ్ఛికంగాని కార్యము నైతికంకాదు. అలవాటు చొప్పునచేసే కార్యాలుకూడా నైతికం కావు. మంచిపని, సదుద్దేశంతో చేసేపనులు నైతికమౌతాయి. వీటిఫలితాలు మన అధీనంలో లేవు ఫలిత ప్రదానం చేసేది దేవుడే.

లక్ష్యం మంచిదైనంతలోనే దాని సాధనమార్గం మంచిదని చెప్పడానికి వీలులేదు. లక్ష్యం మార్గాన్ని సమర్థించలేదు. అయితే ఇందుకు అపవాదాలనుకూడా గాంధీ చెప్పారు. (1) లక్ష్యాలు, సాధన మార్గాలు ఒకేవ్యక్తికి చెందినవి (2) ఉత్తమ సాధన మార్గాలన్నీ అపజయం పొందిన పరిస్థితుల్లో చెడుసాధనమార్గం కూడా మంచిదిగానే పరిగణించబడాలి. అయితే ప్రతి పరిస్థితిలో కూడా ఉద్దేశ్యం మంచిదై ఉండాలి

## అహింస : సత్యాగ్రహము

అహింసా, సత్యాగ్రహాలు ఉత్తమోత్తమమైన సాధన మార్గాలు. సత్యం దేవునకు సమానము. ఆలోచన, వాక్కు, చర్య లలో సత్యం ఉండాలి. లక్ష్యంగా చూస్తే వ్యక్తికి, సమాజానికి సత్యాగ్రహము తుది ఆశయము. సత్యాగ్రహాన్ని ఆచరించే వ్యక్తి, అనులు జరపడానికి యోచించేవ్యక్తి (1) అహింసను, (2) సత్యాన్ని (3) దొంగతనం చేయకుండా ఉండటాన్ని, (4) బ్రహ్మచర్యాన్ని, (5) దురాశా రాహిత్యతను ఆచరణలో చూపాలి సత్యాగ్రహం, లక్ష్యము, సాధనమార్గం కూడ. లక్ష్యసాధనకు సహాయ నిరాకరణను, నిరాహారదీక్షవంటి అహింసా మార్గాలను ఉపయోగించే సమయంలో సత్యాగ్రహము సత్యానికి అంటిపెట్టుకుని ఉంటుంది ఈ పద్ధతిని గాంధీ రాజకీయరంగంలో జయప్రదంగా ఉపయోగించాడు.

''పశువుకు హింస న్యాయ సూత్రమైనట్లుగా, మానవ సంతతికి అహింస న్యాయ సూత్రము.'' పై జెప్పిన అయిదు సూత్రాల్లో సత్యాగ్రహికి అహింస అత్యంత ప్రధానము. చేయి దాని తొడుగువలె సత్యాగ్రహము, సత్యము పెనవేసుకు ఉంటాయి అహింస లేకుండా సత్యసిద్ధి సంభవం కాదు. బ్రహ్మచర్యంలోను, దొంగతనం చేయకుండా ఉండటంలోను, దురాశా రాహిత్యతలోను కూడా అహింస ఉన్నది. అలా ఉన్నందువల్ల అహింసను ఆచరణలో పెట్టినట్లు బుజువవుతుంది. అహింస సత్యానికి ప్రాణము. బాధ కల్గించకుండా సత్యాన్ని చెప్పలేనట్లయితే, సత్యం చెప్పకుండా ఉండటం మంచిది అహింసను మార్గంగాను, సత్యాన్ని లక్ష్యంగాను పరిగణించవలసి ఉన్నది. మనోవాక్కాయ కర్మల్లో దేనితో కూడా యితరులకు బాధ కల్గించరాదు. చెడు ఆలోచన చేయడం కూడ హింస అవుతుంది. తలబిరుసుతో కూడిన తొందరపాటు హింస అవుతుంది. అబద్ధపు విషయం చెప్పడం హింసఅవుతుంది. ఈర్ష్యకూడా హింసే. తప్పనిసరిగా ఇతరులకు కావలసిన వస్తువుల మీద గుత్తాధిపత్యం చేయడంకూడా హింసే అవుతుంది. ఇతరులకు చెడు కలగాలనడం కూడా హింసే.

## అహింస కన్పించే పరిస్థితులు

అందువల్ల అహింసపరమోత్కృష్టమైన కర్తవ్యం అహింస విషయంలో పై జెప్పిన రుణాత్మక (negative) లక్షణాలేగాక. ధనాత్మక (positive) లక్షణాలు కూడా ఉన్నయ్యి. అహింసలో ప్రేమ, సానుభూతి, దయ, నిర్భయత ఉన్నై. వ్యక్తి, సమాజము అహింస ననుసరిస్తామని ప్రతిజ్ఞచెయ్యాలి. అహింస నాచరిస్తామనే వారికి గాంధీజీ పదకొండు రకాల ప్రతిజ్ఞలు చెయ్యాలని చెప్పారు. ఉపవాసము, ప్రార్థన, పశ్చాత్తాపము అహింసలో భాగాలే. ప్రార్థన వల్ల శక్తి, బలము లభించుతాయి ఉపవాసంవల్ల ఆత్మ, శరీరము శుద్ధిని పొందుతాయి పశ్చాత్తాపం హృదయ పరివర్తనను తెస్తుంది. ఈ క్రింది పట్టిక అహింస సమగ్ర స్వరూపాన్ని తెలియ జేస్తుంది.

సత్యము

అహింస

బ్రహ్మచర్యము | ఆహ్లాదకరమైన రుచిని నియంత్రణలో నుంచుట | దొంగిలించకుండుట | దురాశా రాహిత్యత | భయరాహిత్యత | శారీరక శ్రమ | స్వీయ కర్తవ్యాన్ని నెరవేర్చుట | స్వదేశీ స్వీకరణ | స్వభావంలో స్థిరత్వము | అంటరాని తనమును తొలగించుట

# అబంధ విధులు

జీవితం నియమబద్ధంగా నడచి తీరాలని గాంధీజీ వాంఛిస్తారు. అందుకుగాను కొన్ని అబంధ విధులు (obligations) అనగా ప్రధానకర్తవ్యాలు (duties) ప్రకటించారు. ఇవన్నీ అహింస లోని అంతర్గత భాగాలే. వాటి నిప్పుట వివరిద్దాము

## 1. బ్రహ్మచర్యము :

ఇంద్రియ లాలసత్వమునకు వ్యతిరిక్తమైన ప్రవృత్తి ఇంద్రియాలను నియంత్రణచేయుట. భార్యతో మాత్రమే సంసారం నెరపు వ్యక్తి కేవలం తండ్రి కావడానికిమాత్రమే లైంగిక జీవితానికి పూనుకుంటాడు.

## 2. ఆహ్లాదకరమైన రుచిని నియంత్రణ చేయుట :

ఆహ్లాదకరమైన రుచిని పొందాలనేకోర్కెకు బ్రహ్మచర్యాన్ని పాటించడానికి సన్నిహిత సంబంధమున్నది

## 3. దొంగిలించకుండుట :

ఇతరుల ధనాన్ని బలవంతంగా తీసుకుని ప్రోగుచేసుకొనుట, దురాశతోను, స్వార్థంతోను మితిమీరి సంపాదించుట, ఉపయోగించనివస్తువును సంపాదించడానికి తీవ్రంగా ప్రయత్నించుట, లెక్కజమ లేకుండా సంపదను సేకరించుట పాపములు. "మన మొక విధంగా దొంగలము. మన తక్షణావసరం తీర్చుకోవడానికి అవసరం లేని దానిని తీసుకుని ఉంచుకున్నట్లయితే, ఒకరి దగ్గరి నుండి దొంగిలించినట్లవుతుంది" అని గాంధీజీ వ్రాశారు

## 4. దురాశా రాహిత్యత :

ఆలోచనలోను, చర్యలోను దురాశ ఉండకూడదు. ధనికుడు తన సంపదకు ధర్మకర్తేగాని, స్వామ్యం గలవాడు లేక యజమాని మాత్రం కాదు. అతడా సంపదను మానవ జాతి, సమాజము, దేశము శ్రేయస్సు పొందడానికి వీలుగా ఖర్చు చెయ్యాలి.

## 5 భయరాహిత్యత :

భయ రాహిత్యత శూరుని లక్షణము భయము అనుమానం వల్ల కల్గుతుంది. అహింసా మార్గగామి దుష్ట లక్షణానికి మినహా మరి దేనికి భయపడకూడదు. పిరికితనానికి అహింస ముసుగుకాదు; ధైర్యవంతుని ఉన్నతోన్నత లక్షణము మాత్రమే.

## 6. అస్పృశ్యతా నివారణ :

అంటరానితనము సమాజానికొక మచ్చ దాన్నితొలగించడం ప్రతి వారి కర్తవ్యం. ప్రతి ఒక్కరు తమ విద్యుక్త ధర్మాన్ని నిర్వర్తించాలి ప్రతివారు పాకీ పనికూడ చేయుట మంచిది.

## 7. సహనము : స్వభావ స్థిరత్వము :

విదేశీ మతాలఎడ సహనాన్ని గౌరవాన్ని, స్నేహాన్ని చూపాలి. గాంధీజీ రోజువారి ప్రార్థనలో యీవిషయ మొక భాగంగా ఉండేది.

## 8. స్వదేశి :

అహింసలో స్వదేశీ వస్తు స్వీకరణ ప్రధాన విషయము అందువల్ల విదేశీయులను ద్వేషించరాదు. మన దేశంతో ఉత్పత్తి చేయడానికి వీలుకానిదాన్ని, అతికష్టం మీద మాత్రమే ఉత్పత్తి చేయడానికి వీలైనదాన్ని, విదేశీయుణ్ణి ద్వేషించే కారణంగా దేశం లోపల ఉత్పత్తి చేసేదాన్ని, స్వదేశీ ధర్మ నిర్వహణ అని అనలేము. గాంధీజీ చెప్పిన ఈ భావంలో పరోపకార దృష్టిగల దేశభక్తి ఉన్నది

# వివిధ రంగాలలో అహింస

అర్థశాస్త్రానికి, రాజనీతి శాస్త్రానికి కూడా నీతిశాస్త్రం ప్రాతిపదిక కావాలి. కేవలం వ్యక్తిజీవితంలోనేగాక సాంఘిక, ఆర్థిక, రాజకీయ జీవితాల్లోకూడా అహింస ఆచరణీయం. "ప్రపంచంలో

ఇంకా చాలామంది బ్రదికి ఉన్నారనే సత్యం, ప్రపంచం ఆయుధబలం మీదగాక సత్యము, ప్రేమల శక్తిమీద ఆధారపడి నునుతోందని తెలియజేస్తోంది'' అని గాంధీజీ ''యంగ్ ఇండియా'' పత్రికలో వ్రాశారు

## ఆర్థిక రంగంలో

ఆర్థిక రంగంలో కుటీర పరిశ్రమలను ఏర్పర్చాలి దోపిడి చేసే సంస్థలతో సహాయ నిరాకరణ చెయ్యాలి. శరీర శ్రమచెయ్యని జీవితము పాప భూయిష్టము. అహింస ఉన్నచోట దోపిడిఉండదు. ఐచ్ఛిక త్యాగము, నియంత్రణ అవసరము. శ్రమ వాస్తవమైన మూలధనము. న్యాయమైన పంపిణీ అవసరము. అయితే వర్గ పోరాటం పనికిరాదు. ఇతరులను ద్వేషించడంవల్లవారినుండిద్వేషము, హింసించుటవల్ల వారి నుండి హింస మనకు సంప్రాప్తమౌతాయి సంపదకు ధనికులు ధర్మకర్తలు మాత్రమే ధర్మకర్తలుగానే వారు సంపదను ఖర్చు చెయ్యాలి. పెట్టుబడిదారీ విధానాన్ని తొలగించడానికి, అహింసా, సహాయ నిరాకరణలు మార్గాలు.

## రాజకీయ రంగంలో

ఇతరులను నీచమైన బానిసత్వానికి గురిచేయడము పాపము. విదేశ పాలన నుండి స్వాతంత్ర్యాన్ని సంపాదించడానికి అహింస, సహాయ నిరాకరణ, గౌరవంతో కూడిన అవిధేయత మార్గాలు. రాజ్యాంగయంత్రము సర్వశక్తి సమన్వితంగా ఉండరాదు. నియంతృత్వం పనికిరాదు. ప్రజాస్వామ్యం కావాలి అహింసాయుత ప్రజాస్వామ్యంలో అందరూ సమంగా స్వేచ్ఛ ననుభవిస్తారు గాంధీజీ కోరేది అహింసాయుత సహకార సమాజము. ఈ సమాజంలో రాజ్యాంగ యంత్రం అవసరములేదు.

## సాంఘిక రంగంలో

సాంఘిక రంగంలో కూడా అహింస అవసరము. అంటరాని వారిని, వితంతువులను ఉద్ధరించడానికి గాంధీజీ సమత్వ సూత్రము ప్రాతిపదిక దోపిడి ఆర్థికమైనా, రాజకీయమైనా, సాంఘికమైనా హింస క్రిందకే వస్తుంది ఈదోపిడిని తొలగించడానికి అహింసా, సహాయ నిరాకరణలను సాధనాలుగా ఉపయోగించాలి.

# మూడు గొప్ప కథలు

(51 వ పేజీ తరువాయి)

ఆక్రమించినప్పుడు సాధారణంగా కథ నలిగిపోక తప్పదు. ఇక్కడ నలిగిపోవడానికూడా వీల్లేనంతపన్నది కథ అదిమరీసన్నది అనిపించడంచేతనే కొంచెం పెంచినట్లు అనిపిస్తుంది ఆ పెంచడంలో భాగమే సుశీలమ్మ అసంతృప్తి ఆ అసంతృప్తి 'తాను జీవితంలో అనుభవించలేనిదేదో అది లింగప్ప జీవితంలో వెతుక్కుంటున్నది' అన్నంతవరకూ సరైందిగానే వుంది. 'గడిచిన జీవితం యెడారిగానూ, ముందున్నది స్మశానంలాగనూ' వుందనడం అతిగా వుందనిపిస్తుంది. 'కొంతకాలంనించీ ఆమె మనసులో యిలాంటి మార్పు వచ్చింది...' 'కడుపులో పుచ్చును దాచుకున్న మల్లెమొగ్గ యీ మనస్సు. యీ చిత్రణచూస్తే చెరువుదగ్గరి దుర్ఘటనకు కారణం ఆమె మనసులో అంతకుముందునించే బీజప్రాయంగా వున్నట్లు రచయిత్రి చెబుతున్నారా అన్న అనుమానం రావడానికి అవకాశముంది అయితే రచయిత్రి అభిప్రాయం అదికాదు. అదే అయితే 'నేను సుశీలను, నన్ను యే మలినం అంటలేదు. కావాలంటే అగ్నిపరీక్ష పెట్టండి నాకేమైనా పాపం అంటితే మసైపోతాను అప్పుడూ ఇప్పుడూ వొక్కటిగానే వున్నాను' అని సుశీల అనుకోలేదు కథలో ముగింపు సుశీల చచ్చిపోయినట్లే తెలియజేస్తుంది తనది కాని తప్పుకు సుశీలమ్మ చనిపోవలసిందేనా? 'తప్పుకు నిష్కృతిలేదు' అని సుశీలమ్మ పెద్దలు చెప్పిన నీతిమీద రచయిత్రికూడా గౌరవ ముండటమేనా కారణం? జాగ్రత్తగా చూస్తే దొరుకుతుంది 'వైశాల్యం లేనిచోట ఆమె వుక్కిరి బిక్కిరి అయిపోతుంది మనసు కుంచించుకపోయి విలవిల్లాడుతుంది. వూహగాకాక, నిజంగా భౌతికంగా బాధిస్తుంది' అక్కడే సుశీలమ్మ చావుకు కారణం రచయిత్రి చెప్పింది.

మొత్తంమీద యీ కథద్వారా రచయిత్రి చెప్పదలచుకున్న అంశాన్నిమించి కనిపిస్తాడు లింగప్ప. లింగప్పకోసం యీ కథ కావలసొచ్చిందో, కథలో ముందు మామూలుగా ప్రవేశించి తరువాత అట్లా పెరిగినాడో కానీ జరిగింది అది అందువల్ల నష్టమేమైనా జరిగిందా? చాలా మేలు జరిగింది. 'అనంతపురమూ, లింగప్ప యెనభైయేళ్ళు కలిసేవున్నారు' యింకెన్నేళ్ళో అట్లా కలిసుండేట్లు పొడిగించగలిగింది రచయిత్రి. ఈ కథలోనూ 'బ్రిడ్జికింద' అన్న కథలోనూ రచయిత్రి వాడిన అనంతపురం మాండలికాలమీదనే ప్రత్యేక వ్యాసం వ్రాయవచ్చు. జీవితం కనిపించకుండా వొట్టి మాండలిక శబ్దకోశంగా తయారయిన రచనలు యీనాడు చాలా వస్తున్నాయి. వసుంధరగారు వాడింది అట్లాంటి నిర్జీవ మాండలికాలు కావు. మాండలికం పలుకుతున్న మనిషినీ, ఆ మనిషినట్లా రూపొందించిన ప్రాంతాన్నీ, జీవితాన్నీ, ఆ జీవితానికిమూలమైన భౌతిక, మానసిక వాతావరణాన్నీ, యీ అన్నిటితోనూ కలిపి ఆ మనిషిని హృదయానికి హత్తుకోగలిగిన ఆత్మీయత ఐక్యతలనించీ, ఆ గొంతునించీ, ఆ వుచ్చారణనించీ వచ్చిన మాండలికాలు ఆమె శైలి యెక్కడా విడిగా, అపస్వరంగా, వికృతంగా కనపడకుండా, రచనా శ్రుతిని అనుసరించే వుంటుంది. ఈ ప్రస్తావనలో మొదట 'కదిలించిందే కథగా చెప్పగలిగిన వాళ్ళలో' వసుంధరాదేవిగారిని చేర్చడం జరిగింది దాన్నిబట్టి ఆలోచిస్తే 'అట్టే కదిలేగుణం తక్కువే కావొచ్చు' అన్న అభిప్రాయం రావడానికూడా అవకాశముంది. అట్లాంటి జడత్వంకాక, తాను స్పందించిన అంశంతో పాఠకుల్ని స్పందింపజేయడం అన్న గుణంతో అర్థంతో అన్వయించవలసిందిగా (వి)జ్ఞప్తిచేస్తూ విరమిస్తాను.



ఊర్వశి

# "శశి"

"శశి టెలిగ్రాం ఇచ్చింది—"

చేతిలో ఉన్న ఫైలును ప్రక్కన పెట్టి రివాల్వింగ్ చైర్ లోంచి టెలిఫోన్ రిసీవర్ నందుకోబోతున్న నేను నిద్రపోతున్న వానిలా ఒక్కసారి తుళిక్కుపడి స్టెనో లత రూములోకి చూశాను. ఆ గది స్ప్రింగ్ డోర్సును తెరచుకుంటూ గులాబి రంగు కాగితాన్ని గాలిలో ఆడిస్తూ మూర్తి లతతో అంటున్న మాటలవి. తెరచి ఉన్న తలుపుల దారిలో మూర్తి, లత నాకు స్పష్టంగా కనిపిస్తున్నారు. 'శశి' పేరును విన్న నేను రిసీవర్‌ను జారవిడిచాను.

"టెలిగ్రామా ? ఏమని ?" కంగారుపడుతూ అడిగింది లత కుర్చీలోంచి లేచి టెలిగ్రాము నందుకుంటూ.

నిజానికి నాలోకూడ అంత కంగారుంది.

మూర్తి ఆమె భుజంమీద చెయ్యివేసి "కంగారేంలేదు. రాత్రి ఎక్స్‌ప్రెస్ ట్రయిన్‌లో విజయవాడ వెళ్తోందిట. నిన్ను స్టేషన్‌కి రమ్మంది" అన్నాడు టేబిల్ అంచుకి చేరగిలాపడి నిలబడుతూ.

శశి విజయవాడ వెళ్తోందా ? విజయవాడలో యింకా ఎవరున్నారు? ఇంతకాలమై విజయవాడ వెళ్ళని శశి యిప్పుడెందుకు విజయవాడ వెళ్తోంది. నాకు తెలియని బంధువులుగాని, స్నేహితులుగాని ఆమెకు ఎవరున్నారు ?— ఆలోచనలో పడ్డాను.

"ఎంతకంగారు పెట్టేశారు! ఛా ! మీరెప్పుడూ యింతే !" అంటోంది లత, అతని మణికుల మీద చేతులువేసి కుదుపుతూ గోముగా. అటు తరువాత అతను ఆమెకు కొద్దిగా దగ్గరగ జరగటం, అతను ఆమె కళ్ళలోకి చూడటం, ఆమె కళ్ళతో సన్నగ నవ్వటం నాకు స్పష్టంగా కనిపిస్తున్నది.

వారిద్దర్నీ నేనలా చూడటం నాకేమీ క్రొత్తకాదు.

నేను ఆక్షేపణ చూపను. కారణం ? వారిద్దరూ భార్యాభర్తలు. అతను మా ఆఫీసులో ఎల్.డి.సి. ఆమె; నా స్టెనో. అందుచేత వారిని చూచి చూడనట్టే వదిలేస్తాను. కాని నేను వారిద్దర్నీ చూడటమే వారి ఉద్దేశ్యమని నాకనిపిస్తుంది.

"ఇదిగో బాస్ ! ఇటు చూడండి. మేమెంత అన్యోన్యంగా హాయిగా ఉన్నామో ! మీ రెందుకలా ఉండరు ? వై డోంట్ యూ ట్రై ?" అన్నట్టు ఉంటాయి వారి చర్యలు.

"వెళ్ళాలా ? తప్పనిసరా ?" నాకు కొద్దిగ అడ్డంగా తిరిగి అడుగుతున్నాడతను.

"ఎంత గమ్మత్తుగ అడుగుతున్నారు ? శశి ఎవరో మీకు తెలియదా ? ఆమె నా ప్రాణానికి ప్రాణం. మీరు నాకు తటస్థపడక పోయి ఉంటే నే నామెనే తప్పక పెళ్ళాడి ఉందును. ఆమె నా ఫ్రెండ్. క్లాస్‌మేట్, మై డియరెస్టు డియర్. అర్థమైందా సార్!" అసలు శశిని చూచి సంవత్సరం దాటిపోయింది కూడా.

"అర్థమైంది డియర్ ! నేను కూడా ఈ రాత్రి నీతో స్టేషన్‌కు వచ్చి, నిన్ను ఆమెకు చూపించి, నీవు ఆమెతో రైలెక్కి పారిపోకుండ వెనక్కి తెచ్చుకోవాలన్నది కూడా అర్థమైంది."

"అంతేకాదు. నేను కొద్దిగ ఇంటికి ముందుగా వెళ్లి, వెళ్ళేటప్పుడు దారిలో రెండు మూడు కూరలు మార్కెట్టులో కొనుక్కొని త్వరగా వంటచేసి, కేరియర్ తీసికుని స్టేషన్‌కి వెళ్ళాలి. అందుకని బాస్‌ని పెర్మిషన్ అడగాలి" నాకు వినిపించేటట్టుగా అంటోంది లత. నేను వాచీచూశాను. నాలుగు గంటల దగ్గర అయింది టైము. టేబిల్ మీద ఆమె వైపు చేయవలసిన కాన్ఫిడెన్షియల్ లెటర్సు ఇంకా చాల ఉన్నాయి. అవి మర్నాటి పోస్టుకి అందాలి.

"సార్ !" నెమ్మదిగా అంది లత నా టేబిల్ ముందుకి వస్తూ.

నేను నెమ్మదిగా తల ఎత్తాను.

"ఇంటికి వెళ్ళటానికి పర్మిషన్ కావాలి కదా ?" అన్నాను.

"అవున్సార్! నా ఫ్రెండు. ఈ రాత్రి భువనేశ్వర్‌నుండి విజయవాడకు వెళ్తోంది సార్! నే నామెను చూడాలి. అంచేత..."

"ఆమె మీకు అంత ప్రాణ స్నేహితురాలా ?"

"అవున్సార్! విజయవాడలో నేనూ, శశి ఇంటర్ ఫస్టియర్ కలిసే చదువుకున్నాం. తరువాత మా ఫాదర్‌కి యిక్కడికి ట్రాన్స్‌ఫర్ అయిన కారణంగా యిక్కడ కొచ్చేశాం. తరువాత చాలాకాలంగా కలియటం కాలేదు. క్రిందటి సంవత్సరం కలిసిన తరువాత యిదే మళ్ళా కలియటం."

"ఐ సీ! బహుశా ఆమె తన స్వస్థలానికి వెళ్తూండవచ్చు. వెళ్ళండి. మీ స్నేహితురాలిని కలియండి. ట్రైను రాత్రికి కదా...!"

"అవును సార్ ! కాని కొద్దిగ ముందుగావెళ్ళి ఆమెకు కేరియర్ రెడీచెయ్యాలి. కొద్దిగ మార్కెటింగ్ ఉంది. అందుకని..."

''ఆల్‌రైట్! మీరు వెళ్ళి మీ టేబిల్‌మీది లెటర్సు, పేపర్సు నా టేబిల్‌కి పంపి, మీరు వెళ్ళండి.''

''నా పని మీరు చేస్తారా సార్! వద్దు సార్. నేను రేపు ఉదయమేవచ్చి టైప్‌చేసి మీరు ఆఫీసుకి వచ్చేసరికి రెడీ చేస్తాను''.

''ఇంకా త్వరగా ఆ పేపర్సు పోష్టు చేయించాలని నా ఉద్దేశ్యం. మీరు వెళ్ళండి. నా మూలకంగా మంచి స్నేహితురాల్ని 'మిస్' అవటం నా కిష్టంలేదు. స్నేహం విలువ నాకు తెలుసు''.

నా ముఖంలోకి చూచిందామె; నా ముఖంలో అయిష్టత ఉన్నదేమో తెలిసికోవటం కోసం. ''వెళ్ళండి'' నే నవ్వుతూ అన్నాను.

''థాంక్సు సార్!'' అంటూ నెమ్మదిగా కదిలిందామె.

'శశీ! ఇన్నినాళ్ళకు నిన్ను నే చూడగలుగుతానన్నమాట' నిట్టూర్చాను.

నెమ్మదిగా ప్రైవేటు రూములోకి కదిలి ఈజీచైర్‌లో అనీజీగా రిక్లైన్ అయ్యాను. పైన ఫేన్ తిరగటంలేదు. ఫేన్ ఆన్ చెయ్యమని రాఘవులికి చెప్పాలనీ నాకు తోచలేదు. సిగరెట్ వెలిగించి ఎదురుగాఉన్న లుకింగ్‌గ్లాస్‌లోకి చూశాను

నా వెనుకనే నవ్వుతూ నిల్చుంది శశి.

నా సిగరెట్ పొగకు ఉక్కిరి బిక్కిరై కళ్ళల్లో నీళ్ళు తెచ్చుకుని నవ్విందే అలాటి నవ్వుకాదు, నా సిగరెట్ పేకట్‌దాచేసి నన్ను విసిగిస్తూ నవ్విందే అలాటి నవ్వు,...గలగల పారే సెలయేటి నవ్వు; ఉదయపు మంచులో తడిసిన మందారం వికసిస్తూ నవ్విన నవ్వు—మరువరాని నవ్వు.

శశి ఇంకా నవ్వుతూనే ఉంది.

నాకు గుర్తు. అందమైన ఆ కళ్ళు నాకు గుర్తు. ఆ లేత చెక్కిళ్ళు, అందమై కొనదేరిన అమె చుబుకం గుర్తు ఆ ముక్కులో విరుపులు గుర్తు.

శశి...ఏడాటి శశి.

భువనేశ్వర్‌లో ఉన్నదన్నమాట.

విజయవాడలో తనకు యింకా ఎవరున్నారని వెళ్తున్నట్టు. ఎవరూలేని చోటికి తానెందుకు వెళ్తున్నట్టు ?

భువనేశ్వర్‌లో ఎవరున్నట్టు ?

పెళ్ళయి భర్తతో అక్కడ ఉంటున్నదేమో.

లతను అడిగి ఉండవలసింది. అడిగితే తానెన్నో విషయాలు చెప్పేది.

శశి నీకు ప్రాణస్నేహితురాలు మాత్రమే. నాకు మాత్రం ప్రాణంలో ప్రాణం—అని చెప్పనా! వద్దు. చెప్పకూడదు. ఎవరికీ చెప్పకూడదు. శశిని నేనెందుకు కావాలని దూరంచేసికున్నానో ఎవరికీ తెలియనవసరం లేదు. నిజానికి తెలియవలసింది శశికే కాని శశికి ఆ నాటినుండి నిజం తెలియకనే ఉండిపోయింది. ఈ రాత్రి నన్ను చూస్తే ''రఘూ ! నీవు మంచిపనే చేసావు'' అని అంటుందా ?

అయితే శశిని చూడటానికి నేను వెళ్తానా ?

'నీ ప్రాణానికి ప్రాణమైన శశి నీ కళ్లముందునుండి వెళ్ళిపోతూంటే ఎదురుపడి పలుకరించక ఉండగలవా?' అద్దంలో శశి నిలదీసి అడిగింది.

'ఉండలేను. చూడకుండ ఉండలేను. పలుకరించకుండ ఉండలేను. వెళ్తాను. శశినిచూస్తాను. చాలారహస్యంగా చూస్తాను. ఆమెకు కనిపించకనేచూస్తాను. నేనుకనిపిస్తేమరల ఆమెలోఅలజడి కనిపించవచ్చు. అంతేకాదు ఏ శశిని పలుకరించాలని లత వెళ్తోందో ఆ లతముందు శశిని నేను ఏమని పలుకరించనూ? తేలిక్కైపోనూ?... అయితే ఎలా? ట్రైన్‌కి వెళ్ళటం మానేయనా?''

''ఎందుకు మానేయటం? శశి ఇక్కడ కాకపోతే ఇంకో స్టేషనులో కలయకూడదా? మాటాడకూడదా?'' అద్దం సలహా యిచ్చింది.

''అవును. శశిని రహస్యంగానే చూస్తాను. లత చూడకుండ ట్రైన్ ఎక్కుతాను. శశితో మాటాడుతూ కొంతదూరం వెళ్తాను. ఎంతదూరం? తుని వరకూ వెళ్తాను తిరిగి ఆఫీసు వేళకు తిరిగి రాలేనూ?''— నా నిర్ణయం నాకే నచ్చింది

''అవును. అలాగే చేస్తాను. శశి ఎదుటపడే పలుకరిస్తాను. శశికి ఎదురుపడక దాగుండి పోవటానికి నేనేం తప్పుచేశాను? శశితో మాటాడతాను. అందువలన నాపై ఆమెకున్న అభిప్రాయాలు సరిచేసికోవటానికైనా అవకాశం ఏర్పడుతుంది. నా గుండె తేలికవుతుంది''— రఘురాం ఆగాడు. ''ఏం ?'' అన్నట్టు అతనివైపు చూశాను. ''ఒక్క సిగరెట్ దమ్ములాగనీయండి గురువుగారూ !'' ఆ నాటి గుండెబరువు ఈనాటి కూడ తేరలేదు ' అన్నాడు చదువుతున్న కాగితాలను ప్రక్కకు పెట్టి.

నేనూ సిగరెట్ అందుకుని, పాకెట్ అతని ముందుకు జరిపాను. సిగరెట్ ముట్టించుకుంటూ కిటికీ తెర ప్రక్క నుంచి గదిలోపలికి చూశాను, ఎందుకో ముందు గదిలోకివచ్చిన మా శ్రీమతి వైపు. నా చూపులు అర్థం చేసికొని విసుగ్గా ముఖం పెట్టి లోపలికి వెళ్ళింది. ప్రారంభించనున్న రఘురావ్‌ను ఆగమన్నాను. ఇంట్లోకి వెళ్ళినంత త్వరగా కాఫీ ట్రేలో కప్పుల్లో తెచ్చి మా ముందు పెట్టి వెళ్ళిపోయింది మా శ్రీమతి.

మవునంగా కాఫీ తాగాడు రఘురాం.

''ఇప్పుడు చెప్పు'' అన్నాను కుర్చీలో నెమ్మదిగా రిక్లైన్ అవుతూ. రఘురాం ప్రారంభించాడు.

తన భర్తతో నా గురించి ఏమని చెప్తుంది మా అన్నయ్య అంటుందా ? అనదు. ఇంటిలోని వారందరూ నన్ను అన్నయ్యగారని అంటే తను మాత్రం అలా అనేది కాదు

అతనొచ్చారు... అతను బజారులో కనిపించారు...అతను ... అతను... ఇలానే అనేది.

మరి నన్ను 'మా ఫామిలీ ఫ్రెండు'అని పరిచయం చేస్తుందా? లేక 'మాకు తెలిసిన అతను' అని అంటుందా ? లేక తనకు తెలియనట్టే ప్రవర్తిస్తుందా ? ఇతనెవరో నాకు తెలియదని అంటుందా ? అవును. అలా అన్నాఅనవచ్చు. నేను మాత్రం ఆరోజు రాత్రి ఏమన్నాను.

''నేను నీకు అన్నయ్యను కాను. నిజమే. నీ మనసు నాకు తెలుసు. నా మనసు నీకు తెలుసు. కాని మన మనసులు వారికి తెలియవు. మన ఆలోచన వారికి విపరీతంగా ఉంటుంది. శశి నీ చెల్లెలు అని వారు ప్రతీక్షణం గుర్తు చేస్తూంటే నేనీఆలోచనను ఎవరికి మాత్రం ఎలా చెప్పేది ? ఇంతవరకు మనం దూరంగానే ఉండిపోయాం. ఇప్పుడూ అలానే ఉండిపోదాం. నేను నీకు ఏమీ కాలేకపోయాను. నేను నీకేమీ కాను''--అని అనలేదూ ? అందుచేత ఇతనెవరో నాకు తెలియదు అని అనదూ ? అంటుందా ? నిజంగ అలా అంటుందా ?...అనదు. శశి ఎప్పుడూ అలా అనదు. తప్పని సరిగా నన్ను స్నేహితుడిగా నైనా స్వీకరిస్తుంది. శశి నన్ను చూచి ముఖం తిప్పుకుంటే నేనే అంటాను. ''మీ అందరి స్నేహితుడన''ని చాలాకాలం తరువాత చూడగలుగుతున్నందుకు నా సంతోషాన్ని ఎలా వ్యక్తపరిచేది ? ప్రెజంటేషన్సు తీసికెడితే ! అవును తీసికెడితే ! అవును. ఏం తీసికెళ్ళాలి.

స్వీట్సు- అవును. స్వీట్సు తీసికెళ్తాను. శశికి ఇష్టమైన స్వీట్సు తీసికెళ్తాను . మరింకేమిటి ?

ఫ్రూట్సు — అవును. దొరికినన్ని రకాలు తీసికెళ్తా.

స్వీట్సు—ఫ్రూట్సు—మరి యింకా ఏం తీసికెళ్లాలి. ఫ్లవర్స్— అవును చామంతి పువ్వులు శశికి చాలయిష్టం. కాని అతనేమనుకుంటాడు తప్పేమో. పోనీ వద్దు...పువ్వులు వద్దు

'పిల్లలకి బట్టలు'—అవును ఈ సరికి శశికి కనీసం ఇద్దరైనా పిల్లలుండి ఉంటారు. ఒక ఆడ, ఒక మగ ఇద్దరికి ఖరీదైన డ్రెసెస్ తీసికోవాలి.

శశికి ఖరీదైన చీర, ఇష్టమైన ఆకాశ రంగు చీర తీసికెడితే...తీసికుంటుందా ? అసలు అతనేమనుకుంటాడు ? ఏమైనా అనుకోవచ్చు. పోనీ...వద్దు.

అయినా ఇన్ని తీసికెళ్లి యిస్తూంటే ''మేము వస్తున్నట్టు ఎలా తెలుసు''అని అడిగితే ఏమని చెప్పను ? అవును ? ఏం చెప్పాలి.

'లత వలన తెలిసింది' అని చెప్పనా ? వద్దు. అలా చెప్పకూడదు.

'మరేమని చెప్పాలి ?' 'ఒక స్నేహితుడు కుటుంబంతో వెళ్తున్నట్టు ఉత్తరం వ్రాసాడు. అతన్ని చూద్దామని వచ్చాను. కాని అతను రాలేదు. ఇవన్నీ వాళ్ళకోసం తీసికున్నవే' అని అంటాను

'ఛీ! చాల అసహ్యంగా ఉంటుంది. చాల నీచంకూడ. ఒకరి కోసం తీసికెళ్లినవి మరి ఒకరికి యివ్వటం'.

'అయితే మరేమి చెప్పాలి ?'

'మీరందరూ ఈ ట్రైన్‌కి వస్తున్నట్టు కలవచ్చింది కలలు నిజమవుతాయని నా నమ్మకం నాకు వచ్చిన కలలు కూడ ఎప్పుడూ నిజమవుతాయి' అంటాను. నమ్ముతుందా ? నమ్మదు.

కాని, నాకెలా తెలిసిందంటూరా ? నాకు కలవచ్చింది. ఆ కలలో మీరు పాసయినట్టు, ఆ మాట నాతో చెప్తున్నట్టు. నాకు వచ్చిన కలలు నిజమవుతాయి.

''నాకెప్పుడో తెలిసిపోయింది. మీరు ఇంటర్వ్యూకెళ్తారని రెండురోజుల క్రితమే నాకు కలవచ్చింది...'' ఇలాగ తను చెప్పేసిన తరువాత ఇలా ఎన్నిసార్లు శశి తనకుముందే తెలుసని బుకాయించలేదు. నేనుకూడా అలానే బుకాయించేస్తాను. నమ్ముతుందా? నమ్మదు. గాని నవ్వేస్తుంది పాతరోజులు గుర్తుకు తెచ్చుకుని నవ్వేస్తుంది.

సిగరెట్‌ను యాష్ట్రేలో వదలిపెట్టి నిలబడ్డాను. చాలా కాలానికి శశిని చూడగలుగుతున్నందుకు చాల ఆనందంగా ఉంది. ఆఫీసురూములో అడుగుపెడుతూ ''బజ్జర్'' నొక్కాను . రాఘవులు పరిగెత్తుకుని వచ్చాడు

'రామదాసు గార్నొకసారి పిలువు'.

రామదాసు పరిగెత్తుకుంటు వచ్చాడు.

'...ఇందాకటి ఫైలు రెడీ చెయ్యండి. ఆఫ్ ఏన్ అవర్‌లో పిలుస్తాను ఈ లోపల నన్ను డిష్టర్బు చేయవద్దు' అంటూ అతన్ని పంపించేసి లత పూర్తి చేయవలసిన పని పూర్తి చేయటానికి కూర్చున్నాను; టైపురైటర్ ముందు

శశి పదే పదే కళ్ళముందు కదులుతూవుంటే అనుకున్న టయిముకన్నా అరగంట ఆలస్యంగా ఇవతలికివచ్చాను ఆఫీసునుండి. రామదాసు సెలవు తీసికుని వెళ్ళిపోయాడు అయిదున్నర కాకముందే చీకట్లు ముసురుకోసాగాయి. చలిగాలి రివ్వున వీస్తోంది .కాని ఆ చలిగాలి ప్రతీరోజులా నన్నేమీ చేయలేకపోతోంది.

నాయర్ చేసిన టిఫిన్‌కూడ ప్రతిరోజుకన్న చాల రుచిగా ఉంది 'రాత్రికి కేంప్ ఉంది. సప్పర్ ప్రిపేర్ చెయ్యొద్దు' అని నాయర్‌కు చెప్పేసి, కారును రెడీ చెయ్యబోతున్న డ్రైవర్ ఖాసిమ్‌ను వారించి, బజారులోకి బయలుదేరాను. నేను స్టేషన్‌కి శశిని కలియటానికి వెళ్తున్నట్టు అతనికి కూడ తెలియటం నాకిష్టంలేదు.

ఆటోలో మార్కెట్టు అంతా తిరిగి స్వీట్సు, ఫ్రూట్సు, పిల్లలాడుకునే ఆటబొమ్మలు, అలా చాల రకాలు తీసికున్నాను. మూడు సంవత్సరాల తరువాత ఇదే మొదటిసారి ఆటోలో కూర్చో వటం. అదికూడ శశివలననే. శశి కోసమనే లత చేయవలసిన పనిని నేను చేసాను శశికోసమే పిచ్చాస్పత్రి మానవుడిలా ప్లాట్‌ఫారంమీద వేచి ఉండవలసి వస్తోంది. ఇక ఆమె కోసమే సెకండుక్లాసు కంపార్టుమెంటులో ప్రయాణం చేయవలసి ఉన్నది

రెడీమేడ్ క్లాత్స్ షాపులోకి అడుగుపెడుతూ వాచీ చూచు కున్నాను. ఎయిట్ ఫైవ్. రెండుజతల టెరీకాట్ డ్రెసెస్ పేక్ చేయించి, బిల్లు పే చేస్తూంటే అనిపించింది "ఇంత హంగామా చేస్తున్నాను. అసలు శశికి పెళ్ళయిందో లేదో!". "అవకపోతే ... అవును. అవకపోతే... నేనే ఎందుకు శశిని పెళ్ళి చేసుకోకూడదు?" ఛా! ఏమిటీ ఆలోచన! నేనిలాగ ఆలోచించవచ్చా?... తప్పేముంది ? నేను ఎందుకు శశిని పెళ్ళి చేసుకోకూడదు ?.. చేసికోవచ్చు ... కాని...తను నన్ను అంగీకరిస్తుందా ? లేక 'ఆ రోజు రాత్రి నీవు నన్ను ఎంతగా బాధపెట్టావు ? నేను మరచిపోలేదు నీ ముఖం నాకు చూపకు' అని అంటుందా?— అలా అన్నా అనవచ్చు. ఆల్ రైట్! ఏమి అన్నా భరించక తప్పదు. కాని ట్రైను కదులు తూంటే చెప్తాను 'నేను నీ కోసం వచ్చాను' అని. లత నీ పేరు చెప్పగానే ఎంతో ఆనందపడ్డాను. నీవు లత కలిసి విజయవాడలో తిరగటం నాకు తెలుసు. మన పరిచయం తరువాత నీవు లత గురించి చెప్పకపోయినా ఈరోజు నేను లత నీ ప్రాణస్నేహితురాలని గ్రహించాను. ఇంతకాలం నీ కోసం ఎంతో వెతికాను. నీవు విజయ వాడలోకూడ లేవని తెలిసింది. అక్కడ మీ వాళ్ళుకూడ ఎవరూ లేరని తెలిసింది ఇప్పుడు ఎవరున్నారని అక్కడికి వెళ్తున్నావు? కాని నేను మాత్రం యిక్కడ నీకోసం ఉన్నాను నీవు అంగీక రిస్తే... కాని నేనిలా మాటాడవచ్చా! తనకు పెళ్ళి కాలేదు కాబట్టి నా ఆలోచనలు ఇలా పోతున్నాయిగాని నేనిలా ఆలోచన చేయవచ్చా!..." ఇలా తర్జనభర్జన పడుతూ బిల్ పే జేసి ఒక ప్లాస్టిక్ బాస్కెట్‌నుకొని అందులో శశికోసం కొన్నవాటిని సర్దాను.

ప్రక్కనే ఉన్న కాఫీ హోటల్లోకి పరుగెత్తి రైల్వే ఎంక్వైరీకి ఫోన్ చేసాను. పదిహేను నిముషములలో ట్రైన్ వస్తున్నదని ఫోన్ వచ్చింది. పరుగెత్తే నడకతో కొద్ది దూరంనడిచి ఆటో అందుకున్నాను. ఆటో ఫేర్ యిచ్చేసి స్టేషన్‌లో అడుగు పెడుతూంటే "నమస్తే! సార్!" అన్న రెండు గొంతుకలు వినిపించాయి.

తలత్రిప్పి ప్రక్కకు చూశాను. ప్రక్కనే లత, మూర్తి వాళ్ల చేతుల్లో చాల సరంజామా. "సార్!...సార్!...మీరూ..." మూర్తి అంటూంటే "అవును నేను తుని వరకు వెళ్ళాలి. అర్జెంట్ పని" అన్నాను వాళ్ళ దృష్టిలో పడినందుకు ఒకింత బాధ పడుతూ

"కారుందిగా సార్?...మరి...మరి.. "

"ఇవ్వాళ ట్రైనులో ప్రయాణం చేయాలని కోరికకలిగింది. ఐ హేవ్ గాట్ ఎ డిజైర్. ఓ.కే!" అన్నాను.

"ఓ. కే సార్. టిక్కట్ తెస్తాను" అంటూనే చెప్పేది వినిపించుకోకుండ టికెట్ కౌంటరువైపు పరుగెత్తాడు మూర్తి. అతను వచ్చేసరికి ట్రైన్ స్టైట్ అయింది. టికెట్ అతని దగ్గర తీసుకుని, పది రూపాయల నోటు అతని చేతిలోపెట్టి ప్లాట్‌ఫారం మీదికి పరుగెత్తాను నా వెనుకనే పరుగెత్తుకుని వచ్చారు లత, మూర్తి.

ట్రైన్ వస్తున్న అలజడి వినిపించసాగింది.

లత, మూర్తి నాకు సమీపంలో నిల్చుని ఆత్రుతగా చూస్తున్నారు.

నా గుండె వేగాన్ని మించి స్పందించసాగింది. ఒళ్ళు ఒక్క సారి చమట పట్టింది. గొంతు తడారిపోయింది. రక్తనాళాలలో తిరుగుతున్న రక్తం ఒక్కసారి ఎక్కడి కక్కడ ఆగిపోయి ఒక్కసారి గుండెలోకి తన్నుకొచ్చినట్టు గుండెలో దడ. కళ్ళలో మంట. చేతు లలో సన్నని వణుకు. ఒంటిమీద చమట ఆరిపోయేంత వేగంగా ఒంట్లోంచి వేడి. కళ్ళు మూతలు పడుతున్నట్టు — తల గిర్రున తిరుగుతున్నట్టు.

రొద చేసికుంటూ ట్రైన్ దూసుకుని వచ్చేసింది.

"అదిగో శశి". ఆనందంతో అరిచింది లత.

కణతలు నొక్కుకుంటూ, పెదమలు తడిచేసికుంటూ అటు చూడప్రయత్నించాను. లత చూపించిన కంపార్టుమెంటు మమ్మల్ని దాటి వెళ్ళిపోయింది నేను శశిని చూడటానికి వీలుపడలేదు, లత, మూర్తి అటువైపు కదలబోతూ—

"సార్ ! మీకు ఎకామెడేషన్......" అన్నారు.

"ఫరవాలేదు. దూర ప్రయాణం కాదుగా నే నెక్కడనైనా ఎడ్జస్టు అవుతాను. మీరు మీ స్నేహితురాలిని కలియండి" అన్నాను.

"మళ్ళా కలుస్తాం సార్!" అంటూ కదిలేరు ఇద్దరూ పరుగెత్తే వేగంతో.

వాళ్ళు వెళ్ళినదారినే చూస్తూ నేనూ వారి ననుసరించాను శశిని చూడబోతున్నందుకు ఆనందం, అనుకోకుండ చాల కాలానికి ఆమె కంటపడ బోతున్నందుకు, అలాంటి అవకాశం వచ్చినందుకు ఆశ్చర్యం నాలో ముప్పిరి గొన్నాయి.

"శశీ ! నేను నీ కోసం, నిన్ను చూడటం కోసం వచ్చాను" పిచ్చిగా అరవాలనిపిస్తూంటే పరుగెత్తే నడకతో అటే వెళ్ళాను

లత పరుగెత్తుతూ స్లీపర్‌కోచివైపువెళ్ళి "హాయ్! శశీ!!" అంటూ కౌగలించుకుంది. లతను కౌగలించుకుని, లత భుజంమీద

తలపెట్టి ఆనందంగా నవ్వుతున్న ఆమెను చూశాను. గుండెలోకి రక్తం ఒక్కసారి దూసుకుపోయింది గుండెలో కవాటాలు యధావిధిగా పనిచేయసాగాయి. కొండ ఎత్తున ఎగసిన ఉత్సాహమంతా నీరుగారిపోయింది. అయినా ఆశ. పరిశీలనగా ఆమెనే చూశాను. ఆ కళ్ళకోసం, ఆ కళ్ళలో మెరుపుల కోసం, గులాబీలు పూచే ఆ చెక్కిళ్ళ కోసం, కొనదేరిన ఆ చుబుకం కోసం మరీమరీ చూశాను. వెన్నెల మసకబారి పోయింది. చీకటి కళ్ళు తెరచుకుంది నిరాశతో వెనుతిరిగి, కొద్ది దూరం నడిచి, ఇక నడవలేక, దగ్గరే ఉన్న సిమ్మెంటు బల్లమీద కూలబడ్డాను. లత, మూర్తి, ఆమె, నాకు కనిపిస్తునే ఉన్నారు. ''శశీ!'' దీర్ఘంగా ఒక నిట్టూర్పు విడిచాను.

సిగరెట్‌ను వెలిగించి, పెదవులమధ్యకు తీసికోబోతూ మళ్ళా ఆశతో అటేచూశాను ముగ్గురూ కంపార్టుమెంటులోకి నడిచారు. ఆమె శశిరేఖ కాదు.

నవ్వు...ఆ సిగరెట్ పొగల మధ్య శశి నవ్వు...నన్ను ఎగతాళీ పట్టించేటప్పుడు నవ్వేదే అట్లా!...ముఖానికి చేతులు అడ్డంగా పెట్టుకుని నవ్వే నవ్వు...చేతివ్రేళ్ళ మధ్య నుండి దొంగి చూపులు చూస్తూ నవ్వే నవ్వు...పొడవైన మెడను వెనక్కి వంచి, గుండెలు ఎగసిపడగా నవ్వేదే అదే నవ్వు...నన్ను ఏప్రియల్ ఫూల్‌ని చేస్తూ నవ్విందే అదే నవ్వు...నా సిగరెట్ పాకెట్స్‌ను దాచేసి నన్ను బాధపెడుతూ నవ్విందే అదే నవ్వు...వాటర్ కలర్సుతో కొబ్బరిచెట్ల మధ్య అందమైన పర్ణకుటీరాన్ని దిద్దుతూంటే, కంచెతో గీతలు పెట్టేసి పారిపోతూ, జారిపోయే పయ్యెదను సవరించుకుంటూ నవ్విందే అదే నవ్వు...నన్ను ఏడిపించేనవ్వు; కవ్వించే నవ్వు, ఊరించే నవ్వు,...గలగలపారే సెలయేటి నవ్వు, ... ప్రతీసారి నేనానందించే నవ్వు,...ఈరోజున నేను భరించలేని నవ్వు...''

''శశీ!'' చెవుల చేతులతో మూసికుంటూ అరిచాను

''బాబూ! పిలిచారా ?'' అంటూ అటుపరుగెత్తే పోర్టరు, అదే పరుగుతో వచ్చి అడిగాడు. అతనివైపు అయోమయంగా చూస్తూ ''లేదు'' అన్నాను.

గొణుక్కుంటూ, తలపాగా సవరించుకుంటూ వెళ్ళిపోయాడు వాడు.

''సార్! మీరిక్కడున్నారా ? మీకోసం ప్లాట్‌ఫారం అంతా వెతుకుతున్నాను. రండి. టూ టైర్‌లో ఎకామిడేషన్ దొరుకుతుంది'' అన్నాడు మూర్తి.

''సారీ! మూర్తి!! నే నీ రోజు ప్రయాణంచేసే స్థితిలో లేను. ఆరోగ్యం బాగోలేదు. నేనింటికి వెళ్ళిపోవాలి. వెళ్ళిపోతాను'' అంటూ లేచి నిల్చున్నాను.

మూర్తి నావైపు కంగారుగా చూస్తూ ''పదండి సార్! అయితే,'' అంటూ బాస్కెట్ అందుకున్నాడు. బహుశా లతకోసం కొన్న ప్లాట్‌ఫారం టిక్కెట్టువలన కాబోలు నన్ను గేటుదాటించాడు మూర్తి.

ఆటోలో కూర్చుంటూ ''ఆ! మూర్తీ! అడగటం మరిచాను. మీరెవరికోసం వచ్చారో ఆమె వచ్చిందా ?'' అడిగాను ఇంకా ఏదో సంశయం పీడిస్తూండగా.

''వచ్చింది సార్! శశికళ అనే ఈమె లతతో కలిసి ఆరు నెలలు ఇక్కడే సేల్సుగర్ల్‌గా పని చేసింది సార్. తక్కువకాలమైనా వాళ్ళిద్దరూ ప్రాణ స్నేహితురాండ్రైనారు. అసలు ఇద్దరూ విజయవాడలో ఒక సంవత్సరం కలిసి చదువుకున్నారు కూడా!''అన్నాడు.

''ఐసీ!'' అన్నాను మరేమనాలో తెలియక.

''టిక్కెట్ ఇవ్వండి సార్! రిఫండ్ తీసికుందాం''అన్నాడు.

చేతిలోచూశాను. లేదు. ''ఎక్కడోపడిపోయింది మూర్తీ!'' అన్నాను.

''బయలు దేరుదామా సార్!'' తొందర చేసాడు ఆటో డ్రైవర్!

''వన్ మినిట్'' అని మూర్తినిచూసి ''మూర్తీ! ప్లీజ్! ఈ బాస్కెట్ తీసికో. ఇందులోవి మీ పిల్లలకి యియ్యి'' అన్నాను బాస్కెట్ అతనికి అందిస్తూ.

''అదేమిటిసార్! వద్దుసార్!! మీరెవరికోసం కొన్నారో వారికే ఇవ్వండిసార్! రేపైనా వెళ్తారు కదండిసార్, ఎందుకుసార్! ఉంచండిసార్!''

''నే వెళ్ళే అవుసరంలేదు మూర్తీ, నే నిక స్టేషన్‌కివచ్చే అవసరం కూడ రాదు తీసికో. ఆ! డ్రైవర్! వెళ్దామా?'' అన్నాను.

ఆటో కదిలింది. మూర్తి ''గుడ్‌నైట్'' అంటూంటే శశి నవ్వులమధ్య ఆటో కదిలింది. ఆ రోజు రాత్రి గుండెమీద తలపెట్టి ఏడుస్తూ, పిచ్చిగా నవ్విందే ఆ నవ్వులమధ్య ఆటో కదిలిపోయింది'' అంటూ కాగితాలు మడిచాడు రఘురాం. నేను కళ్ళెత్తి కళ్ళజోడును సవరించుకున్నాను.

''కథ ఎలా ఉంది గురువుగారూ!'' అన్నాడు రఘురామ్.

''చాల బాగుంది. 'నాకూ అలాంటి శశి ఉంటే బాగుండునేమో'''! అనిపిస్తోంది అన్నాను. సిగ్గుపడుతూ ఒక నవ్వు నవ్వాడు రఘురామ్. తరువాత కథ గురించి అయిదునిముషాలు మాటాడి వెళ్ళిపోయాడు.

ఇంట్లోకి వస్తూంటే వంటింటి గుమ్మం ముందు నిలబడి నన్నుచూసి మూతి మూడు వంకలు తిప్పింది మా శ్రీమతి.

''ఆ మూతి కేమయిందట,'' దగ్గర కెడుతూ అడిగాను.

''నా మూతికేంకాలే, అయినా మాత్రం ఏంలెండి. తొందరగా భోజనం చేసి మీ శశిని వెతుక్కోటానికి వెళ్తారా?'' అంది. నా కర్థ

(మిగతా 70 వ పేజీలో)

# గిరిజనుల నవజీవనం

గిరిజనాభివృద్ధికి పటిష్టమైన సంస్థలను ఏర్పాటు చేయడంలో ఆంధ్రప్రదేశ్ మార్గదర్శకమయింది. ఇంతవరకూ ఆంధ్రప్రదేశ్ షెడ్యూల్డు తెగల ఆర్థిక సహాయసంస్థ, గిరిజన సహకార కార్పొరేషను, గిరిజనాభివృద్ధిసంస్థ, సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థల స్థాపన జరిగింది.

రాష్ట్రంలోని గిరిజనులకు ఆర్థికంగా ఒక నూతన శకం ప్రారంభ మయింది. మూడవ ప్రణాళికా కాలంలో గిరిజనాభివృద్ధికోసం ప్రణాళికా కేటాయింపు **1.80** కోట్ల రూపాయలు మాత్రమే వుండగా, ఐదవ ప్రణాళికలో ఈ మొత్తం **49.65** కోట్ల రూపాయలకు పెరిగింది.

వ్యవసాయం, చిన్న తరహా సేద్యపు నీటి వనరులు, పశుపోషణ, విద్యుచ్ఛక్తి, విద్యారంగాలకు సంబంధించిన ప్రణాళికా పథకాలు చురుకుగా అమలు జరపడంతో ప్రగతి శక్తులు విజృంభించాయి. గిరిజనులను వారి పాత ప్రపంచం నుంచి వేరు పరచడానికి అవిరళ కృషి జరుగుతున్నది.

వారికి ఉజ్జ్వల భవిష్యత్తు ఉంది.

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు.
37/77–78



# కలగూరగంప

## నేనెఱిగిన గంటి శాస్త్రి గారు

ఇప్పటికి నలుబది నాల్గేండ్ల క్రిందటి ముచ్చట. ఆ కాలమున—ననగా క్రీ. శ. 1933లో — నేను విజయనగరమున ఇంపీరియల్ బ్యాంకులో గుమాస్తాగా పనిచేయు చుండేవాడను మా బ్యాంకుకు దగ్గఱగానే శ్రీ గంటిశాస్త్రిగారి 'కల్యాణి' పత్రికా కార్యాలయముండెడిది. బ్యాంకు పని ముగియగానే నేనచ్చటికి వచ్చి ప్రతి దినము రాత్రి 8గంటలవఱకు వారితో నుండెడివాడను. కల్యాణి పత్రిక, గంటి శాస్త్రిగారు అనగానే మనకు స్ఫురించు మఱియొక పేరు—క్రీ. శే. పసుమర్తి వీరభద్రస్వామిగారు. ఆయన విజయనగర రాజకీయ నాయక శిరోమణి. ఆయన కన్యకాపరమేశ్వరి ముద్రాక్షరశాలలోనే 'కల్యాణి పత్రిక' అచ్చగు చుండెడిది. సాయంత్రము నేనురాగానే శాస్త్రిగారు,నేను సాహిత్యగోష్ఠి చర్చలు ప్రారంభించేవారము. కల్యాణి పత్రికలో నా పద్యరచనలు,వ్యాసములు ప్రకటితము లగుచుండెడివి. ఆనాడు నా సాహిత్య వ్యాసంగమునకు దోహదము నొసగిన పత్రికలలో కల్యాణి పత్రిక యొకటి. నాకే గాదు. విజయనగరమున సాహిత్యోజ్జీవనము; సారస్వత సంచలనము కలిగించినది కల్యాణి పత్రికయే. కాగా శాస్త్రిగారికి, నాకు పరిచయము యీ పత్రిక మూలముననే యనుట నిర్వివాదము.

## శృంగార శాస్త్రి

గంటి శాస్త్రిగారి పూర్తి పేరు గంటి సూర్యనారాయణ శాస్త్రి. ఆయన విజయనగరము వచ్చునాటికే— శృంగార శాస్త్రి, ఖాదీ శాస్త్రి, కల్యాణి శాస్త్రి అని మూడుమూర్తులుగా యావదాంధ్రదేశమున ప్రఖ్యాతి వహించినారు. అందు తొలిదియగు శృంగారశాస్త్రి మూర్తి.

తెలుగు దేశమున పూర్వప్రబంధములను సర్వాంగ సుందరముగా, సకల జననేత్రానందకరముగా ముద్రించిన కీర్తి గంటి శాస్త్రిగారిదే. ఆయన శృంగార గ్రంథమాలయని పేరితో మద్రాసులో నొకగ్రంథమాల స్థాపించి అందు, శృంగార ప్రబంధములైన రాధామాధవ సంవాదము, అహల్యా సంక్రందనము, సత్యభామా సాంత్వనము, రాధికాసాంత్వనము, భల్హాణ చరిత్ర మొదలగు 10 కృతులు ముద్రించి, వాని వ్యాప్తికి తోడ్పడినారు. ప్రతి కావ్యము 'శృంగార' అను ఉపనామముతో నుండెడిది. అన్నింటికన్న ముఖ్యముగా నీ గ్రంథమాలలో వెలువడినది వినుకొండ వల్లభరాయని క్రీడాభిరామము. క్రీ. శే. వేటూరి ప్రభాకర శాస్త్రి గారి విపుల పీఠికతో నున్నది. ఈ గ్రంథము మూలమున గంటి శాస్త్రి గారి కీర్తి ఆంధ్ర సాహిత్య ప్రపంచమున స్థిరమైనది పై గ్రంథములే కాక – శాస్త్రి గారు "శృంగారము" అను పేరున — శృంగార పదములైన పద్యములను వ్రాయించి, ప్రకటించిరి.ఆనాడును పద్యములు వ్రాసినవారిలో క్రీ. శే. ఆచంట సాంఖ్యాయన శర్మ, క్రీ.శే.సెట్టి లక్ష్మీ నరసింహము మొదలగు వారు కలరు. ఆ శృంగారము సంపుటి యందు పద్యములు వ్రాసిన వారిలో నే నొకడను. వాని నుదాహరించుచున్నాను. ఈ సంపుటి 1927 లో వెలువడినది.

చ॥ వలరసమూనజేయు పరువంబగు పల్కుల, బాహుమూల దీ
పృల రుచిరాంగ సౌష్టవముపోడిమి రాగ రసైకకాంతులన్
గులికెడు చూపుచేత, దమి గూర్చెడు నవ్యమనోను రాగమిం
పలరగ నిల్చె పుష్పిత లతాకృతితో నొకభామ యయ్యెడన్.

ఈ శరీరము నాత్మయే యనుచు జెప్ప
నట్టి చార్వాకు మాట తథ్యం బెసుమ్మ
చెక్కిలిని ముద్దు పెట్టగా శీఘ్రగతిని
పులకలొంద వెడు సర్వాంగములను నపుడె —

శృంగార పరముగా నాచేత పద్యములు వ్రాయించిన యశస్సు శాస్త్రి గారిదే నా కవితలో నాటికి నేటికి పైరెండే శృంగార పద్యములు.

## కాశీనాథుని నాగేశ్వరరావుగారు

## గంటి శాస్త్రి

గంటి శాస్త్రిగారు ఆంధ్ర సాహిత్య లోకమునకు పరిచితులగుటకేగాక, వారి యభ్యుదయమునకు మూల కారకులు కైలాసవాసి కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు. గంటి శాస్త్రిగారు పూర్వపద్ధతిని చదువుకొన్న కాశీ పండితుడే యైనను, ఆతనికిగల లౌకిక వ్యవహార జ్ఞానము, చుఱుకుదనము కనిపెట్టి నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్రపత్రికా కార్యాలయమున నతనిని నియమించిరి. అక్కడ పనిచేయుచు గంటి శాస్త్రిగారు అచ్చుయంత్రమును నడపుటగూడ నేర్చుకొనిరి. ఒక మారాయన ఆ అచ్చుయంత్రము నడపుచుండగా ఆయన కుడిచేతి చిటికెనవ్రేలు ఆ యంత్రమునపడి తెగినది. అయినను దానిని శాస్త్రిగారు సాధించినారు.

ఆంధ్రపత్రికా కార్యాలయమున పనిచేయుచునే శాస్త్రిగారు శృంగార గ్రంథముల ప్రకటనప్రారంభించినారు. కొన్ని ప్రబంధములను ఆంధ్రపత్రిక ముద్రణశాలలోనే ముద్రించినారు. దానివలన లాభమును ఆయనే పొందుచుండెడివారు. దీనివలన పంతులుగారికి కొంత నష్టము గలిగినది. అయినను ఆయన దానిని పాటింపలేదు. ఒక ప్రాచీన పండితుడు, గ్రంథ ముద్రణమున, పుస్తక వ్యాపారమున, నభివృద్ధి చెందుచున్నాడన్న సంతోషమేగాని, ఆయన కితర దృష్టిలేదు. పంతులుగారి మహా ఉదార స్వభావమట్టిది. ఒక వ్యక్తిని పైకి తీసికొని వచ్చుటయే ఆయన ఆశయము.

పై విషయమునుబట్టి గంటి శాస్త్రిగారికి తొలుత శృంగార గ్రంథప్రచురణకు ఆంధ్రపత్రికయే ఆలంబనమైనదని తెలియగలదు. శాస్త్రిగారికి కొన్ని కిటుకులు తెలుసును. మొట్ట మొదట గ్రంథమును పంపునపుడు ఆయన ఆ గ్రంథములోనొక దానియందు 5 రూపాయలనోటు పెట్టెడివారు ఆ గ్రంథము తెప్పించిన వారది చూడగానే, ఆతడు నలుగురితోను చెప్పెడివారు. వెంటనే పదులకొలది పుస్తకములకు ఆర్డరులు వచ్చెడివి. దానితో శాస్త్రిగారికి లాభము వచ్చినది. దీనికంతకు హేతుభూతులు పంతులుగారే. వారి మూలమున గంటి శాస్త్రిగారిద్వారా, శృంగార గ్రంథములు విద్వన్మనోహరముగా వెలుగులోనికి వచ్చినవి.

ఆంగ్ల ప్రభుత్వము వారా నాడు తెలుగున శృంగార గ్రంథములను నిషేధించిన కాలములో — శృంగార రసమే ప్రధానముగా గల మన ప్రాచీన ప్రబంధములనేకములు బాహాటముగా ముద్రణకు వచ్చుటయే కష్టమైనది. ఆ కావ్యములడుగున బడిపోయినవి. అట్టి పరిస్థితులలో — గంటి శాస్త్రి గారే కైకముగ శృంగార గ్రంథములను, నుత్తమ స్థాయిని ప్రకటించిరి . ఆంధ్ర ప్రబంధ ముద్రణ చరిత్రమున వారికి సముచిత స్థానము గలదు. అది విస్మరింపరానిది.

## ఖాదీ శాస్త్రి

గంటి శాస్త్రిగారెప్పుడును ఖాదీ వస్త్రములనే ధరించెడివారు. పంచ, — కుడితినీ,—వాణీ ఇదియే ఆయన వేషము. ఆయన తక్కిన వారివలె గాంధీ ఖాదీ ఉద్యమానంతరమున ఖాదీ ధరించిన వారు కాదు. ఉద్యమ ప్రారంభము నుండియు ఖాదీ ధరించిన స్వాతంత్ర్య ప్రియుడు.

## ఖాదీ వస్త్రాలయము - కేరళదేశము

1921 లో మహాత్మా గాంధీ స్వాతంత్రోద్యముతో ఖాదీ వస్త్రధారణ ప్రారంభమైనది. ఆ సంవత్సరముననే గాంధీగారిని మన శాస్త్రి గారు ఖాదీ వస్త్రములను ధరించి దర్శించినారు. గాంధీ శాస్త్రి గారిని హిందీ భాషలో మీపేరేమి యని ప్రశ్నించినారు. వెంటనే శాస్త్రిగారు హిందీభాషలో ''గంటిసూర్యనారాయణ శాస్త్రి'' అని ప్రత్యుత్తరము చెప్పినారట గాంధీ తాన ప్పుడే ప్రారంభించుచున్న ఖాదీని ఆచరణలో పెట్టిన గంటి శాస్త్రిగారిని చూచి ఇక నుండి మీపేరు ''ఖాదీ శాస్త్రి'' యని చెప్పెను. నాటి నుండి ఆయన ఖాదీ శాస్త్రియైనారు.

గాంధీ ఇట్లు పేరు పెట్టుటయే గాక మన శాస్త్రి గారితో కేరళ దేశమున ఖాదీ భాండాగారము నెలకొల్పి ఖాదీ పరిశ్రమ ప్రచారము చేయవలసియున్నది. మీరు సంస్కృత విద్వాంసులు. అచ్చటికి మీరు వెళ్ళిన యెడల ఖాదీ ఉద్యమము ఫలవంతమగును అని చెప్పి ఆయనను కేరళదేశము పంపినారు. శాస్త్రిగారచ్చట 1921–22 రెండు సంవత్సరములుండి అచ్చట ఖాదీ వ్యాప్తికి అపారముగా తోడ్పడినారు.

## గాంధీ అష్టకము

కేరళ దేశమున నున్నప్పుడే అక్కడి వారి కోరిక ననుసరించి, గాంధీపై సంస్కృతమున నొక యష్టకము చెప్పిరి ఆ యష్టకము పూర్తిగా లభింపలేదు. వారి వలన స్వయముగా నెఱిగి నేను మూడుశ్లోకములను మాత్రము సంగ్రహింపగలిగినాను. ఆ మూడింటి నీ క్రింద నిచ్చుచున్నాను.

శ్లో॥ శాంతం సాంతం నితాంతం సకలజన మనోహ్లాదయంతం విభాంతమ్
కారాగారే వసంతం సమధిక తపసా జ్యోతిషా దీప్తిమంతమ్
ధర్మాహింసాది బీజాన్ సకల జనమన క్షేత్ర నిక్షిప్తవంతమ్
స్వాతంత్ర్య జ్యోతి మంతం ప్రణమత సతతం గాంధి దేవం విభాంతమ్.

శ్లో॥ గంభీరాకార వైదేశిక వసన మహాయంత్ర సంతాన సంపద్ద్వారీ కర్తృ సమర్థమ్ సమధిక చరఖా చక్ర రాజల వహంతమ్
ఖాదీ వస్త్రేణ భాంతం, కరకమల లసద్భూర కార్పాస శంఖం బిభ్రంతం గాంధి దేవం ప్రణమత సగదా ధారిణం ధన్వినంతం

శ్లో॥ వందే భారత మాతరం సరసుతాం సస్యాది సంశోభితామ్
వందే లోక హితైషిణీ సకరుణం శ్రీ బాలగంగాదరమ్
వందే గాంధి మహాశయం గురువరం గోపాల గోక్లే విభుమ్
వందే పండిత మోతిలాలు నెహ్రూహారందాసు సదాభాసురమ్

ఈ శ్లోకమున — ఉద్యమ ప్రారంభమున — గాంధీకి కుడియెడమ భుజములవలెనున్న మోతీలాలు నెహ్రూ—చిత్తరంజనదాసు పేర్కొనబడుట యెంతయు హృద్యమేగాక సార్థకమైయున్నది. బాలగంగాధరతిలకు గాంధీకిముందు భారత రాజకీయ నాయకుడు. గోపాలకృష్ణ గోఖలే గాంధీకి రాజకీయముగా ఆదర్శ పురుషుడు. పై శ్లోకమువలన శాస్త్రిగారి రాజకీయ పరిజ్ఞానము తేటపడగలదు.

## కల్యాణి శాస్త్రి

సాహిత్యమున గంటి శాస్త్రిగారిపేరు 'కల్యాణి' శాస్త్రిగా రూపొందినది. 'కల్యాణి' పత్రికను తొలుత శాస్త్రిగారు శృంగార గ్రంథములను ప్రచురించిన మదరాసుననే స్థాపించిరి. ఆ తరువాత మదరాసువీడి, వారు విజయనగరమునకు వచ్చి, అచ్చట స్థిరపడి కల్యాణి పత్రికను తిరిగి ప్రారంభించిరి.

## కల్యాణీ పత్రిక

ఈ పత్రికను మూడేండ్లు శ్రీ శాస్త్రిగారు బహుసమర్థతతో నడపిరి. దీనికి ముఖ్య పోషకులు శ్రీ పసుమర్తి వీరభద్రస్వామిగారే. ఈ పత్రిక విజయనగరమునుండియే వెలువడినను నాంధ్రదేశమున వ్యాప్తిని గన్నది. ఇందు – పద్యములు, వ్యాసములుగూడ ప్రకటితము లగుచుండెడివి. పద్యములు సాధారణముగా పూర్వ రచనలే యుండెడివి కీ. శే. మా నాయనగారు నిడుదవోలు సుందరం పంతులుగారి 'సత్యవతి' శతకమిందు ముద్రితమైనది. నేను రచించిన ''బిల్హణ కవిత''యను బిల్హణుని విక్రమాంకదేవ చరిత్ర కృత్యావతారిక, పద్యములు – 30 యిందు ప్రకటితమైనవి. వ్యాసములలో నీనాడు విస్మృతులైన మండపాక పార్వతీశ్వర శాస్త్రి గారి అమరుకము, భాషా వివాదము అనునవి ముఖ్యములు ఆ కాలమున నేను రచించిన వ్యాసములందు ముద్రితములైనవి. 1) అమరుకము- 3 సంచికలు, 2) మయూర మహాకవి సూర్య శతకము–3 సంచికలు, 3) ఆదంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మ జీవితము–2 సంచికలు.

నవీనుల వ్యాసములేగాక, పూర్వపత్రికలలోని వ్యాసములు నిందు పునర్ముద్రితమగుట విశేషము. కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు–క్రీ.శ. 1874 ఆంధ్రభాషా సంజీవనిలో ప్రకటితమైన యొక సంపాదకీయ వ్యాసమును–''భావసంవత్సర భావాలు'' అని పేరితో శాస్త్రిగారు ప్రకటించినారు.

## మహాత్ముని రచన

సాహిత్యము ప్రధానమైన యీ పత్రికలో, మహాత్ముని ఆంగ్లరచన యొకటి ప్రకటితమగుట యన్నింటికన్న విశేషము.

మహాత్ముడు – 1933లో తుని ( తూర్పు గోదావరీ మండలము) యందు ప్రసిద్ధిగన్న శ్రీ రాజా వీర్రాజ్ఞల్లపరాజు అచ్యుతరామరాజును దర్శించి, ఆతని శరీర సౌందర్యమునకు–సంగీతమునకు ముగ్ధుడై ఆతని నాంగ్లభాషలో నిట్లు ప్రశంసించినారు:

యువర్ స్వీట్ అండ్ లవ్లీ గిఫ్ట్ బి స్పీక్స్
ఆఫ్ యువర్ ఫెయిర్‌నెస్ ఆఫ్ బాడీ అండ్ సోల్
హవ్ లాంగ్ విల్ యు కీప్ మీ ఫ్రమ్
మై వర్క్ విద్ యువర్ స్వీట్ మ్యూజిక్

ఆ సందర్భమున కవులు పద్యములు చెప్పినారు. మహాత్ముని గూర్చిన యీ యుదంతము నింతవఱకు గాంధి చరిత్ర కెక్కలేదు. 1969లో 'నా గాంధీ సాహిత్యము'అను గ్రంథమున దీనిని వివరించి యున్నాను.

## సాహిత్య సభలు - సమావేశములు

విజయనగరమున నేనే సాహిత్యసభయైనను శాస్త్రిగారిమూలము ననే జరిగెడిది. ఒకసారి – హరికథా పితామహు దడ్జాదిభట్ల నారాయణదాసు తానెప్పుడు ఒక పండిత సభ కధ్యక్షుడను కాలేదు. విద్వజ్జనులకు నిలయమైన విజయ నగరమున నట్టి గౌరవము నాకు కల్గించవలెను అని శాస్త్రి గారిని కోరినారు. శాస్త్రిగారు విజయనగరమున నున్న కవులను, పండితులను నందరిని సమావేశపఱచి, ఆ సభకు నారాయణదాసు నధ్యక్షునిగా జేసిరి. మహామహోపాధ్యాయ తాతారాయడు, శాస్త్రి మొదలగు వారందఱు ప్రసంగించిరి. నేనును, దాసుగారి కోరికపై అచ్చతెనుగులో మాటలాడితిని. నారాయణదాసు తన అధ్యక్షోపన్యాసము ఆశువుగా పద్యములోనే చెప్పెను.

రాయడు శాస్త్రిగారి షష్టిపూర్తి మహోత్సవములలో సంస్కృతము, తెలుగు, ఇంగ్లీషు - ఈ మూడు భాషలలోను ఒకే పత్రమున అభినందన పత్రమును కల్యాణి పత్రిక పక్షమున సమర్పించినారు. అందఱు నాశ్చర్యపడినారు.

## సంగీత కళాభిజ్ఞత

శాస్త్రిగారికి సాహిత్యమునందెంత యభినివేశమో సంగీతము నందంత మక్కువ. విజయనగరము సంగీత కళాశాలలో సంగీతాధ్యాపకులైన కీ. శే. పేరి రామమూర్తి గారిని, ఒక సభలో సన్మానించి సువర్ణ పతకము నిప్పించిరి.

అట్లే ఫిడేలు నాయుడు గారని పేరు పొందిన ద్వారం వెంకటస్వామి నాయుడు గారి ప్రతిభను తొలుత కల్యాణి పత్రికా ముఖమున వెల్లడించి సభ చేయించి సన్మానించి తరువాతి వారికి జరిగిన సత్కారములకు హేతుభూతులైనారు. నాయుడు గారికి గంటి శాస్త్రి గారి యందు విశేష గౌరవము కలదు.

## యువ కవి పండితులకు ప్రోత్సాహము

యువకులగు కవి పండితులను ప్రోత్సహించుట యందు శాస్త్రిగారి కుత్సాహము మెండు ఆనాడు విజయనగరము సంస్కృత కళాశాలలో చదువుచు, ఈనాడు పండితులై ప్రసిద్ధి గాంచిన, కొమ్మనమంచి జోగయ్య శర్మ, యాముజాల పద్మనాభ స్వామి గార్ల గద్యపద్య రచనలను తొలుత కల్యాణి పత్రికలో ప్రకటించిన వారు శాస్త్రిగారే వీరి కవిత రచనలు ప్రాచీన సత్సంప్రదాయకములు.

## నవ్య కవిత

శాస్త్రిగారు ప్రాచీన సంప్రదాయ కవితనే గాక, నవ్య కవితను నాదరించిన ప్రాచీన పండితులు. ఆ కాలమున శాస్త్రి గారి వంటి సంస్కృత పండితులు – కొందఱు తెలుగు కవిత్వము నీసడించెడి వారు. వారు దాని జోలికే పోయెడివారు. శాస్త్రి గారందులకపవాదము.

శాస్త్రి గారు కాశీలో తర్క వ్యాకరణ తీర్థులైన పండితులైనను, తెనుగు కవిత యందు - అందును నవ్యకవిత యందును నెంతో ఆప్యాయత గలవారు. నవ్య యుగమున జానపద వాఙ్మయమునకు నాందీ ప్రస్తావన చేసిన నండూరి సుబ్బారావుగారి 'ఎంకి పాటలు' మొదట ముద్రించినది శ్రీ శాస్త్రిగారే. ఆ వెనుక అతివాస్తవిక కవిత వ్రాసిన—శ్రీరంగం నారాయణ బాబును శాస్త్రి గారాదరించినారు. ప్రసిద్ధ కథానికా రచయిత పూడిపెద్ది వెంకట రమణయ్య కథానికలను మొదట ప్రకటించిన వారు శాస్త్రి గారే

## ఆంధ్ర విజ్ఞానసమితి - గ్రంథమాల

కల్యాణి పత్రిక ఆగిపోయిన వెనుక శ్రీ శాస్త్రిగారప్పటిలో విజయనగర సంస్థానము ఇంజనీయరుగారైన శ్రీ వేపకొమ్మ ఆదిశేషయ్యగారి ఆదరణమున — ఆంధ్ర విజ్ఞానసమితి గ్రంథమాల స్థాపించి, ప్రాచీన ప్రబంధములను మునుపటిరీతిని మనోహరముగా క్రౌను సైజులో వెలువరించిరి వాని వివరములు—

రాధామాధవ సంవాదము—వేదదడ్ల వెంకట పతి, వాల్మీక చరిత్ర—రఘునాథ భూపాలుడు ఈ రెండింటికి పీఠికలు నే నే రచించితిని ఆ వెనుక—రుక్మవతీ పరిణయము, తత్త్వసంగ్రహ రామాయణము ప్రకటించిరి. వేపకొమ్మ ఆదిశేషయ్యగారు, ఆయన ధర్మపత్ని శేషమ్మయు కలిసి సమకూర్చిన 'ధర్మజ్ఞచరిత్ర' యిందే ప్రకటితమైనది. ఆడిదము రామారావుగారు రచించిన 'విస్మృత కళింగాంధ్రకవులు' ఇందే ప్రకటితము.

## మా సాన్నిహిత్యము

నేను బ్యాంకుపని అయిపోగానే మేము ప్రతి దినము కలుసుకొనుటయేగాక, సెలవు దినములలో దినమంతయు కలిసియే గడిపెడివారము ఆ కాలమున కవులు, పండితులు తమ సందేహములను తీర్చుకొనుటకు, క్రొత్త విషయములను తెలుసుకొనుటకు మా వద్దకు వచ్చెడివారు నేనా కాలమున అనర్గళముగా వానిని దెలుపుచుండేవాడను. అందులకు శాస్త్రిగారు, ''నీకు తోయకపోతే నిడుదవోలువారి నడగనయ్యా' అనేవారు ఈ విషయమును శ్రీ తిరుమల రామచంద్రగారు తమ 'మఱపురాని మనీషి' లో నుట్టంకించినారు

## శాస్త్రిగారి రచనలు

## తమాషా పంచాంగము

శాస్త్రిగారెంత పండితులో అంత రసికులు ఎల్లప్పుడు ఉల్లాసముగా నుండువారు. చమత్కార ప్రియులు. వారు విజయనగర సంస్థాన చరిత్రతోపాటు, తమాషా పంచాంగమురచించినారు. అది వాస్తవముగా తమాషా పంచాంగమే.

ఇందు దీపావళి గేయ రచన, సివిల్‌కోర్టు మహామంత్రము, లండను సంకల్పము మున్నగునవి గలవు:

## దీపావళి పండుగ

దీపావళి పండుగా
దీపావళి పండుగా
దీనమైన ఇండియాకు
దివ్యమైన దండుగా
చీనావారి పండుగా ?
జపాన్‌వారి పండుగా
దీనమైన ఇండియాకు
దివ్యమైన దండుగా.

## లండన్ సంకల్పము

ఆంగ్ల పాలనాకాలమున లండనువెళ్ళి వచ్చిన భారతీయులొక గొప్పగా భావించేవారు. అట్టి గొప్పదనము తెనుగువారిని నావహించినది. ఆ సందర్భమున శ్రీ శాస్త్రిగారీ లండను సంకల్పము రచించినారు

''ఓం నమో లార్డవే స్వాహా జీససే స్వాహా—మమ ఉపాత్త ధనవ్యయ ద్వారా కాంటినెంటల్ ట్యూర్ సంప్రాప్త్యర్థం సమ్యగ శిక్షితాంగ్లేయ భాషా సంశయ నివారణార్థం పల్లీగామే తా సుజనిత అనాగరకతా నివృత్తి 'సిద్ధ్యర్థం హేట్ బూట్ ట్రౌజరు ప్రముఖ వివిధ వేష పరిపూరణార్థం భూమే పూర్వ గోళార్థే పశ్చిమ ఖండే రష్యా స్పెయిను, పోర్చుగల్, నార్వే సీడనేత్యాది దేశానాం పశ్చిమ ప్రాంతే, ఇంగ్లండు మహాదేశే, చెవియట్ పర్వతస్య దక్షిణదిగ్భాగే, వేల్సు దేశస్యాగ్నేయ భాగే బ్రిస్టల్ కుల్యాయాః ప్రాగ్దేశే —మహా నాగరక ప్రదేశే శ్రీ మల్లండన్నామక మహాక్షేత్రే థేమ్సుమహానద్యాం జ్ఞానస్నాన మహం కరిష్యే''.

గ్రంథ విస్తర భీతిని పూర్తిగా నీ సంకల్పము నీయలేదు.

శ్రీ శాస్త్రిగారి కుమారులు శ్రీ రామమూర్తిగారాంగ్ల భాషా నిష్ణాతులయ్యును, ఆంధ్ర సాహిత్య సంస్కృతికార్యక్రమములలో పాల్గొనుచు, తండ్రి పేరు నిల్పుచు వర్ధమానులై యున్నారు.

శాస్త్రి గారి రచనలను పునర్ముద్రించుట కర్తవ్యము.

కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు

# తిరువారాధనము - సంధి చర్చ

1977 ఆగష్టు 'భారతి'లో శ్రీ క్రొవ్విడి లక్ష్మన్నగారు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారిని గురించి వ్రాసిన వ్యాసంలో 'భాషాసేవ' పేరిటి శీర్షిక క్రింద తెనాలి రామకృష్ణకవి పాండురంగమాహాత్మ్యంలో ప్రయోగించిన 'తిరువారాధనం' పదంలోని సంధినిగురించి శ్రీశాస్త్రిగారు చేసినచర్చనుతెలిపినారు శ్రీశాస్త్రిగారు 'తిరువారాధనం' లో మాత్రమే 'తిరు' పదం 'వు' కార సహితంగా ఉంది వేరుచోట్ల (తిరునక్షత్రం, తిరుమణి, తిరుచూర్ణం)లో ఇట్లు లేదు. కాన ఈ సందర్భములో శిష్ట వ్యవహారమే గతి అన్నట్లు చెప్పడం జరిగింది.

ఈ విషయం నా మెదడుకు కొంత మేత నిచ్చింది నా బుద్ధికి తోచిన కొన్ని విషయాలు, 'తిరువారాధనం' లోని సంధిని గురించిసివి దిగువ వివరిస్తాను.

శ్రీ వైష్ణవులలో సంప్రదాయం తెలిసినవారూ, ఆచార పరాయణులూ నేటికీ 'తిరువారాధనం' అను పదమేకాక 'తిరువధ్యయనం' 'తిరువడులు' అను పదాలు కూడా వాడడం కద్దు. పెద్దలు చనిపోయిన దినాలను సూచించేందుకు బ్రాహ్మణులు మామూలుగా 'శ్రాద్ధం, తద్దినం, తిధి' అను మాటలు వాడుతూంటారు. శిష్టులైన శ్రీవైష్ణవులు ఈ పదాలకు బదులుగా 'తిరువధ్యయనం' అను పదం ఉపయోగిస్తారు. ఎవరయినా పెద్దవాళ్లు మరణిస్తే మనం 'అతడు పరమపదించాడు' అని చెబుతాము. శ్రీవైష్ణవులు ఈ అర్థంలోనే "అతడు పెరుమాళ్ళ 'తిరువడులు' చేరుకొన్నాడు" అంటారు. 'తిరువడులు' అంటే పవిత్రమైన పాదాలు అని ఇక్కడ అర్థం. 'తిరువధ్యయనం', 'తిరువడులు' అను రెండు పదాలలోనూ 'తిరు' శబ్దం 'వు' కార సహితంగానే మనకు ప్రత్యక్షమవుతున్నట్లు అగుపడుతుంది. ఇవికాక ఇంకను కొన్ని తమిళ పదములలో ఈ 'వు' కారం ప్రత్యక్షమవుతుంది. అవి — 'తిరువణ్ణామలై', 'తిరువనంతపురం', 'తిరువెంబావై' ఇత్యాదులు.

పైన పేర్కొన్న 'తిరు' శబ్ద పూర్వక సమాసాలను విడదీస్తే అందులో ఒక సూత్రం ఉన్నట్లు మనకు గోచరించక పోదు.

తిరు + ఆరాధనం=తిరు + వు + ఆరాధనం=తిరువారాధనం.

తిరు + అధ్యయనం=తిరు + వు + అధ్యయనం=తిరువధ్యయనం.

తిరు + అనంతపురం=తిరు + వు + అనంతపురం= తిరువనంతపురం

తిరు + అణ్ణామలై=తిరు + వు + అణ్ణామలై=తిరువణ్ణామలై

తిరు + అడులు=తిరు + వు + అడులు=తిరువడులు.

తిరు + ఎంబావై=తిరు + వు + ఎంబావై=తిరువెంబావై.

పై సమాసాలు 'తిరు' శబ్దం అచ్చుతో ఆరంభమయ్యే పదాలతో కూడినందువలన ఏర్పడుతున్నవి. 'తిరు' శబ్దానికి అచ్చుతో మొదలయ్యే శబ్దం పరమైతే పైన చూపిన ప్రకారం 'వు' కారం ఆగమమవుతుంది 'వు' కారంలోని ఉత్తున కచ్చు పరమయితే తప్పక సంధి జరుగును కదా. ఆ సూత్రం చొప్పున తిరు + వు + ఆరాధనం=తిరు + వారాధనం=తిరువారాధనం అవుతుంది. అదే విధంగా మిగత పదాల్లోనూ సంధి ఏర్పడుతుంది. తెలుగులో రుగాగమ, నుగాగమ సంధులున్నాయి. (ఉదా ధీరురాలు, బాలెంతరాలు). అదే రీతిగా దీనిని 'వు'గాగమ సంధి అనవచ్చు.

కన్నడ భాషలో కూడా ఇటువంటి 'వు'గాగమ సంధి ఉంది ఉదాహరణలు —

మగు + ఇగె=మగు + వు + ఇగె=మగువిగె.

గురు + ఇన=గురు + వు + ఇన=గురువిన.

ఈ సంధిని కన్నడములో 'ఆగమ సంధి' అంటారు.

కాన తేలిందేమంటే తమిళ, కన్నడములలో ఉకారాంతమైన పదానికి అచ్చుతో ప్రారంభమయ్యే పదం కలిసినపుడు 'వు'గాగమ సంధి ఏర్పడుతుందని.

ఇది 'తిరువడులు', 'తిరువణ్ణామలై', 'తిరువెంబావై' లాంటి అచ్చ తమిళ పదములు కలిసినపుడు ఏర్పడే సంధి అయినప్పటికినీ సంస్కృత పాండిత్యం ఎక్కువగాఉన్న శ్రీవైష్ణవుల కొందరు తమిళ సంధి సూత్రాన్నే 'తిరు' పదంతో చేరుతూ అచ్చుతో మొదలయ్యే అన్ని సంస్కృత శబ్దాలకూ వాడి ఉంటారు. అందువలన 'తిరువారాధనం', 'తిరువధ్యయనం' లాంటి మిశ్ర సమాసాలు తయారయి ఉంటాయి. తెలుగు పదాలూ, సంస్కృత పదాలూ కలిసినపుడు శిష్టులు చేసిన దుష్టసంధుల వల్లనే కదా మనం నిత్య జీవితములో వ్యాకరణ శుద్ధమేమో అని భ్రమపడుతూ వాడే దురలవాటు (దుః + అలవాటు), యావన్మంది (యావత్ + మంది), అనే పదాలు ప్రచారంలోకి వచ్చినవి. అలాంటిదే 'తిరువారాధనం' కూడా అని నా ప్రతిపాదన.

శిష్ట వ్యావహారికం కూడా ఏ వ్యాకరణ సూత్రానికీ బద్ధం కాకుండా ఉండటానికి వీలులేదు కదా!

తమిళం తెలిసిన ఆంధ్రపండితులు ఎవరయినా ఈ 'తిరువారాధనం' లోని సంధిని గురించి మరింత వెలుగును వెదజల్లెదరని ఆశిస్తాను.

శ్రీ శంకరగంటి రంగాచార్యులు

# బ్రౌను ఛందస్సు : శ్రీ నిడుదవోలు సమీక్ష

'భారతి' నవంబరు 1977లో కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావుగారు ''ఆంధ్రగీర్వాణ ఛందము''పై సమీక్ష వ్రాసినారు. ఛందో విద్యార్థిగా నాకున్న అవగాహనను బట్టి దానిపై నివేదించుకోవలసిన అంశములు కొన్ని మనవి చేయుదును. విజ్ఞులు పరిశీలింతురుగాక.

నిడుదవోలువారు బ్రౌనును గూర్చి చేసిన స్తోత్రపారమంతయు నేను స్పృశించ దలచుకోలేదు. ముఖ్యముగా ఛందస్సుకు సంబంధించి అరగొర పరిజ్ఞానముగల బ్రౌనును సరైన ఆధారములు చూపకుండ ''ఛందోలక్షణ గ్రంథములను కూలంకషముగా పరిశీలించినవాడు'', ''బ్రౌను ఛందశ్శాస్త్ర పరిశోధన మన కత్యంతము నారాధనీయము''—ఇత్యాదిగా పొగడుట చాల హాస్యాస్పదముగా నాకు తోచినది.

మనవి చేయుదును—

1. ''ఆంధ్రగీర్వాణ చ్ఛందము'' అని తుక్ ప్రత్యయము చేర్చిన సాధురూపము వాడినందుకే, ''ఈ ఒక్క విషయమే బ్రౌను సంస్కృత వ్యాకరణమునం దెంత పండితుడో...మనకు తెలియగలదు'' అని నిడుదవోలువారు అన్నారు అయితే కళాప్రపూర్ణ నిడుదవోలువారు తమ సమీక్షా వ్యాసములో 'తెలుగు ఛందస్సు', 'ఆయా చ్ఛందస్సులు' (ఇక్కడ తుక్ ప్రత్యయం రాదు), 'ఛందో పరిశోధకుడు' (ఛందః పరిశోధకుడు అనవలెను)—అని యిట్లు వ్రాసి యున్నారు. వీటినిబట్టి వీరికి సంస్కృత వ్యాకరణమురాదని చెప్పవలసివచ్చును

2. ''బ్రౌను అనుసరించిన విశేష పద్ధతులు'' అని ఒక ఆరు అంశములను నిడుదవోలువారు పేర్కొన్నారు అయితే అవి సామాన్య విషయములేగాని విశేష పద్ధతులు గావని ఛందోవిదులు గుర్తించగలరు. ఉదాహరణకు—''గణ, వృత్త, యతి, ప్రాస లక్షణములను వేర్వేరుగా విభజించుట'' అనునది ఒకటి. నిజముగా ఈ పద్ధతి బ్రౌను అనుసరించిన విశేషమేనా? కళాప్రపూర్ణులంతటివారి మాట కెదురాడుట అవిధేయత కావచ్చు గాని పై పద్ధతిని అనుసరించని తెలుగు ఛందస్సు పుస్తకము నొకదానిని వారు పేర్కొనగలరని అభ్యర్థించుచున్నాను. ''పై గ్రంథ రచనా ప్రణాళిక ననుసరించి చూచిన బ్రౌను, ఆంధ్రచ్ఛందో లక్ష్య లక్షణముల నెంత యఖండ పాండిత్యము గలవాడో మనకు గోచరింపగలదు'' అని నిడుదవోలువారు అన్నమాట కేవలము 'పడికట్టు ప్రశంస' మాత్రమే. ఈ పద్ధతులన్నియు పూర్వచ్ఛందః కర్తలందరు అనుసరించినవే.

3. ''అతడు తెలుగుకవి యని తొలిసారిగా, కడపటిసారిగా నిరూపించిన దీగ్రంథమే. బ్రౌను వృత్తలక్షణములు చెప్పినప్పుడు వానిని జ్ఞాపకము పెట్టుకొనుటకు ఆయా వృత్తపాదములను స్వయముగా రచించినాడు.'' నిజమే. కాని వాటితోనే ఆయనను 'తెలుగుకవి' అనుట దురభిమాన ప్రేరితమే కాగలదు.

(ఉదాహరణకు కొన్ని మేలి పంక్తులను చూపెదను.)

చవిగల పూలమాలవలె చంపకమాలిక చెప్పినానయా.
మాటి మాటికి పాడుతుండగ మత్తకోకిల వింటివా.
సరిగా తప్పేమిలేకన్ సరసముగ మహాస్రగ్ధరా వృత్తమయ్యెన్.
మానిని దుఃఖము మానిన వారికి మారుని తొందర మానదయా.

ఇట్టి పంక్తులనుబట్టి బ్రౌనును 'తెలుగుకవి' యనుట ఎంతవరకు సమంజసమో రసజ్ఞు లాలోచించగలరు.

4. ''బ్రౌను, సమ వృత్తములను, గణములనుబట్టి—(య, ర, త, భ, జ, స, మ, న) వర్గీకరించియున్నాడు. ఇదియు నిదివరకే ఛందోలక్షణ గ్రంథకర్త చేయనిది తెలుగు ఛందస్సున నూతన పథకము'' అని నిడుదవోలువారు కొండాడి యున్నారు. (నిడుదవోలువారు గణముల వరుసను తప్పుగా గ్రహించినారు. బ్రౌను 'మయరస తజభన' అని గ్రహించినదే సరియైన క్రమము.) అయితే ఈ నూతన పథకమువలన ఒరిగినదేమి? ఏమియు లేకపోగా ఒక అవ్యవస్థ నెలకొల్పినాడు బ్రౌను. చంపకమాల కిచ్చిన పట్టిక లోని లక్షణ పద్ధతి (నూతన పథకము) తిలకింపుడు—

| | |
|---|---|
| నగణాది వృత్తములు:— | చంపకమాల |
| గణములు.— | నిజభజజజర |
| ఛందం.— | 21 |
| యతిస్థానము:— | నిజభల*భభరవ. |
| యతి:— | 11 |

(వివరణ:— నగణమును సగణముగా పొరపడే అవకాశము కద్దని నిగణముగా పేర్కొన్నాడు యతిస్థానము సూచించుచు గణముల క్రమము మార్చినాడు. అనగా వృత్తలక్షణమున గణముల క్రమము ఒక మాదిరి; యతిస్థాన నిరూపణకు గణముల క్రమము మరొక మాదిరి అయి, దురవగాహనకు తోడ్పడెడి నూతన పథకము ఇది.)

5. ''బ్రౌను ... ఛందో లక్షణ గ్రంథములను కూలంకషముగా పరిశీలించినాడు''అన్న నిడుదవోలువారి మాట పరిహాస వాక్యము కాదుగద!

అక్కర ఛందస్సును నన్నయభట్టు ఒక్కడే వాడినాడని; అవి ఆరువిధములని అప్పకవి వివరించినాడని బ్రౌను చెప్పినది సరియేనా? మధ్యాక్కర, మధురాక్కర నన్నయ వాడినాడు. ఎఱ్ఱన గూడ వాడినాడు. పూర్వము శాసనములలో వాడబడ్డవి. 'మడికి సింగన జ్ఞాన వాసిష్ఠంలో ఒక అల్పాక్కర చెప్పాడు.' (ఆరుద్ర గుర్తించి చెప్పారు)—

మీరెందు శంబరు మెచ్చిచూడ
నారూఢి నే నొక్క హయము నెక్కి
దూరించిపో వనదుర్గ భూమి
భారంబుగా జొచ్చె హజివేగ.          జ్ఞా. వా II, 223

అందరు లాక్షణికులవలెనే అప్పకవియు అయిదు అక్కరలనే చెప్పినాడు. బ్రౌనుకు వివరించి చెప్పిన పండితుడు (...a learned Pandit has, at may request, expressed them in the following metres...) మహాక్కరకు చెప్పబడిన వైకల్పిక లక్షణ మునుబట్టి మహాక్కరలు రెండు విధాలుగా పారవడి డు. బ్రౌను కూడా ఆ పండితునే అనుసరించినాడు. బ్రౌనుది 'కూలంకష పరిశీలన' అయితె నన్నయ మధ్యాక్కరను, లాక్షణికానుసారియైన ఎఱ్ఱన మధ్యాక్కరను వేర్వేరుగా గణించి ఉండవలసినది; అంతేగాక నన్నయ మధ్యాక్కరలోని గణగతుల మార్పులను గూడ గుర్తించి ఉండవలసినది

6. తొమ్మిది రగడలను మూడింటికి తగ్గించవచ్చునని బ్రౌను చెప్పినాడు. నిడుదవోలు వారుకూడ 'తొమ్మిది విధములైన రగడలకు మూడు విధములైన రగడలు మూలమని నిరూపించి యున్నాను' అని చెప్పియున్నారు. వీరు ప్రకటించిన మొదటి త్రిపురాంత కోదాహరణములోగాని, ఉదాహరణ వాఙ్మయ చరిత్ర రెండు ముద్రణములలోగాని యిట్టి సూచన ఎక్కడనులేదు. ఉన్నచో వారు ఆ వాక్యమును ఎత్తి చూపునురు గాక

1. త్రిస్రగతిలో నడిచే రగడలు—3 హయ ప్రచారము, తురగ వల్గనము, విజయ మంగళము.

2. చతుర్రసగతిలో నడిచే రగడలు—2 మధురగతి, హరిగతి; (హరిగతికి రెట్టింపు మంజులగతి రగడ కలదు అప్పకవి కూడ చెప్పలేదు. చూ—శ. ర. వెన్నెలకోలు.)

3. ఖండగతిలో నడిచే రగడలు—2. ద్విరదగతి, విజయ భద్రము

4. మిశ్రగతిలో నడిచే రగడలు—2 హరిణగతి, వృషభగతి. ఇవికాక ఉదాహరణ కావ్యాలలో 'హంస గతి రగడ' ఒకటియున్నది దీనినికూడ లాక్షణికులు చెప్పలేదు. ఈ రగడలను ఎంత కుదించినను నాలగు విధములకు తగ్గవు. మూటికి కుదించుట అసంభవము. ఎట్లు కుదించనగునో బ్రౌను భక్తులు వివరించిన నేర్చుకొనవచ్చును

'బ్రౌను ఛందశ్శాస్త్ర పరిశోధన మన కత్యంతము నారాధ నీయము' అని కళాప్రపూర్ణ లనుట విచారణీయము.

7. ఉత్సాహమునకు లక్షణముగా బ్రౌను మత్తేభ పాదము నిట్లు చెప్పినాడు :

"రవు లేడున్, గురువొక్కటే నిటను విశ్రామంబు
నుత్సాహకున్'

అను దీనిని ఈ గ్రంథములో క్రిందివిధముగా తప్పు విరామ చిహ్నము లతో ముద్రించబడినది—

'రవు లేడున్ గురు వొక్కటేని, టను విశ్రామంబు,
నుత్సాహకున్.''

పై రెండు కామా(,)లకుసార్థక్యములేదు పైగాపొరపాటు అర్థము ఏర్పడును. "ఉత్సాహ పద్యమునకు ఏడు సూర్యగణము లున్ను, గురువు ఒక్కటైనాను యతియు ఉండును" అని అర మగును. ఒక్క గురువుగాక (చివర) మరికొన్ని గురువులుండవచ్చు నన్నమాట అను అర్థము స్ఫురించవచ్చును అది సరికాదు. ఏడు సూర్యగణములు, ఒక గురువు, ఏ నిటను — అంటే అయిదింట— యతి ఉండును అని యర్థము

నిడుదవోలువారు దీనినే క్రిందివిధముగా ఉద్ధరించి తప్పుల తడక చేసినారు.

"రవు వేడున్ గురువొక్కడే నిజను విశ్రామంబు నత్సాహ కున్". (ఇవన్నీ ముద్రారాక్షసములైతే కావచ్చు)

8 భీమన చెప్పిన కందపద్య లక్షణమును చెప్పి వివరించి ఆ కందపద్యమును ఉదాహరించి, తొలి రెండు పంక్తులకు బదులుగా రెండు పంక్తులు తాను వ్రాసినవి బ్రౌను చూపినాడు. ఆ రెండు పంక్తులు ఇవి

కందము మూడేన్ గణములు
నందుకు నాల్గేసి లఘువులైన గణంబుల్.

కొరవకు భీమన పద్యము వలెనే నన్నాడు.

అందము గగ భ జ స నలము లైదే గణముల్

అన్నదానిని బ్రౌను —

అందుకు నాల్గేసి లఘువు లైన గణంబుల్

అని మార్చినాడు. అసలు 'లఘువులైన' అనకూడదు; 'మాత్ర లైన' అని యుండవలసినది (లఘువు అక్షరమును సూచించును, మాత్ర కాలమును సూచించును.)లాల్గేసి లఘువులైన గణంబులు— అంటే అర్థ స్పష్టతలేదు అన్నీ నాలగు లఘువులు (నలములు) గల గణములు వాడవలెనన్న తాత్పర్యము కల్గును.

కందము త్రి శర గణంబులు

అన్న దానిని బ్రౌను —

కందము మూడేన్ గణములు

అని మార్చినాడు. "త్రి — శర" (3—5) అన్న మాట లెట్టివో "మూడు—ఏన్" అన్నవి గూడా టీకా టూ మపేక్షతే కదా ?

తాను మార్చిచూపిన పంక్తులకున్న వివరణ—ఏన్ (ఏను=అయిదు) అను దానికి—ఇచ్చినాడు.

9. సంపాదకుడైన బంగోరెగారు ఛందస్సు విషయకమైన చర్చ యంతయు విడిచిపెట్టినట్లు స్పష్టము చేసి యున్నారని నిడుదవోలు వారు పేర్కొన్నారు. కాని పీఠికలో కాక ఛందో విషయిక చర్చ గ్రంథములో Foot Notes లో శ్రీ బంగోరె చేసి యున్నారు

బ్రౌను సులక్షణ సారము నుండి నాలుగు వృత్త లక్షణము లను యథా మాత్రుకముగా తన గ్రంథమున చేర్చినాడు అని నిడుద వోలు వారనుచున్నారు వాటిని Foot Notes లో చేర్చి విమర్శించిన వారు శ్రీ బంగోరె.

10. "గ్రంథ మాంగ్ల భాష లోనే వ్రాయబడినను, మూలము మాత్రము తెలుగుననే యున్నది" అని నిడుదవోలు వారన్నారు.

మూలమనగా లక్షణము. అది దరిదాపు పూర్తిగా ఇంగ్లీషు లోనే యున్నది (అక్కరలు, కందము, యతి మొ కొన్ని స్థలాల లోనే మూలము తెలుగు పద్యాలలోకూడ ఉన్నది) లక్ష్యములన్నియు తెలుగు పద్యములు, ఇది తప్పనిసరి కాబట్టి. ఈ లక్ష్య పద్యముల తాత్పర్యములు గూడ నింగ్లీషులో నున్నవి. మరియు సమన్వయ మున్ను ఇంగ్లీషులోనే కదు. 'మూలము మాత్రము తెలుగుననే యున్నది' అనుట తప్పే సంస్కృత ఛందస్సుల పట్ల లక్ష్య లక్షణ పంక్తులు సంస్కృతములోనివే తెలుగు లిపిలో యథా తథ ముగా గ్రహించబడ్డవి

బ్రౌను దొరవారికి గల ఛందశ్శాస్త్ర పరిజ్ఞాన హాడిని పట్టి చూపు ముఖ్యాంశములను నిడుదవోలు వారు స్పృశించనేలేదు. అది ఈ సమీక్షలోని ప్రధాన లోపమని చెప్పుటకు విచారించుచున్నాను

11. "గ్రంథాంతమున పాశ్చాత్య సంస్కృత విద్వాంసుల జీవిత సంగ్రహములు— ... గలవు" అని సమీక్షకు లన్నారు కాని సంస్కృత విద్వాంసుల జీవిత సంగ్రహము లిందులేవు. ఈ విషయ మును గూర్చి గ్రంథాంతమున (చూ 105వ పేజీ తర్వాత) ఇట్లు చెప్పబడ్డది :

(C P Brown, in this book, had referred to as many as about 55 authors, Poets – European, Asian, Indian and Telugu – among whom, only the European orientalists are here listed out providing with short biographical notes I should have done the same for others as well, but for the fact that the printing had to be rushed through. ed.)

యూనివర్సిటి ముద్రణకు సంబంధించి "the printing had to be rushed through" అను కారణము సరైనది కాదు. ఈ ఆంగ్ల గ్రంథము చదువు ఆంగ్ల విద్యార్థులకు ఆంగ్లేయులను గూర్చి వ్రాయుట కంటె సంస్కృతాంధ్ర పండితుల గూర్చి వ్రాసి యుండిన బాగుండెడిది. అయినను శ్రీ బంగోరె గారికి ఈ గ్రంథము రెండేండ్ల క్రిందటనే లభ్యమైయుండినదని నా అంచనా.

11. కొంత తెలుగు తెలిసిన ఇంగ్లీషు విద్యార్థులు ఇంగ్లీషు మీడియమ్‌లో ఆంధ్ర సంస్కృత ఛందస్సులను స్థాలీ పులాక న్యాయముగా చూడదలచుకొంటే తప్ప, అసలీనాడు ఈ పుస్తకము ఎవరికీ ఎందుకూ పనికిరాదు కాని నిడుదవోలువారు "ఈగ్రంథము (ను ?) నేడు పునర్ముద్రణము చేసి తెలుగులోనికి తెచ్చినందులకు శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయము వారత్యంతము నభినందనీయులు" అని మెచ్చుకొన్నారు. అయితే ఒకందుకు ఈ 'రేర్ బుక్' పనికి రావచ్చు. బ్రౌనుదొరగారు సంస్కృతవ్యాకరణ పండితుడని, తెలుగు కవి కూడా నని, అదియని — ఇది యని, ఏదేదో అంటగట్టి ఆకాశమున కెత్తుచున్నవారికి ఇది కనువిప్పు కాగలదు.

బ్రౌను దొరగారు మంచి పండితులను చేరదీసి, వారికి డబ్బిచ్చి తెలుగు నేర్చుకొని, కుంఫిణీవారికి బాగా తెలుగు వచ్చుటకు కావలసిన సదుపాయములు చేసినాడు. అది మనకును కొంత పరోక్ష ముగా ఉపయోగపడ్డది. ఆయనకున్న భాషాపాండిత్యముల జిజ్ఞాసకు, సేవకు జోహారులు. కాని ఆయనలేకపోతే తెలుగు సారస్వత సూర్యుడే పొడిచేవాడు కాడని బేషరతుగా అంగీకరించుట సాధ్యము కాని విషయము. ఆయన తెలుగు భాషను ఒక స్థాయిలో ఒక మేరకు ఉద్ధరించినాడు. ఒక వ్యక్తి, ఒక సంస్థ చెయ్యగలిగినంత పని చేసినాడు, అంతకంటె, చేయించినా డననలెను. కాని తాను స్వయముగా పండితుడూ కాడు; కవీ కాడు. ఆయనకున్న ఆంధ్ర భాషాభినివేశము, అవగాహన పరిమితమైనవే; చాల మట్టరక మని చెప్పవచ్చును. అందుకు ఈ పుస్తకము గూడ సాక్ష్యమే.

*శ్రీ బండి నాగరాజు*

## శ్రీ సోమసుందర్ గారి గ్రంథవిమర్శలో గందరగోళం

1977 అక్టోబరునెల 'భారతి'లో 'కరపత్రాల దుమారం, తెరవెనుక భాగోతం' పుస్తకాన్ని విమర్శిస్తూ, శ్రీ సోమసుందర్ గారు గందరగోళంలో పడ్డారు. వారు వెలిబుచ్చిన అభిప్రాయాలు ఆశ్చర్యకరంగా వున్నాయి. వారికి విరసంపైన, కమ్యూనిస్టు విప్లవ కారులపైన కల అక్కసును వెళ్ళగక్కారు.

వారు గతాన్ని జ్ఞాపకం చేసుకొనడాన్ని నిరసించారు. పోనివ్వండి! అరసంనుండి కొందరు విడిపోయి విరసం స్థాపించిన పరిస్థితులకు దారితీసిన కరపత్రాలపై క్రోధాన్ని ప్రకటించారంటే అర్థం చేసుకోగలం. ఆనాడు భగత్సింగు అసెంబ్లీలో విసిరిన కరపత్రం సేకరించి, ప్రచురించడాన్ని కూడా సహించలేకపోయారు. ఒకప్పుడు 'వజ్రాయుధాన్ని' రూపొందించిన శ్రీ సోమసుందర్‌గారేనా ఈ విమర్శ వ్రాసిందనే ప్రశ్న నా బోంట్లకు వుదయిస్తోంది

ఇదే సంచికలో మరో వ్యాసంలో తన గతతర్కిక భౌతికవాదం యింకా అలానే వుందని వ్రాసుకొన్నారు. 'మంచి గతమున కొంచెమే నోయ్' అంటూ కవి వాక్కును స్పృశించారు. అలాగని గతాన్ని తలుచుకొనడానికే భయపడిపోతే ఎలా?

ఇకపోతే వీరి ఆరోపణ విప్లవ రచయితల సంఘం ఎన్నో ముక్కలైందని. వి ర సం లోనుండి కొందరు రచయితలు నిష్క్ర మించారే కానీ, మరో వి. ర సం స్థాపన యింతవరకూ జరగ లేదు. కానీ అభ్యుదయ రచయితల సంఘం యిప్పటికే రెండు ముక్కలైంది. ఒకనాడు అరసంలో అగ్రగామిగావున్న ఈ విమర్శ కులు ఈనాడు ఏ రసంలో వున్నట్టు? మద్రాసు రసంలోనా? విశాలాంధ్రరసంలోనా? గాజు గృహంలో కూర్చొని యితర్లపై రాళ్లు రువ్వడం శ్రేయస్కరం కాదని మనవి చేస్తున్నా.

'గాలి కదిలితే మళ్ళీ కనిపించని కరపత్రాలకు వీరు పుస్తక రూపం కల్పించారు'—వారం తిరిగేసరికి మిఠాయి కొట్లల్లో కనిపించే పత్రికల్లో ఎప్పుడెప్పుడో ప్రచురించిన తమ కవితలను పుస్తక రూపంలో 'అనల కిరీటం'గా ప్రచురించడంలో శ్రీ సోమసుందర్ గారు సాధించిన ప్రయోజనమేమిటి?

కమ్యూనిస్టుపార్టీ చీలి, ముక్కచెక్కలైందని చెబుతూ వీరు ఉన్నంతలో సి పి. ఐ. నయమంటూ ఓ కితాబు యిచ్చారు.

దేశంలో ఫ్యూడల్ వ్యవస్థను చిరంజీవిగా నిలపడంకోసం పాటుబడుతున్న అభివృద్ధి నిరోధక కాంగ్రెస్ పాలకులను సమర్థిం చింది సి.పి.ఐ. దేశంలో నిరంకుశపాలన, ఏకవ్యక్తి నియంతృత్వాన్ని అమలు జరిపి అనేక వందల వేల కుటుంబాలు నాశనం కావడానికి కారణమైన ఇందిరాగాంధీ పరిపాలనను పొగడుతూ, దానికి అండగా నిలిచిన సి పి.ఐ ని వీరు మెచ్చుకుంటున్నారు. పౌరస్వేచ్ఛను, పత్రికా స్వాతంత్ర్యాన్ని కాలరాచి, దేశాన్ని 20 నెలలపాటు చీకటిలో ముంచిన ఎమర్జన్సీని సమర్థించారు సి. పి. ఐ. వారు అనేక వేల అమాయక ప్రజల రక్తంతో తడిసిన కాంగ్రెస్‌వారి చేతులో కరచాలనం చేస్తున్న సి. పి. ఐ. వారు ఈ విమర్శకులకు ఉత్తమ రాజకీయ వేత్తలుగా, సిసలైన కమ్యూనిస్టులుగా కనిపిస్తున్నారు. ఈనాడు దేశం మొత్తాన్ని కలిచివేసిన రాజన్ హత్యలాంటి అనేకా నేక హత్యలకు కారకులైన కాంగ్రెస్‌తో, కేరళలో నేటికీ పొత్తు పెట్టుకున్న సి.పి.ఐ. అత్యవసర పరిస్థితికాలంలో జరిగిన ఘోరాలకు బోనెక్కాల్సిన రెండవ ముద్దాయి అనడం అతిశయోక్తికాదు.

గ్రంథవిమర్శలు ఎప్పటికీ సద్విమర్శలుగా వుండాలి. వ్యక్తి గత అభిప్రాయాలను చొప్పించి దాన్ని తమ అక్కసును వెళ్ళగక్కే వ్యాసంగా తయారుచేయడం అంత మంచిదికాదు.

శ్రీ ఎం వేణుగోపాల్

## "శశి"

(60 వ పేజీ తరువాయి)

మైంది. నేనేదో అనేలోగా తానే అంది "అయినా అవేం కథలండీ అతగాడు రాయటానికి మీరు చదవటానికీ సరిపోయింది."

"కథకేమయిందట" అన్నాను.

"అంత పిచ్చివాడు ఎక్కడైన ఉంటాడా? ఆ శశి ఎవరో, అసలు పేరేమిటో, ఏమీ తెలిసికోకుండ అలావెళ్లిపోతాడా?" అంది చేతులు తిప్పుతూ.

"అలాగా! నీకు గుర్తుందా? మన బుజ్జిగాడు నీ ప్రక్కనే పడుకుని పాలుతాగుతూంటే, మ్రాగన్ను పెట్టి నిద్రపోయే నీవు, ప్రక్కంటి వాళ్ళ పసివాడేడిస్తే తుళుక్కుపడి, లేచి, బుజ్జిగాడిని ఒకసారి చూచుకుని మళ్లా సర్దుకునే దానివి కాదూ."

"అయితే! అదీయిదీ ఒకటే!"

"అక్షరాలా. ఏ పసిపాప ఏడ్చినా తన పిల్లే ఏడ్చినట్టు ప్రతీ తల్లి అనుకుంటుంది ...ముందీ ప్రశ్నకు జవాబు చెప్పు. సీత ఎవరు?"

"ఇంకెవరు రాముడి భార్య."

"అదేం. రాముడిభార్యే సీత ఎందుకు కావాలి? మీ చెల్లెలు కూతురు కాకూడదా? మీ అప్పడాల అత్తగారి పెద్ద కోడలు కాకూడదా? మా శేషగిరి భార్య కాకూడదా? కావచ్చు. కాని లోకాని కంతటికీ ఒకే సీత. నిజమైన ప్రేమికుడికి ఒకే శశి. పద ముందు అన్నం వడ్డించు" అంటూ కళ్ళజోడు టేబిల్‌మీద పెట్టాను.

బావిదగ్గర కాళ్ళు కడుక్కుంటూంటే మా శ్రీమతి సన్నగా అంటోంది.

"ఈ కథలగాలి ఈయనకీ సోకింది" అని



# గ్రంథ విమర్శలు

## గ్రంథ సమీక్ష

[యుగయుగాల్లో భారతీయ మహిళ, రచన జె : వరలక్ష్మి. డెమ్మీ 650 పుటలు. వెల : 30-00. ప్రతులకు: ఐ డి. పి. యల్ కాలనీ, హైదరాబాదు-37]

భారతీయ సంప్రదాయము ననుసరించి సృష్టియంతయు శివశక్తి స్వరూపము-పురుష దేవతామూర్తియగు శివునివలె, స్త్రీ దేవతామూర్తియగు శక్తియు పూజలనందుచున్నది. స్త్రీలను గూర్చి యిట్టి యాధ్యాత్మిక బావన మఱి ఏ యితర దేశ స్త్రీల యందును గానరాదు. ఇదియే భారతీయ మహిళ ప్రత్యేక విశిష్టత.

అట్టి భారతీయ మహిళ చరిత్రను అనాదియైన వేద కాలమునుండి ఆధునిక స్వాతంత్ర్య యుగమువరకు విశదీకరించు నదియే ప్రస్తుత గ్రంథము గ్రంథకర్త్రి శ్రీమతి జె. వరలక్ష్మి. మౌలికమైన పరిశ్రమచేసి, రెండువందల గ్రంథముల నవలోడించి, ఆరేండ్ల పరిశోధనా ఫలితముగా దీనిని నాంధ్రలోకమునకు సమర్పించినది

'భారతీయ మహిళ' అను నీగ్రంథమున పదునెనిమిది భాగము లున్నవి. ఇది భారతమును స్ఫురింపజేయుచున్నది. అందు పదునెనిమిది పర్వభాగములున్నవి. కాని అందు స్త్రీ పర్వమొక్కటియే యున్నది. ఈ గ్రంథమున మాత్ర మన్ని భాగములు స్త్రీ పర్వములే. ఇక గ్రంథ విషయ వివరణము.

మొదటి భాగమున ప్రాచీనమైన అస్సీరియా, ఈజిప్టు, గ్రీసు, బాబిలోనియా, మహేంద్రదారో హరప్పా, మెసపటోమియా దేశపు సంస్కృతులు, పృథ్వీదేవతా పూజ, ఆర్య ఆర్యేతర సంస్కృతుల కలయిక, వివాహ వ్యవస్థ వివరింపబడినవి

రెండవ భాగమున వేదకాలమందలి స్త్రీలనుగూర్చి ధర్మపత్నిగా ఆమె పొందిన గౌరవము గూర్చి గలదు.

మూడవ భాగమున సూత్రకాలమున, స్మృతులలో, ధర్మశాస్త్రములలో స్త్రీ వ్యవస్థ సంస్కారములచే నామె పొందిన మర్యాదలు వివృతములు. నాలుగవ భాగమున పురాణేతిహాసముల కాలమున స్త్రీలు, స్త్రీ రామాయణ భారతమున స్త్రీ పాత్రలు-స్త్రీ సామాజిక ప్రతిపత్తి తెలుపబడినవి. అయిదవ భాగమున వరాహమిహిరుడు పతంజలి కాలమునాటి స్త్రీలనుగూర్చి చెప్పబడినది. ఆరవ భాగమున బౌద్ధ జైన మతాల కాలంలో స్త్రీలు, ఏడవ భాగమున హిందూరాజుల పరిపాలనా కాలములో స్త్రీలు, ఎనిమిదవ భాగమున ముస్లిముల పాలనలో స్త్రీలు వారు పొందిన అగచాట్లు, తొమ్మిదవభాగమున ఆంగ్లపాలనయుగము సంఘసంస్కరణోద్యమములు, పదవ భాగమున గాంధీయుగమున స్వాతంత్రోద్యమమున పురుషులతో సమానముగా స్త్రీలు స్వరాజ్య ప్రాప్తికై పోరాడిన విధము, పదకొండవ భాగమున స్త్రీ పురుషులకు సమానత్వము, చట్టరీత్యా స్త్రీలకుగల హక్కులు, పన్నెండవ భాగములో శాస్త్రాలలో, కళలలో మహిళ, పదమూడవ భాగములో స్త్రీల వేష ధారణ, అలంకరణ. పదునాల్గవ భాగములో స్త్రీల ఆటలు పాటలు, పదిహేనవ భాగములో రాజ్యపాలన చేసిన వీరవనితలు, పదహారవ భాగములో స్త్రీ ధనము, వారసత్వపు హక్కులు, పదునేడవ భాగమున తత్త్వవేత్తల దృష్టిలో స్త్రీలు, వీరిని గూర్చిన సంపూర్ణ వివరణము లున్నవి. పదునెనిమిదవ భాగము ఉపసంహారము.

స్థూలముగా పై విభాగములున్నను, సూక్ష్మముగా పరిశీలించిన ప్రతి విభాగమున విశేషములు గలవు. నాల్గవభాగమున కౌటిల్యుని అర్థశాస్త్రములోని స్త్రీలు వాత్స్యాయనుని కామ సూత్రాలు, వివాహ వ్యవస్థ, చతుష్షష్టి కళలు శూద్రకుని మృచ్ఛకటికనాటి సాంఘిక జీవిత చిత్రణ వివరంగానీయబడియున్నవి. వేద కాలమున స్త్రీలు, స్మృతులయందు స్త్రీలు - ధర్మశాస్త్రములో స్త్రీలు, వేషధారణ అలంకరణ వీనిని గూర్చి తెలుపునప్పుడు మూల గ్రంథములలోని, శ్లోకములకు తెలుగు భాషలో అనువాదమీయబడి యున్నది. ఇందువలన ఆదికాలమునుండి ఆధునిక కాలమువఱకుగల భారతీయ మహిళా సమగ్ర స్వరూపమీ గ్రంథము ప్రదర్శించుచున్నది. ఇందలి విషయములను మనము సావధానముగా చూచిన దీనిని 'భారతీయ మహిళా సర్వస్వము' అని చెప్పవచ్చును. ఇందిరువది యైదు చిత్రపటము లుండుటచే గ్రంథము సర్వాంగ సుందరముగా నున్నది.

## పరిశిష్టము

చారిత్రకముగా నీ గ్రంథము సమగ్రమైనను, నిందు ఇంకను కొన్ని విషయములు చేర్చిన దీని విలువ యినుమడింప గలదు. వానిలో రెండింటిని చూపుచున్నాను.

పురాణేతిహాసముల కాలమున స్త్రీలు ఈ క్రిందివారిని గూర్చి ప్రత్యేక వివరణ యుండవలెను.

## వేదవతి

రావణుడు ఈమెను మోహించి, జుట్టు పట్టుకొనగా తన తపోమహిమచే ఆ జుట్టును కత్తిరింపజేసి, తన శీలమును రక్షించుకొనినది. ఈమెయే సీతయై పుట్టి రావణ సంహారమునకు కారణ భూతురాలైనది.

## సా వి త్రి

మృతిచెందిన తన భర్తను గొనిపోవుచున్న యమధర్మ రాజుతో వాదించి, ఆతని తిరిగి సజీవునిగా చేసినది సావిత్రి.

## ద మ యం తి

దేవతలైన ఇంద్రాది దిక్పాలకులు తమ్ము వరింపుమని కోరినను వారిని తిరస్కరించి, మానవుడైన నలుని వివాహము చేసి కొని మానవత్వ గౌరవము నిలువబెట్టినది దమయంతి.

## రు క్మి ణి

తనను, చైద్యుడగు శిశుపాలుని కిచ్చి పెండ్లి చేయుటకు నిశ్చయమైనపుడు, శ్రీకృష్ణునికి బ్రాహ్మణునిచే సందేశముపంపి—శ్రీకృష్ణుని వివాహము చేసికొనినది రుక్మిణి ఇది రాక్షస వివాహము

## సత్యభామ వీరనారి

ఇతిహాస కాలమున నేకైకముగా వీరత్వము ప్రదర్శించినది సత్యభామ. శ్రీకృష్ణుడు నరకాసురునిపై యుద్ధమునకు వెళ్లి నప్పుడు సత్యభామను తీసికొని వెళ్లినాడు. యుద్ధ మధ్యమున శ్రీకృష్ణుడలసిపోగా సత్యభామ, ధనస్సును ధరించి, నరకాసురునితో యుద్ధముచేసి, ఆ త ని సంహరించి, కృష్ణునికి జయము చేకూర్చినది. ఇది భాగవతమున హరివంశమున వర్ణింపబడినది

## అ మ ర సిం హు డు
## స్త్రీ పర్యాయ పదములు

ప్రాచీన శాస్త్రకారులలో అమర నిఘంటువు కర్తయగు అమరసింహుడు స్త్రీ ప్రాధాన్యమును గుర్తించినట్లుగా వేఱెవ్వరు గుర్తింపలేదని చాటవచ్చును.

తన నిఘంటువున, మనుష్యవర్గమున, పు రు ష పర్యాయ పదములు అయిదింటి నిచ్చినాడు. అవి పుమాంస, పంచజన, పురుష, పూరుషా, నర అనునవి ఈ అయిదింటిలో పురుషుడు అనున దొక్కటియే సర్వే సర్వత్ర ప్రచారమున నున్నది. స్త్రీ పర్యాయపదము లాతడు 23 శ్లోకములలో 144 పదముల నిచ్చి నాడు. అవి యన్నియు స్త్రీ వయో భేదములు, స్వభావములు, ధర్మములు, వృత్తుల తెలుపును. ప్రతి పదమునకు వృత్పత్తి చెప్పబడినది. వాని నన్నింటిని వివరించుట కిచ్చట తావులేదు. రెండింటిని తెలుపుచున్నాను

స్త్రీ ''స్త్యాయతి సంఘాతో భవత్యస్యాం గర్భ ఇతి స్త్రీ
దీని యందు గర్భము కూర్పబడును.''

మహిళ ''మహ్యత ఇతి మహిళా మహ పూజాయాం''
ఆదరింపబడునది. పూజింపబడునది '' (పుట 353)

పై వ్యుత్పత్తిని బట్టి ఈ గ్రంథమునకు 'భారతీయ మహిళ' ' అని పేరుండుట ఎంతో సార్థకమైయున్నది.

పత్ని, పాణిగృహీతి, ద్వితీయా, సహధర్మిణి, భార్య, జాయా దార ఇవి భార్య పర్యాయపదములు వీనిలో మొదటిని లుగు ఆమెకు గల యజ్ఞాధికార ధాన ధర్మ ఫలాధికారము తెలుపును. తక్కిన మూడింటిలో భార్యా శబ్దము నిత్య వ్యవహారమున నున్నది. అమర నిఘంటువులోని పదముల వ్యుత్పత్తు లన్నింటిని పరిశీలించిన భారత మహిళ సమగ్ర స్వరూపము మనకు వ్యక్తమగును.

అమరకోశ వ్యుత్పత్తులనుబట్టి ధర్మము సత్యమువలె, స్త్రీకి పరిస్థితులనుబట్టి గౌరవాగౌరవములు సమానత్వా సమానత్వములు సంఘటించునని తెలియుచున్నది సంఘమునకు పురుషాడాధారము. స్త్రీ ఆదేయము. ఇట్టి వివేచనకు కేవలము చారిత్రక దృష్టియే గాక సంప్రదాయ దృష్టి ఆవశ్యకము.

## వి ష య వి శి ష్ఠ త

ఈ గ్రంథమున నిచ్చిన విషయము లన్నియు గ్రహింపదగి నవియే. వివాహములలో 'సప్తపది' అను ఘట్టము గలదు. ఇది చాలా ముఖ్యమైనది కాని దీని యర్థము మనకు మనకింత వఱకు తెలియదు. ఈ గ్రంథమున నది ఈయబడినది. 'సప్తపది' అనగా ఏడడుగులు.

మొదటి అడుగు — ఆహారము కొఱకు.
రెండవ అడుగు — బలము ,,
మూడవ అడుగు — వ్రతము. ,,
నాల్గవ అడుగు — స్నేహము ,,
అయిదవ అడుగు — పశు క్షేమము ,,
ఆరవ అడుగు — సౌభాగ్యము ,,
ఏడవ అడుగు — పురోహితుడు ,, (పుట 120)

భారతీయ వివాహమెంత పవిత్రబంధమో తెలిపెడి వివాహ మంత్రార్థములు నిందున్నవి. వానిని వివరించుటకు స్థలముచాలదు.

కొన్ని విషయములకు చేర్పదగిన యంశములను సూచించు చున్నాను.

## బ హు భ ర్తృ త్వ ము

బహు భర్తృత్వము నేటికి టిబెటు దేశమున గలదని వివేకానంద స్వామి తెలిపినాడు.

# నియోగ పద్ధతి

నియోగ పద్ధతి యనగా భర్త జీవించియుండగా నితరులచే పుత్రులను కనుట ఇది కలికాలమున నిషేధింపబడినది.

"అశ్వాలంబం గవాలంబం
సన్యాసం పల పైతృకం
దేవరాత సుతోత్పత్తిం
కలే పంచ వివర్జయేత్"

అశ్వమేధయాగము, గోమేధయాగము, సన్యాసము, మాంస తర్పణ, దేవరాత సుతోత్పత్తి ఇవి యైదును కలికాలమున వర్జింప వలెను దేవరాత సుతోత్పత్తి అనగా నియోగ పద్ధతి.

# సోదర భార్యా వివాహము

"అనార్యులలో సోదరుడు చనిపోయిన నాతని తమ్ముడు సోదర భార్యను వివాహమాడవచ్చును"

ఈ ఆచారము నేటికిని ఒరిస్సా యందు గలదు.

"మత్స్య మాంస భక్షణమ్
కక్ష కేశ రక్షణమ్
భాతృ భార్యా ప్రోక్షణమ్
ఓఢ్రజాతి లక్షణమ్."

# తండ్రి పేరు - ఇంటి పేరు

"పుట్టిన పిల్లలకు తండ్రి పేరు ఇంటి పేరు వచ్చేది." ఈ ఆచారము నేడు తమిళ దేశమున అగ్రవర్ణముల వారిలోగలదు.

# శాతవాహనుని రాణి

శాతవాహనులకాలమున రాణులు సంస్కృతము నేర్చినవారు. శాతవాహనుడు తన రాణులతో జలక్రీడ లాడుచున్నప్పుడు, ఆతని వలన పట్టపు రాణిపై జల్లులు హెచ్చు పడెను. ఆ నీటి తాకిడి కోర్వలేక ఆమె "మోదకైస్తాడయ" అని ఆతనితో చెప్పినది. కాని రాజునకు దాని యర్థము తెలియకపోవుట చేత, మోదక మనగా తీపి వస్తువు గాన—మోదకములు—లడ్డులు తెప్పించెను. రాణి వానిని చూచి నవ్వి, నేను "మా+ఉదకైః+తాడయ=నీటితో కొట్ట కుము" అని అంటిని. ఈపాటి సంస్కృత సంధి కూడా నీకు తెలియలేదే అని పరిహసించెను. తక్కిన స్త్రీలందరు నవ్విరి. రాజా వెనుక ఆ అవమానము భరింపలేక సంస్కృతమునేర్చెనని గుణాఢ్య పండితుని బృహత్కథ నుండి తెలియుచున్నది.

# సవరణలు

ఈ గ్రంథము, ఇతర భాషలలోనికి అనువదింపబడుటకు అవకాశము లున్నవిగాన, కొన్ని సవరణలు చేయవలసిన ఆవశ్యకత కలదు. లేనియెడల అవి మూలగ్రంథ గౌరవమునకు భంగము కలి గించును. కొన్నింటిని మాత్రము దెలుపుచున్నాను.

(పుట 199)

# పురాణేతిహాసాల కాలం

భారతీయ సాహిత్యములో పురాణములకు ప్రసిద్ధ స్థానము కలదు. అవి పదునెనిమిది (అష్టాదశ) అని, అవి వ్యాసమహర్షి ప్రణీతములని వేలకొలది యేండ్లుగా నిర్దిష్టమైన విషయము. తెలుగువారి కవి సుపరిచితములు. తెలుగు సాహిత్యమున వానికి స్థానము గలదు ఇట్లున్నను ప్రస్తుత గ్రంథమున వీనిని గూర్చి ఇట్లు వ్రాయబడినది:

."ఈ పురాణాలు ఎన్ని? ఏ కాలంలో వచ్చినవి అనేది తేల్చి చెప్పడం కష్టం. అసలు పురాణ పదాన్ని నిర్వచించడం కూడా కష్టమే"

"అష్టాదశ 18 పురాణాలున్నవని మనవారి నమ్మిక కాని వాస్తవంగా ఎక్కువ సంఖ్యలోనే వున్నవి"

"బసవ పురాణం, విష్ణు పురాణం వంటివి శివ వైష్ణవ భక్తులు తమ దేవతల మహిమలను కొనియాడుతూ రాశారు. ఇవి గాక వాయు పురాణం, మత్స్య పురాణం, మార్కండేయ పురాణం, వ్యాస పురాణం, పద్మ పురాణం, గరుడ పురాణం, బ్రహ్మపురాణం, బ్రహ్మ పురాణం, బ్రహ్మాండ పురాణము, స్కందపురాణం వంటివి ఎక్కువగా జనాదరణ పొందినవి"

పై యుదాహృతులను బట్టి చూడగా ఇందు అష్టాదశ పురాణముల మాట లేదు

వాని వివరము.

పురాణములు18. అవి 1) బ్రహ్మ 2) పద్మ 3) విష్ణు 4) శివ 5) వాయు 6) భాగవత 7) నారద 8) మార్కండేయ 9) లగ్ని 10) భవిష్యత్ 11) బ్రహ్మ వైకర్త 12) లింగ 13) మత్స్య 14) కూర్మ 15) వరాహ 16) గరుడ 17) బ్రహ్మాండ 18) స్కాంద పురాణములు (విజ్ఞాన దీపిక. పుట 370.)

ఇందులో బసవ పురాణము అనునది లేనే లేదే. రచయిత్రి మరి ఎట్లు చేర్చినది? అది సంస్కృత భాషలో లేదు. తెలుగు భాష లోనే ఉన్నది. 12 వ శతాబ్ది నున్న బసవని గూర్చి పాల్కురికి సోమనాథుడు రచించినది. తెలుగున బసవపురాణము అని పేరున్నది గాన, అది సంస్కృతమే అని భావించి రచయిత్రి అష్టాదశ పురా ణములలో చేర్చినది అంతే, "వ్యాస పురాణం" వ్యాస పురాణమని ఒక పురాణ మున్నదా? లేదని పై పట్టిక తెలుపుచున్నది.

"అసలు పురాణ పదాన్ని నిర్వచించడం కూడా కష్టమే" ఈ వాక్యమ సంబద్ధము పురాణ పదమునకు నిర్వచనము గలదు.

''పురా పూర్మస్మిన్ భూతమితి పురణం—పూర్వమునందే పది గనుక పురాణము'' (అమరకోశము పుట 126) దీనిబట్టి పురాణమనగా, పూర్వకాలమున జరిగిన కథ యని యర్థము. ''పురా అపి నవమ్'' అని మటియొక నిర్వచనము. పూర్వము జరిగినది క్రొత్తగా చెప్పట యని దీని యర్థము. ఇందువలన పురాణకథలు చరిత్ర కందరాని ప్రాచీన కాలమునాటివని తెలియవలెను

(పుట 207)

## రామాయణ భారతములు

పురాణముల వలెనే రామాయణ భారతములను గూర్చి రచయిత్రికి నిశ్చితాభిప్రాయములు లేనట్లు కన్పట్టుచున్నది. రామాయణ భారతములు రెండును ఇతిహాసములుగా పేర్కొనబడినవిగాని యిది సరికాదు. రామాయణము కావ్యము భారతము ఇతిహాసము. ''ఇతిహాసః పురావృత్తమ్ ఇతిహపాదం పర్యోపదేశః అస్తే అస్మిని తీతిహాసః'' ఇతిహ అనగా పారంపర్యోపదేశము గలది. పురావృత్త నిబంధన ప్రాయత్వాన్ని వృత్తం పురావృత్తం పూర్వ చరిత్ర నిబంధనప్రాయము ఈ రెండును ప్రాచీన చరిత్ర బోధక వ్యాసాది ప్రణీతములైన భారతాదుల పేళ్లు.

(అమర కోశము పుట 125)

ఈ రెండింటిలో రామాయణ కథ భారతము కన్న చాలా ప్రాచీనము. రామాయణ కథ త్రేతాయుగమున జరిగినది భారతకథ ద్వాపర యుగమున జరిగినది కనుకనే భారతమున రామాయణకథ యున్నది.

(పుట 240)

## భారత కాలంనాటి సామాజిక వ్యవస్థ వివాహ వ్యవస్థ

ముఖ్యంగా క్షత్రియులలో స్వయంవర పద్ధతిన వివాహం జరగడం ఆచారంగా ఉండేది స్వయంవరం కూడా అందరికి ఒకే పద్ధతిలో వుండేది కాదు.

ఉదాహరణకు సతీదేవి వివాహం తీసుకుందాం దక్షుడు శివునితప్ప మిగతావారందరినీ స్వయంవరానికి ఆహ్వానిస్తాడు. శివుడు ఆహ్వానం లేకపోయినా హాజరవుతాడు. సతీదేవి అతని మెడలో పూల హారం వేస్తుంది. ఇష్టం లేకపోయినా దక్షుడు ఆమెను శివునికిచ్చి వివాహం చేయాల్సి వస్తుంది.

రచయిత్రి పై సతీ స్వయంవర వివాహ కథకు ఆధార మేదియో తెలుపలేదు ఇది ఎంత ప్రామాదికముగా నున్నదో వివరించు చున్నాను.

మొదట సతీ వివాహకథ భారత కాలమునాటి సామాజిక వ్యవస్థలో నిచ్చుట చాలా పొరపాటు సతీ వివాహము జరిగినది భారతకాలమునాడు కాదు సృష్ట్యాదియందు. దక్షుడు క్షత్రియుడనుట ఊహ. అతడు బ్రాహ్మణుడు. నవబ్రహ్మలలో నొకడు దక్ష ప్రజాపతి అని అతని పేరు. ఆదిబ్రహ్మ దక్షుని సృష్టిచేయమని కోరగా, అతడు ఆ త్రైలోక్య మాతయగు ఆదిశక్తి నారాధించి, ఆమెను కుమార్తెగా బడసి ఆమెను శివున కిచ్చి వివాహము గావించెను. సతీదేవి శివుని తొలి భార్య. ఆమె దక్షాధ్వర సమయమున తన భర్తయైన శివుని దక్షుడాహ్వానింపక పోవుటచే తండ్రి ఎడ నాగ్రహించి తాను దగ్ధమయ్యెను. ఆమెయే పార్వతియై హిమవంతునకు జన్మించి, శివుని పెండ్లియాడెను పార్వతీ పరమేశ్వరులే సృష్టిలో తొలి దంపతులు ఈ కథ సంస్కృత శివ పురాణము నందును, తెలుగున నన్నె చోడుని కుమార సంభవమునను గలదు. ఆబాల గోపాలమునకు సుపరిచితమైన ఈ కథను పై రీతిగా వ్రాయుట సరికాదు

''బసవేశ్వరుని బావమరది చెన్నబసవడు బసవేశ్వరునికంటె తీవ్రవాది'' ఇది సరికాదు. చెన్నబసవన బసవని మేనల్లుడు గాని బావమరదికాడు

''వీరిరువురు కలిసి నూత్నభావాలను, ప్రచారం చేశారు'' అన్నది అంతకంటె అసంబద్ధము వీరశైవమతము ఏకైకముగా బసవన ప్రచారము చేసినదే. బసవ పురాణము చూచిన యీ విషయము స్పష్టము

బసవన వర్ణాశ్రమ వ్యవస్థను వైదికమతమును ఖండించి భక్తి ప్రధానమైన వీరశైవమతము స్థాపించినాడు భక్తి ప్రధానమైన మతములందు తక్కిన మతములకంటె స్త్రీకి సముచితమైన సమాన స్థానముగలదు

పుట 508— గాథాసప్తశతి

పెదకోమటి వేమభూపాలుడు 100 గాథన్ని ఏర్చి కూర్చి ''భావదీపిక'' అను చక్కని పీఠిక వ్రాశాడు ఇదొక సప్తశతీసారం!!

పుట 509. ''కోమటి వేమారెడ్డి అనే పాలకుడు వీటిలో నూరు మాత్రం అనువదించి గ్రంథస్తం చేశాడు.''

పెదకోమటి వేమభూపాలుడు, పెదకోమటి వేమారెడ్డి ఇరువురు ఒక్కరే. ''భావదీపిక'' పీఠికయేమి? అది పీఠిక కాదు— వ్యాఖ్యానము

నూరు మాత్రం అనువదించుట ఏమి? ఏ భాషలోనికి అనువాదము?

పుట 519 ''రాజశేఖరుడు... 6 మాసాల్లో సంగీతం క్షుణ్ణంగా నేర్చుకొని వచ్చి బృహత్కథ రాశాడట''.

బృహత్కథ వ్రాసినవాడు గుణాఢ్యుడు కాని రాజశేఖరుడు కాడు. ఇక సంగీతమునకు బృహత్కథకు సంబంధమేమి? బృహత్కథ సంగీత శాస్త్ర గ్రంథముకాదు అది కథల గ్రంథము అది సంస్కృతములో లేదు పైశాచీ భాషలో నున్నది.

పుట 587 రాజ్యపాలన చేసిన వీరవనితలు ఈ శీర్షికలో చారిత్రక క్రమము పాటింపబడలేదు.

## దుర్గాబాయి దేశముఖ్

ఈ సందర్భమున దుర్గాబాయి దేశముఖ్‌గారిని గూర్చి ప్రత్యేకముగా వ్రాయవలసి యుండెను కాని లేదు. 'ఆంధ్రమహిళ సంస్థ' ఆంధ్రమహిళాకళాశాల, ఆంధ్ర మహిళా ప్రసూతివైద్యశాల మొదలగు నిర్మాణ కార్యక్రమమునకు నిత్య నిదర్శనములు 'మహిళ' పదమును మొదట ప్రచారములోనికి తెచ్చిన ఆంధ్రమహిళ శ్రీమతి దుర్గాబాయి దేశముఖ్ సాంఘికముగా నిరతాన్న దాన ప్రదాత్రియైన డొక్కా సీతమ్మగారు పేర్కొనబడలేదు. ఆమె తెలుగువారిలో చాలా ప్రసిద్ధికెక్కినది.

## చారిత్రక వ్యత్యాసములు

ఈ గ్రంథమున కొన్ని పట్టుల చారిత్రక వ్యత్యాసములు కన వచ్చుచున్నవి పుట 206. ''పురాణేతిహాసాల కాలం'' ఈ శీర్షికలో గజనీ మహమ్మదు దండయాత్ర దేవదాసీ పద్ధతి ఎట్లు ప్రసక్తమైనవి? గజనీమహమ్మదు క్రీ శ. 10వ శతాబ్ది పుట 334 ''మధ్యయుగం రాజపుత్రులు రాజ్యం చేసిన రోజుల్లో మహిళలు''. ఈ శీర్షికలో రాణీ సంయుక్త వెనుక ''శాతవాహనుల కాలం'' గూర్చి చెప్పబడినది. (పుటలు 337–339) రాణీ సంయుక్త క్రీ శ. 11వ శతాబ్ది శాతవాహనుల కాలము క్రీ శ 250 పుట 339 ''పాండ్యులు'' ఈ శీర్షికలో కాకతీయరాణి రుద్రమదేవిని గూర్చి గలదు. పాండ్యులకు రుద్రమదేవికి సంబంధమే మాత్రములేదు. పునరుక్తులు కూడ కలవు.

## ''సీమంత నయనము'' (సీమంతోన్నయనము)

(పుట 147) ''కిట్ అను పాశ్చాత్యుడు'' (కీతే అను పాశ్చాత్యుడు) (పుట 200) ''మహమ్మద్ గోరి'' (మహమ్మద్ గోరీ) స్త్రీ విద్య (శ్రీవిద్య) పుట 537 మొదలగు ముద్రణ స్ఖాలిత్యములు సవరింపదగినవి పుట (341) అనుక్రమణిక యింకను విపులముగా నుండవలెను.

చదువ నేర్చిన ప్రతి స్త్రీ పురుషుడు — చదువగల సులభ సుందర శైలిలో నున్నదీ గ్రంథము.

---

నవ్యాంధ్ర సాహిత్య జగత్తులో మహిళలను గూర్చి యింత వఱకు నొక్క సమగ్ర గ్రంధములేదు. ఇట్టి గ్రంధమును రచించిన రచయిత్రి ఎంతయు నభినందనీయురాలు.

యావదాంధ్ర లోకమున నీ గ్రంధము నాదరించుగాక.

*కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు*

# దశదశకం

## 1. శిథిల మండపం

[గేయఖండిక – సి. వి. నారాయణరావు. డెమ్మి 1/8–16 పారటలు; వెల: రు 3/; ప్రతులకు–సి. వి కౌసల్యాదేవి; C/o సి. వి. నారాయణరావు; 10–2–185, బాపూజీవీధి; సూళ్లూరు పేట, నెల్లూరుజిల్లా–524121 ]

16 పేజీల బుక్ లెట్‌కు 3 రూపాయల ధరబెట్టి సమర్థించుకోను కామాల, శ్రీ శ్రీ ని ఉదాహరిస్తున్నాడు. ఆ ఎద్దెనిమిది భారత పర్వాలు విషయగురుత్వంతో ఇంకా మని ఉన్నవి; కానీ ఈ 18 పేజీలు తేలకగా జిల్లేడుదూది మాదిరి ఎగిరిపోతుంటే, ఎక్కువ పేజీలైతేమాత్రం సరుకు ఉండ పనిలేదా?

ఈ కవి ఏ విషయాన్నిగాని మనసులో నిలదొక్కున్నట్లు లేదు. ప్రేమ త్యాగం లాలన పాలన మారని రూపాయలంటూనే, జీవితాన్ని గొప్పలుచేసి గంగాప్రవంతిగా మార్చమని త్యాగ గుణాన్ని పొగుడుతాడు. (నాందిలో)వసంతం తర్వాత హేమంతమంటాడు ఇదెక్కడి విపరీతపు వరుసయ్యా! రచనలో ఆశ నిరాశలమధ్య ఈ ప్రాణి కొట్టుకొంటున్నట్లున్నది ప్రస్తావనలో నీరవ నిశ్శబ్దం అం టాడు ఇంకో కటిగలభా నిశ్శబ్దం ఉన్నది కాబోలు వ్యావహారాన్ని ఇప్పుడు వద్దనే వాళ్లు లేరుగాని, పజ్జాల పుస్తకం అనే నింద్య గ్రామ్యానికి ఆనందించే వాళ్లుమాత్రం ఉండరనుకొంటా.

## 2. రాధ ఎదురుతెన్నులు

[గేయసంపుటి మద్దిబోయిన పార్థసారధి డెమ్మి1/8 32 పేజీలు; వెల: రు. 2/–ప్రతులకు. గ్రంధకర్త, 5–4–26 తహశీల్ ఆఫీసు దగ్గర; నిజామాబాదు.]

తెనుగుకు సంగీతం ఎట్లా అతికిపోయినదో, పదాలు పల్లెల కంత ప్రాణప్రదాలు గీతగోవింద గ్రంధంలోని రాధ ప్రణయాన్ని ఈ కవి పదాలలో పొరించి పారవశ్యాన్ని కలిగిస్తున్నాడు

రాధ భాగవతంలో పుట్టలేదు. 12వ శతాబ్దంలో బెంగాలులో పుట్టి, జయదేవునిచేత పెంచబడి దేశమంతా ప్రాకినది, శ్రీనాధ కవి సార్వభౌముడే రాధాకృష్ణులను ఆంధ్రులకు పరిచయం చేసిన మొదటి కవి

అయితే ఏమి? నిష్కలంక మధుర ప్రణయానికి రాధ ఉపాస్య దేవత అయినదిగదా! ఈ కవికి శృంగారభావం స్వచ్ఛరీతిలో మదికెక్కి పండినది–బయటబడి పరిమళించినది. భావ విలసనానికి మధుర పేశల నుడికారం, వలువలుగట్టి నగలు భెట్టి అలౌకిక రమణీయాన్ని గూర్చినవి. ఈ కవి ఊహాసరణి అంతా కవితా శిల్ప దీపకం–అంటే రిరికల్ ఎలిమెంటు మెండుగా ఉన్నది–అనుట. అందులో ఇవి పాటలు

రాధ తానై ఎలపురసంద్రాగి, ఆత్మానుభూతితో ఈ పాటల ద్వారా త్రాగిస్తున్నది మాటల పొదుపు, వాక్యాల కుదింపు బిగువు, జాను తెనుగు నుడికారం. ఈ రచనలకు సొంపు కలిగిస్తున్నవి నుడికారపు సొంపు.–నీవు సరసనలేవని మబ్బున మాటున నవ్వెను జాబిల్లి; మల్లెల సొగసు హంసల నడక దాచెను లేదా నీ కొరకు; నిక్కి చూడ మురళి మ్రోగెను, వెతకిచూడ కలత మిగిలెను. వెన్నెల తెల్లగా పానుపు పరువగా మల్లెలవాన నునపై కురియగ; ఆశలపూలతో మదిలో కొలిచితి; నా హృదయాన నిన్ను దాచితిని కడకొంగున ముడివై చిలిపి–మొదలైనవి. విరహ వేదనను పరిపరి విధాల భావించగలడు:–అల్లరి గాలి మేను సోకగా మురళి నాదము నా చెవి సోకగా; ఆకాసాన రేరాజు నిలువ కలువపూలు వికసించేనురా; కనులకు దిద్దిన కాటుక కన్నీరున కరగిపోయేరా; మ్రోగింపరా నీ మురళి సరళిలో నా అందెలసవ్వడి మిళితముకాగ మైమరచిపోగ తియ్యటి కోర్కెలు:–పూలమాలగా నిను మార్చగలేవా నీ మెడలో వ్రాలగా నే పనికిరానా; యమునా నదిలో అలనునేనై కడిగెద నీ పాదముల, నిలచిపోరా నీలిమోహనా నీలికన్నులలో నా పాపగా. రాధ చివరి కోరిక చివరి 30వ పాటగా ముక్తాయింపుతో ముగుస్తున్నది.

కవికి సరసమాడను బాగా తెలుసును. వల్లనిగాలి నాకొంగ లాగినదని, అల్లరి గాలి అని ఎత్తిపాడిచి – చూచినావా మరాళమా మాధవుడెంత కరుణ మాలినాడో అని, మన్మధుని కోర్టులో కంప్లెయింటు చేస్తున్నాడు – రసికుడైన కవి.

అన్ని పాటలూ పాడి వినిపించి తల లూపించగలిగినవే! కాని, ఎదురుతెన్ను లంటే అర్థం ఏమిటో! ఎదురుచూచిన అనే అర్థం రావడంలేదు. ఎదుర్కొన్న తెన్నులంటారా? ఆటకత్తె అంటే ఆడేకత్తి అన్నట్లు.

## 3. భావమంజరి

[కవితాసంపుటి, శిష్ట్లంశెట్టి రామసుబ్బయ్య డెమ్మి 1/8 110 పేజీలు; వెల రు 5/– ప్రతులకు : ఇందిర సుజాత, 392 తూకుమాను మిట్ట, సంతపేట, నెల్లూరు–524001.]

కవులు గీరులు గీచుకొని ఉండకపోవడం మంచి దంటాడు డాక్టర్ సి. నారాయణరెడ్డి శుభాకాంక్షలో. ఇది వెల మదింపు చేయ వీలులేని మంచిమాట. కొన్ని ఇజాలకు కమిటే అయిన కవుల

కేకలు వింటున్నాము గదా ! కాబట్టే శిద్దంశెట్టి అభ్యుదయ గీతాలు భావ గీతాలు, భక్తి గీతాలలో కమ్మటి కలగలుపు పులగంగా ఈ పుస్తకాన్ని సంకలనం చేసినాడు.

కవికి భావుకత ఏర్పడి ఉన్నది, భాష సానలుదీరే సూచన లున్నవి అనగ ననగ రాగమతిశయిల్లుచుండు ననిగదా పెద్దలు చెప్పేది ! కవి హృదయము దృష్టి అంతర్ముఖమై ఉన్నది కాబట్టి ''విభిన్నత'' లో ఐక్యతను చూచి, మంచినే ఆకాంక్షిస్తున్నాడు. ''సమత కోసం కవిత'' అంటాడు, చక్కటి ఆదర్శం. దైవ సందర్శనంలో అన్నిటా దైవ సాక్షాత్కారాన్ని ఊహించుకొంటున్నాడు; ఇంకా బాగా చూడగలిగితే భూతల జీవిత సారాన్ని చూడ గలడు నవ్వు నానాందాలు గదా — దానిని బాగానే వర్ణించినాడు.

పున్నమ ముద్దాడిన రాత్రి లని మంచి నుడికారాన్ని చూపు వాడు తెనుగు కవిత్వానికి ఒక ఇంగ్లీషు శీర్షిక పెట్టడం వట్టి పిచ్చిపోకడ ''నీ కాళ్లకు నీవే మ్రొక్కకు'' అని మంచి ఎత్తిపొడుపుతో ఎచ్చరిస్తున్నాడు.

## 4. కిరణాలు

[అమరవీరుల సంస్మరణ గేయాలు కూర్పు—కె. వి. రమణారెడ్డి. డెమ్మి 1/8 12 పేజీలు, ధర రు. 1/— ప్రతులకు : కె. వి. రమణారెడ్డి. 10—6—27 కావలి, నెల్లూరుజిల్లా ]

దృష్టి భేదం ఎంతైనా చేస్తుంది. సావర్కర్ భగత్‌సింగు ఇంకా వంగ విప్లవ ఆత్మబలిదాతలు మనకు స్వాతంత్ర్య వీరులు, బ్రిటీషు వారికి రాజద్రోహులు ఏమైతేనేమి? నమ్మిన ఆదర్శానికి ప్రాణాలర్పించడం మహామతుల గుణము. అట్టివారి ఆదర్శం నచ్చినా నచ్చకపోయినా వారి త్యాగబుద్ధిని కొనియాడక తప్పదు.

ఇది ఏడుగురు ఆంధ్ర విప్లవ వీరుల ఆత్మార్పణ బుద్ధికి నిండు గుండెతో చేసిన కైవారాల సంకలనము భిన్నకవుల రచనలు ఇవి కాని, అసహాయులైన పౌరుల చంపడం ఎంతటి సాహసోపేత గుణమైనా ఆమోదయోగ్యం కానిది. ''బతికే అర్హతలేని పందల్ని పందుల్ని చంపడం నేరంకాదు'' అంటారు వీరు వ్యాళ్లు వీరిని సంఘద్రోహులు నరాంతకులనరా? ఈ ప్రతిక్రియానిగళానికి అంతమెక్కడ? అక్కడక్కడా జరిగే హత్యలతో విప్లవం పూర్తి అవుతుందని ఏ చరిత్రా చెప్పదు.

ఇక ఇందలి కవితాగుణం—ఆదర్శపాలనకైన భావోద్రేకంతో కవిత్వం స్పందిస్తున్నందున కవితలో జీవము—రస ఉన్నవి. ''ఉరి కంబం వణకింది'' శీర్షిక ఉజ్జ్వల భావోపేతం ''పెదాలపై చెదరని చిరునవ్వు'' అన్న ప్రయోగం, ప్రాణార్పణం చేసిన వీరుని నిబ్బరమైన గుండెను ప్రకటిస్తున్నది. రసవత్తర ప్రయోగాలు కొన్ని—విప్లవ నెలబాలుడు, విప్లవ డోలలో ఊగేకాంరేడు; లాల్ సలాములన్నది ఒక తమాషా ప్రయోగం

## 5. అరుణ కమలం

[కవితా సంపుటి, బొగ్గరపు. రాధాకృష్ణమూర్తి. క్రౌన్ 1/16, 24 పేజీలు; ధర: రు. 2/ — ప్రాప్తిస్థానము— S/o జాల రామయ్య; మెయిన్ బజారు; కనిగిరి; ప్రకాశం జిల్లా.]

వీరి కవితా కోరకం ఇప్పుడిప్పుడే విప్పారి గుబాళిస్తున్నది చక్కటి ఊహలు, వాటికి తగిన సరళ సుందర భాష ఒడుదుడుకు లేని నడక శ్రావ్యత ఈ కవితా గుణాలు. క్రమబద్ధమైన పురోగమనాన్ని విశ్వశ్రేయాన్ని కోరే మనసుగల ఈ రచయితకు వివిధ కవితారీతులు నచ్చుచున్నవి. అందుకే ''అడుగడుగునా మన నడవడి ఆదర్శం కావాలి'' అంటాడు (ముందడుగు) ''అనురాగం ఆటం బాంబుకంటె మిన్న'' అని చాటుతాడు (చేయగలిగితే) పరోపకార సేవా పరాయణతను కోరి మూఢనమ్మకాలను నాశనం చేయాలనే లక్ష్యమే ఈ కవిది. బాధ్యతలను పంచుకొనే (సహనశక్తి) ఆనందమే కవి గమ్యం.

''మనసుంటే మార్గ ముంటుంది'' వంటి సరళమైన సామెతలను (ఇంగ్లీషునుండి) రూపొందించగలడు. ''గండుతుమ్మెద చిన్న చీమ ఒకే పండుగ చేసినాయి'' హృద్యంగా ఉన్నది.

కవికి చాలా చక్కటి భవిష్యత్తు ఉన్నది కాబట్టి భాషపై రవ్వంత శ్రద్ధ పెట్టమంటా. ''కాసేచండగాడ్పులు'' (సాధ్యమా) వీచేవి గదా గాడ్పులు. ''కవనపు సవనంలో మూఢాచారాలను నైవేద్యంగా అర్పిస్తా'' సవనంలో అర్పించేది హవిస్సు అంటే బాగుంటుంది. తిరోగమనం అని పురోగమనానికి వ్యతిరేకార్థంలో ప్రయోగిస్తున్నాడు. తిరోగమనం అంటే కనబడకుండాపోవడమో, ఎండ్రకాయవలె అడ్డంగా నడవడమోగాని వెనుకకు తిరిగిపోవడం కాదు. ఈ పత్రికల సినిమాల మాట — పండితుల కేల ?

## 6. ఋతు మంగళము

[వాల్మీకి రామాయణము నందలి ఋతు వర్ణనములు. గుర్రం వెంకటసుబ్రహ్మణ్యం—అధివక్త. డెమ్మి1/8, 48 పుటలు, మూల్యము రు 2/—. ప్రతులకు : గ్రంధకర్త, సాహితీ సమితి; వేదంవారి అగ్రహారం, నెల్లూరు—2.]

సుబ్రహ్మణ్యంగారు పండిత కవులు. న్యాయవాదిగా లెక్కబడి, సాహిత్య రంగంలో లెక్కబడటం ఒక అపూర్వ అదృష్టం వీరి ఇంటి ఎలపాది సరస్వతీదేవి చల్లటి చూపులకు నోచుకొన్నవారు. ఈ తుమ్మగుంట ద్రావిడ బ్రాహ్మణ కుటుంబంలో, గుర్రం అప్పన్న శాస్త్రి (శబరిమల అప్పుడు వీరి కొలము సామి) కంపెనీ పాలనలోనే హైకోర్టు పండితుడుగా పని చేసినాడు.

ఈ కవికి సాంప్రదాయిక ప్రబంధఫక్కి, అభిరుచి వాసనలూ అవే. కాళిదాసు కృతులన్నిటిని (అప్పటికే పందలాది అనువాదాలున్నా) ఆంధ్రీకరించి, ఇప్పుడు వాల్మీకి సంస్కృత రామాయణంలో గల ఋతు వర్ణనలను తెనుగు పూవులుగా కూర్చినారు. ఈ ఎన్నికే ప్రత్యేక గౌరవాస్పదం, వాల్మీకి కవితా సౌరభాన్ని అక్కడక్కడా మూలాన్ని ఆఘ్రాణించగలుగుతున్నాను

వీరి అనువాదశయ్య జటిల పద గుంఫనం కలిగి, అర్థ సౌలభ్యం అక్కడక్కడా కాస్త తగ్గిఉండినా, మూల విధేయంగానే ఉంటుంది; విడదీసిన వారికి ఇంపుగానే ఉంటుంది. వీరి పద్య రచన బిరుసెక్కి పెళుసై నడక కొంత సాపీగా ఉండదు. చదువెక్కువైతే వచ్చే బెడదే ఇదిగా ఉండేటట్లున్నది

పెద్ద పీఠికలో, వాల్మీకి ఆత్మాశ్రయ బుద్ధితో భావకవులవలె చేసిన కవితా శిల్పాన్ని విపులంగా, సోదాహరణంగా, పాండిత్య ప్రకర్షక విషయ గౌరవంగా వ్రాసినారు.

ఇందలి ఆరు ఋతువుల వర్ణనము గంభీరమైన నడకతో అర్థపూర్ణమైన భాషలో ఉన్నవి

# 7. మందార మాల

[కవితా సంకలనము బి. అచ్యుతరాజు క్రౌను 1/16 60 పుటలు. మూల్యం రు. 3/- ప్రాప్తిస్థానము : ఆనంద వర్ధన ప్రచురణములు, 4-8-480 గౌళిగూడ, రామమందిరం దగ్గర, హైదరాబాదు-500012 ]

జీవకళ ఉట్టిపడే మందారం కుసుమార మఖపత్రం రామణీయకంగా ఉన్నది ఈమధ్య అందవికారంగా బైటిల్సు గూర్చడం ఒక యాలం వెర్రి అయిఉన్నది గదా !

ఈ కవికి మంచిధార కుదిరి ఉన్నది. ఇక పదాల కూర్పుకు చిక్కదనము అర్థపుష్టి ఇంకా ఎక్కువగా చేకూర్చుకోవాల. అలవాటులో ఈ కవితా గుణాలు అబ్బే లక్షణాలు కనబడుతున్నవి. వ్యక్తులపైన, మంత్రుల పైన ముఖ ప్రీతికి (?) వ్రాసిన పద్యాలు పేలవంగా ఉన్నవి ఈ మనుజేశ్వరాధనము వమ్మవద్దన్నది వీరి పోతనామాత్యుడే గదా !

''అందరు వచ్చి వేయండి'' లో మంచి ఎత్తిపొడుపులతో దెబ్బలు తీస్తున్నాడు చూడండి ''పంక్తిలోన రాహువుల బ్రాహ్మణులయ్యేదిలేదు, కేతువులను గురుడుపట్టి గొంతులు కోసేదిలేదు, సూతుల అగ్రిజాతులమని చేతులు నలుపగా వలదు, ఏకలవ్యులకు నిచ్చట ప్రాకటమును సీటు గలదు ''

''అర్థాపత్తి'' లో తన పేరు ఇమిడేటట్లు ''ఆనందం నొందండి లమృతమా జ్ఞానంతో'' అంటాడు అచ్యుత మంటే జారనిదిగదా! —ఒక్క శుద్ధిగలిగిన ప్రయోగం. ''అక్క తల్లివంటి అన్యకాంతల జూచి ఆరిభావమూని గోల చేయు మాను హీన జాతి మనుజులు హెచ్చిరి'' అని ధర్మానేదనను పొందుతున్నాడు; ఇది మానవుని మహిలపరచే హితసూక్తి ఈ ''రంగ రంగ మార భంగ లింగ'' పద్యాలు లోకానుభవంతో కూడిన సంఘ విమర్శనంగా ఉన్నవి. కవిత్వమూ మంచి పాకానబడినది. కాని, ఈ మకుటభావం ఆ తిరుమలేశునికి గూడ తెలిసేటట్లు లేదు

# 8. వేణీసంగమం

[ఖండికల సంపుటి, రావికంటి వసునందన్. క్రౌన్ 1/16 50 పుటలు; వెల.. రు 3-50; దొరకేచోటు-ఆంధ్ర సారస్వత పరిషత్తు, బొగ్గులగుంట; తిలకురోడ్డు; హైదరాబాదు; 500004.]

భావుకత వ్యుత్పత్తి, కవితాస్ఫూర్తి గలిగినధార, పద ప్రయోగ విలసనము ఈ కవి గుణాలు. మానసం ఆధ్యాత్మిక వాసనా బంధురం కావడంవల్ల భక్తి విశిష్టాద్వైత ప్రపత్తి మార్గాన గ్రంథమంతా ప్లావితమై ఉన్నది తాను పొందిన రామణీయకానుభూతిని చదివిన వారికి పంచిపెట్టగలిగిన నేర్పు ఈయన వ్రాతకున్నది భావానికి తగిన భాష, దివ్యనర్తకి మంజీర రావంవలె వినవస్తున్నది ప్రౌఢ సంస్కృత సమాసాలు, అప్పటమైన తియ్యటి తెనుగు జాతీయాలు శిల్పకోరకాలై అరవిప్పలో ఉన్నవి సామెతలను పద్యాలలో బాగా సహజంగా ఇరికించినాడు. గద్యం పద్యం పొంకంగా ఒయ్యారి నడకలతో నడుస్తున్నవి.

తల్లిపై చెప్పిన పద్యాలు రసార్ద్ర హృదయాల ప్రకంపింపజేస్తున్నవి. పూలవన్నె వేరు పూజ ఒకటే అన్న వేమన ఆట వెలదిని కొత్త అలంకారంతో బాగా ఆడిస్తున్నాడు (ఇది ఎమి జగతి) ''వర్షం''లో చక్కటి ఉత్ప్రేక్షలు గలవు. కృష్ణరాయల స్తుతి కవిసార్వభౌమ శ్రీనాథుని శయ్యగా ఉన్నది చివరి ''వేణీ సంగమం'' ఒక చిన్న రసవత్తర కావ్యం మధుర భక్తితో గ్రామ జీవన అకళంకశోభ కన్నులకు గట్టుతున్నది. ఈయన కథ చెప్పడంలో ఒకసొంపు ఒడుపు ఉన్నవి.

# 9. జైలు కోకిల

[మీసా నిర్బంధకాలం గేయాలు. కె వి. రమణారెడ్డి డెమ్మీ 1/8, 68 పుటలు; మూల్యం . రు 3/-ప్రతులకు.-గ్రంథకర్త, ఝుం ఝుం ప్రచురణలు; 10-6-27 కావలి-1, నెల్లూరుజిల్లా.]

''వగరుమేసి తిపిరిచ్చే కోకిల పంజరంలోఉన్నా చెట్టు కొమ్మనఉన్నా పాడి ఆనందింపజేస్తూనే ఉంటుంది కవిని జెయిల్లో పెట్టితేమాత్రం ఏమి? నిజాత్మానందానికి పాడక ఊరుకుంటుందా? పుస్తకానికి మంచి పేరు బెట్టినాడు ''ఆదర్శబలం ఆదర్శబలం'' ఉన్నవారు ఆ జెయిలులో నిరామయ అనిశ్చయ భవిష్య మనస్సు నింపగా, లోచూపుతో, తిక్కన అన్నట్లు ''భవ్యకవితావేశ ''తో భావతరంగితులౌతారు; వ్రాతగాడు వాటిని వ్రాస్తాడు, లోకమాన్య తిలకు మాండలే జెయిలులో, విశ్వకోశ మనదగిన గీతారహస్యం వ్రాసినాడు. గాంధిమహాత్ముని పుస్తకం గూడ కారాగార చీకటి మూలలో పుట్టిన విద్యుత్ప్రభలే. ఆంగ్లేయ మహాకవి ఆస్కార్ వైల్డ్ జెయిలులో ఉన్నతోన్నత, ఉదాత్తమైన De Profundisను వ్రాసినాడు ఈ పుస్తకాలు జైలు గీతాలే!

ఈ కవి అన్నట్లు ఈ సంకలనం ఆనందము ఆవేదనం కలగూర. ఇందు భావశబలత చక్కటి తెనుగు జాతీయాలతో మధుర సంస్కృత పదపల్లవాలతో అలంకరింపబడి ఉన్నది ఇందలి జాతీయాలను బుట్టల కెత్తవచ్చు. నెల్లూరు మాండలికాలే రమణా

రెడ్డి భాషకు జీవగర్ర అంటే మాండలీక పక్షపాతమనుకోబాకండి. ''కన్నీటితో కడిగిన ఆకాశం'' అన్నది కవితాసౌరభం గలది

ఆశల మరుభూమి ఆశయాల రుద్రభూమి — నీరవతా భేతాళుని మూపున మోస్తున్నది రాత్రి—కపాల తోరణాలు గట్టిన మృత్యుకల్యాణ మండపం-పేయభాష వర్షిణిగా భ్రమగొలిపే పాషాణి, యోగినిగా వ్యవహరించే వామాచారిణి — చంద్రుడుగాడు పరివేష గృహ నిర్బంధాన (రాజకీయ పరిభాష) పాండురోగి—పాము పడగ లాంటి తరగల తలలు—ఇట్లా ప్రౌఢి భావసాంద్రత భాషామాధుర్యం గలిగిన ప్రయోగాలు చాలా ఉన్నవి.

''సోమరి ఉదయం'' వివిధ రీతుల స్పందనకారి. ''పగలంతా రాత్రి ముట్టడిలోనే పడుంది'' అట! ఇట్టి సహజ సౌందర్య ప్రయోగమే—''వరదు బారిన వక్కరొయ్య చంద్రుడు'' ఈ నెల బాలుని వర్ణనా సారస్యం ఎండుర్రొయ్యను చూచిన వారికి బాగా తెలుస్తుంది.

కడుపు రంపపు కోతలకు పడిన ఈ ఖయిదీ ఆ ఎమర్జెంసీ రాణిని తిట్టడం, ఆమె యథార్థరూపం బయట బడుతున్న ఈ దినాలలో ఉచితమే అనిపిస్తున్నదిగదా!

## 10. నవత

[వేములవాడ నటరాజ కళానికేతన్‌వారి ప్రత్యేక సంచిక; చొప్పకట్ల చంద్రమౌళి, డెమ్మి 1/8—పేజి నంబర్లులేవు. వెల లేదు—సంపాదకుడు.]

నటరాజ కళానికేతనంవారు (వేములవాడ) తమ వార్షిక నివేదికరూపంలో ఈ సంకలనాన్ని వెలువరించడం ముదావహం. ఇది మంచి పద్ధతే. సావనీర్ మాదిరి ప్రకటనలున్నవి.

దీనిలో కవితలు కథలు వ్యాసాలు—మంచివి ఉన్నవి. గజ్జెల మల్లారెడ్డి, కాళోజి నారాయణరావు, బాపురెడ్డి మొదలగు సుప్రసిద్ధుల రచనలు గూడా ఉన్నవి సంఘ సభ్యుల రచనాభ్యాసానికి ఇది మంచి ప్రోత్సాహంగా ఉండగలదు.

*శ్రీ యిరువూరు కోదండరామిరెడ్డి*

## ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర నాటకోత్సవాలు - '77 ప్రత్యేక సంచిక

[సంపాదకులు డా. ఆడపా రామకృష్ణారావు, శ్రీ గోవింద రాజు, రామకృష్ణారావు, శ్రీ మండలి, బుద్ధ ప్రకాశ్, క్రౌన్ 1/4 సైజు. పుటలు 60+41+11, 14 పుటల ఛాయాచిత్రాలు, వెల 5 రూ ప్రచురణ — నాటకోత్సవ సంఘం, గాంధీ క్షేత్రం, అవనిగడ్డ, కృష్ణాజిల్లా.]

ఆంధ్ర సాహిత్యాభి వృద్ధికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కృషి చేస్తున్నట్లే సంగీత, నాటక అకాడమీ కూడా నాట్యకళాభి వృద్ధికి అమోఘంగా కృషి చేస్తున్నది. నాటక రంగాన్ని పునరుజ్జీవింపజేసి తెలుగు సామాజికులలో రసజ్ఞతను పెంపొందించడంద్వారా జాతిలో విజ్ఞాన వినోదాల వికాసానికి మిక్కిలి తోడ్పడుతున్నది ఆ సంగీత నాటక అకాడమీ ఆధ్వర్యంలో కృష్ణాజిల్లాలోని దివిసీమ వైజ్ఞానిక, సాంఘిక సేవా సమితివారూ, దివిసీమ లలిత కళాసమితి వారూ కలిసి అవనిగడ్డలోని గాంధీక్షేత్రంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర నాటకోత్సవాలను 1977 లో జరిపారు అవి మే నెల 21వ తేదీ నుంచి 31వ తేదీ వరకు 11 రోజులు వైభవంగా నిర్వహించబడినవి. ఆ మహోత్సవాల సందర్భంగా ఈ ప్రత్యేక సంచిక వెలువడింది.

ఇందులో మూడు భాగాలున్నాయి. మొదటిభాగంలో నాటక కళకు సంబంధించిన వ్యాసాలు నాటక కళావేత్తలు రచించినవి ఉన్నవి. రెండవ భాగంలో దివిసీమ ఘనతను వెల్లడించే వ్యాసాలున్నవి. మూడవ భాగంలో రాష్ట్ర నాటకోత్సవాల వృత్తాంతం తెలిపే ఒక వ్యాసం ఉన్నది.

తొలి భాగంలోని మొదటి వ్యాసం డాక్టర్ పి. ఎస్. ఆర్. అప్పారావుగారిది అందులో ఆయన తెలుగు నాటక రంగం తొలిదశ ఏ విధంగా ఉండినదీ సోదాహరణంగా వివరించారు. డాక్టర్ అక్కిరాజు రమాపతిరావుగారు గత శతాబ్దంలో తెలుగు నాటక రంగపు తీరు తెన్నులను తెలియజేశారు కూర్మా వేణుగోపాల స్వామిగారు వ్రాసిన ''ఆధునిక తెలుగు నాటక రంగం'' వ్యాసం వాటి నాటకానుభవాలను వెల్లడిస్తున్నది. 1950 వరకూ వృత్తి నాటకరంగాలె ప్రచారంలో ఉండేవనీ, ఆ తర్వాతనే ఔత్సాహిక నాటక రంగాలు పుంజుకున్నవనీ గరిమెళ్ల రామమూర్తిగారు తమ వ్యాసంలో నిరూపించారు కె. దేశపతిరావుగారు మన మహా నటులలో కొందరిని గురించిన వివరాలిచ్చారు. ఆ నటులలో వనారస — గోవిందరావు, హరిప్రసాదరావు, బళ్లారి రాఘవ, ఈమని లక్ష్మణస్వామి, స్థానం నరసింహారావు, నెల్లూరు నాగిరాజారావు, డి. వి. సుబ్బారావు, పులిపాటి వెంకటేశ్వర్లు, కపిలవాయి రామనాథశాస్త్రి, ఈలపాట రఘురామయ్య, గరికిపాటి రాజారావు, కె. వెంకటేశ్వరరావుగార్లున్నారు. సుప్రసిద్ధులైన యెడవిల్లి సూర్యనారాయణ, ఉప్పులూరి సంజీవరావు మున్నగువారు వీరి పట్టికకు ఎక్కలేదు. డాక్టర్ ఆడపా రామకృష్ణారావుగారు నాటక రచనకు, రంగస్థలానికీ ఉన్న సంబంధాన్ని వివరించారు. అంతటి నరసింహంగారు ఆంధ్రప్రదేశ్‌లో సాంస్కృతిక వికాసాన్ని గురించి తమ వ్యాసంలో చెప్పుతూ రాష్ట్రప్రభుత్వంలోని మంత్రివర్గం విద్యాశాఖ సంస్కృతీ పరిరక్షణకు పాటు పడుతున్నదన్నారు కె చిరంజీవిగారు సామాజిక ప్రయోజనాన్ని గురించీ, శ్రీ పూసల దివిసీమలో కళారంగ చైతన్యాన్ని గురించీ, విశ్వనాథ శర్మగారు పౌరాణిక నాటక రంగానికి కూచిపూడివారు చేసిన సేవనుగురించీ వ్రాశారు

రెండవ భాగంలో దివిసీమ ప్రశస్తిని తెలిపే పద్యవ్యాసాలు గురుజాడ — రాఘవశర్మగారిదీ, రజనీకాంతరావుగారిదీ ఉన్నవి కుండలి బుద్ధప్రకాశ్‌గారు తమ వ్యాసంలో దివిసీను వైభవాన్ని చక్కగా వివరించారు. సంగీత సాహిత్యాలలోనూ, సాంఘిక సేవా కార్యక్రమాలలోను ఆ ప్రాంతం ఎంత ప్రాముఖ్యం వహించినదీ ఈ వ్యాసంవల్ల తెలుస్తున్నది క్షేత్రయ్య, సిద్ధేంద్రయోగి, సారంగపాణి, నారాయణ తీర్థులు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, హరి నాగభూషణం, పారుపల్లి రామకృష్ణయ్య, ఘంటసాల మున్నగు సంగీత విద్వాంసులు, నాదస్వరంలో పేరు మోసిన శ్రీ దాలి పర్తి పిచ్చిహరి దివిసీమవారే! కాసుల పురుషోత్తమకవి, శ్రీవేటూరి శ్రీ ముటూరి, శ్రీ కోపల్లె, శ్రీ పింగళి లక్ష్మీకాంతం మున్నగు ప్రసిద్ధ విద్వత్కవులు దివిసీమవారే! ఈ సమాచారం పై వ్యాసాల వల్ల తెలుస్తున్నది. ఈ సీమలో అవనిగడ్డ కేంద్రస్థానాన్ని ఆక్రమించింది. అక్కడి గాంధీక్షేత్రం అనే సంస్థలో ప్రజాసేవకు సంబంధించిన ఎన్నో సంఘాలు పనిచేస్తున్నవి. ఆ వూళ్లో దివిసీమ సాహితీ సమితి, దివిసీమ లలిత కళాసమితి, దివిసీను మహిళాసేవా సంఘం, ఉచిత ఆయుర్వేద వైద్యశాల, దివిసీమ వైజ్ఞానిక సాంఘిక సేవాసమితి, దివిసీమ బాలానంద సంఘం కూడా ఉన్నవి వాటిని గురించిన సంగ్రహ వ్యాసాలు ఈ విభాగంలో చేర్చబడినవి. ఒకేచోట ఇన్ని సంఘాలు ఉండడం అచటి జనుల సేవాసక్తికి దృష్టాంతం. అచ్చట—ఆంధ్రప్రదేశ్ విద్యా సాంస్కృతిక శాఖా మంత్రి ఎం. వి. కృష్ణారావుగారు చేస్తున్న కృషిని ఒక ప్రత్యేక వ్యాసం ప్రశంసిస్తూ ఉన్నది. ఇది నాటకోత్సవాల ప్రత్యేక సంచిక అయినా దివిసీమ సమాచార సర్వస్వమని కూడా చెప్పవచ్చును.

ముఖచిత్రం, సంచికలోని ఛాయాచిత్రాలు కూడా పాఠకులను ఆకర్షించగలవు.

నాటకోత్సవాల నిర్వాహకుల పరిశ్రమ ప్రశంసించదగినది.

*శ్రీ బులుసు వేంకటరమణయ్య*

# గీ తా మృ త ము

[రచయిత : కవిశేఖర శ్రీ కొండేపూడి సుబ్బారావు, డెమ్మీ సైజు 34+327పుటలు, వెల : సాధారణ ప్రతి రు. 12. లైబ్రరీ ప్రతి రు. 15. ప్రాప్తిస్థానం : శ్రీ కొండేపూడి సుబ్బారావు, 47–10–5 ద్వారకానగర్, విశాఖపట్టణం–16 ]

భారతీయులనేకాక విదేశీయులను కూడా మిక్కిలి ఆకర్షించి, అలరింపజేసిన ఉత్తమగ్రంథాలలో మొదటిది భగవద్గీత భారతీయ భాషలలోనేకాక విదేశ భాషలలోనూ దాని అనువాదాలు, సారములు ఉన్నవి. తెలుగులో దీని అనువాదాల సంగతీ, సార, సంగ్రహాల సంగతీ చెప్పనక్కర లేదు. ప్రతిభావంతులైన పండితులు, విమర్శకులు, కవులు వారి వారి దృక్పథాన్ననుసరించి దానిని అర్థం చేసుకుని ... రచనలను సాగిస్తూ ఉంటారు. అట్టి రచనలలో ఈ "గీతామృతము" ఒకటి ఈ విషయాన్ని రచయితయే "తీసిన యూపిరే తిరిగి తీసిన యట్టుల నెందఱెందరో, వ్రాసిన గీత మరల వ్రాసితి నాడగు నాత్మచింతనా, భ్యాసము నాది కాన" అని చెప్పికొన్నారు.

ఇందులో మొదట భగవద్గీతలోని శ్లోకం, తర్వాత రచయిత చేసిన ఆంధ్రానువాదం, ఆ తర్వాత తాత్పర్యం ఇయ్యబడినవి ప్రతీ అధ్యాయానికి ముందు ఆ అధ్యాయంలోని సారాంశం సంగ్రహించబడినది. అందులో ప్రధాన విషయం, ముఖ్యాంశములు, సారాంశము అనే ఉప శీర్షికలు ఉన్నవి. వీటిని మొదట తెలుసుకుంటే పిదప ఆ అధ్యాయంలోని విషయం సుగమం కాగలదు.

రచనా పద్ధతికి ఒక ఉదాహరణ —

శ్లో. ప్రకృతే ర్గుణ సమ్మూఢాః
సజ్జన్తే గుణ కర్మసు,
తా నకృత్స్నవిదో మన్దాన్
కృత్స్నవి న్న విచారయేత్. [కర్మయోగము — 29]

అనువాదం—

ప్రకృతి గుణముల వశులయి భ్రమను మునిగి
ఇంద్రియాదుల విషయమ్ములందె రక్తు
లైన మందబుద్ధులను అల్పజ్ఞమతుల
జ్ఞాని చలియింపగాఁజేయ జనదుపార్థ!

తాత్పర్యము—

ప్రకృతి గుణముల వశులై భ్రాంతిలోబడి, వాని కర్మములందే ఆసక్తులైన, మందబుద్ధులైన అల్పజ్ఞులను జ్ఞానులగువారు చలింపజేయరాదు. చలింపజేసినచో వారు కర్మము లొనర్చుటయే మానుకొందురు. [పుట–62]

తాత్పర్యం కొంత విపులంగా ఉంటేనేకాని పాఠకులకు సులభంగా అర్థంకాదని తోస్తున్నది. పద్యంలో "అల్పజ్ఞమతుల" అని ఉన్నందున, తాత్పర్యంలో 'అల్పజ్ఞులయొక్క మనస్సులను చలింపజేయకూడదు' అని చెప్తే బాగుగా ఉండేది.

భగవానుడు భక్తిజ్ఞాన కర్మయోగాలు మూడింటినీ చెప్పినా ప్రధానంగా అర్జునుడికి కర్మయోగాన్నే ఉపదేశించి యుద్ధానికి ప్రోత్సహించాడు. దీనిని పురస్కరించుకుని రచయిత "శ్రీమద్భగవద్గీత—సాంఘిక జీవనము" అనే శీర్షికతో 17 పుటలలో సాంఘిక జీవనానికీ, గీతకూగల సంబంధాన్ని వివరించారు. ఇది యీ రచన ప్రత్యేకత ఇందులో 'కర్మయోగాభ్యాసము, కర్మయోగ ప్రశస్తి, గీతా ప్రతిభ' అనే ఉపశీర్షికలలో సుబ్బారావుగారు తమ అభిప్రాయాలను వెల్లడించారు.

భగవద్గీతామృతాన్ని పానం చెయ్యడానికి ఈ రచన చిల్లులేని పాత్ర అని అనుకోవచ్చును.

*"ఆంగీరస*

Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.